# చతుర ప్రపంచం

## సరికొత్త ఆట

ఫ్రాన్స్‌కి చెందిన కొందరు ఓ కొత్త ఔట్‌డోర్ గేమ్‌ని కని పెట్టారు. దాని పేరు ట్రాంబోలిన్. 18వ శతాబ్దంలో యూరప్‌లోని సర్కస్‌లలోని ఓ ఐటంను తీసుకుని ఫ్రెంచ్ దేశస్థుల టీమ్ ఈ ఆటను కనిపెట్టింది.

ఏడూ బై పధ్నాలుగు అడుగుల వైశాల్యంలో భూమికి నాలుగు అడుగుల ఎత్తున వున్న మంచం మీద ఎగరడమే ఈ ఆట. అయితే మంచం మీద మామూలు నవారుకి బదులు పోలీఫైబర్‌తో చేసిన దగ్గరదగ్గరగా వుండే సన్నటి నవారు బిగించి వుంటుంది. వాటి అడుగున బలిష్టమైన స్ప్రింగులుంటాయి. ఆటగాళ్లు ఈ ట్రాంబోలిన్ మీద నిలబడి పైకి ఎగిరి లేచి మళ్లీ దానిమీద పడుతూ గాల్లోకి ఎగరాలి. అలా ఎగిరినపుడు గాల్లో పిల్లిగంతులు వేయాలి. తక్కువ టైమ్‌లో ఎవరెన్ని పిల్లిగంతులు వేస్తేవాళ్లు గెలిచినట్టు. కేవలం 14 నుంచి 40 వయసుగలవారికే పరిమితమయిన ఈ ఆటలో అలా ట్రాంబోలిన్‌మీద గాల్లోకి 50 అడుగులదాకా లేస్తున్నారు ఫ్రెంచి ఆటగాళ్లు.

సిడ్నీలో ఇద్దరు పక్కపక్కనే రెండు ట్రాంబోలిన్స్ వుంచి అద్దంలో ప్రతిరూపమా అన్నంత ఖచ్చితంగా ఒకేవిధంగా గాల్లోకి ఎగిరి పిల్లిగంతులు వేసే శిక్షణలో నిమగ్నం అయివున్నారు. ఈ ప్రాక్టీస్‌ని మంచు నిండిన ప్రాంతంలోగానీ మెత్తటి ఇసుకగల బీచ్‌లలోగానీ సాధారణంగా చేస్తుంటారు. ఎందుకంటే ట్రాంబోలిన్ మీదకాక బయట పడితే కాలో, నడుమో విరిగే ప్రమాదముంది. తమ ప్రాక్టీస్‌ని వీడియో తీసి తరవాత ఆటగాళ్లు వేసి చూసుకుని తాము ఎక్కడ తప్పుచేశామో గ్రహించి తర్వాత ఆ తప్పును సరిదిద్దుకోవడం జరుగుతుంది. కాళ్లకి స్కయిస్ కట్టుకుని మంచులో ఎత్తు ప్రదేశంనుంచి జారి




గాల్లో ఏక్రోబేటిక్స్ చేసుకుంటూ నేలమీది దిగువ భాగానికి వచ్చే స్నో-స్కయింగ్ ఆటకి 1984 ఒలింపిక్స్‌లో చోటు చిక్కడంతో ఫ్రాన్స్ ట్రాంబోలిన్ ఆటగాళ్లు ఒలింపిక్స్ కమిటీని తమ ఆటని కూడా ఒలింపిక్స్‌లో అంగీకరించమని కోరారు. అందుకు అంగీకారం కూడా లభించడంతో 2,000లలో జరిగే ఒలింపిక్స్‌లో తొలిసారిగా ఈ ఆటను చూడచ్చు. అయితే కేవలం సంపన్న దేశాల వారే దీనికి సంబంధించిన ఆటగాళ్లను సిద్ధంచేస్తున్నారు. ఈ ఆటలో పాల్గొనే వాళ్లకి ఒలింపిక్ కమిటీ ఓ కొత్తనిబంధనను

పెట్టింది. వాళ్ల వయసుకి ఆరోగ్యరీత్యా వుండాల్సిన బరువుని మించి వుండకూడదు. ఎందుకంటే ఒంటిబరువునుబట్టి పైకి ఎగిరే దూరం మారుతూ వుంటుంది. దాంతో పాల్గొనే ఆటగాళ్లు ఆగస్టు 1999 నుంచీ బరువు విషయంలో జాగ్రత్త వహిస్తు న్నారు.

## ఫ్రెంచి లాటరీలు

ఫ్రాన్స్‌లో... ప్రతి వారం కొందరు కష్టపడకుండానే లక్షాధికారులవుతూ వుంటారు. ప్రతి బుధవారం పారిస్‌లోని పలైస్‌డి బెయిలెట్ అనేచోట సాయంత్రం ఓ లాటరీ నడుస్తూవుంటుంది. అక్కడ ఆరు సిలెండర్లు వుంటాయి. ఒక బటన్ నొక్కితే ఆ ఆరు సిలెండర్లలో చలనం ఏర్పడుతుంది. ప్రతి సిలెండర్‌కీ 0 నుంచి 9 దాకా అంకెలు చెక్కి వున్న ఇనప బాల్స్ వుంటాయి. ఒక్కో సిలెండర్‌లోంచి ఒక్కొక్క బాల్ చొప్పున ఆరు బాల్స్ ఓ సంచిలోకి పడతాయి. ఆ ఆరు బాల్స్ మీదకల నంబర్లను కలిపితే 6 అంకెలు గల ఓ నంబరేర్పడుతుంది. ఆ సంఖ్య 'ఫ్రెంచి నేషనల్ లాటరీ' నిర్వహించే లాటరీలో ఆ వారపు ప్రథమ బహుమతి గ్రహీత అవుతుంది. 2 కోట్ల ఫ్రెంచి ఫ్రాంకులు ఆ సంఖ్యగల లాటరీ టిక్కెట్ యజమానికి వెడతాయి.

1943కి ముందునుంచే లాటరీ నేషనల్ ఇలా లాటరీలను నడుపుతోంది. ఈ లాటరీలు ఎంత పాప్యులర్ అయ్యాయంటే ప్రజా డిమాండ్ వల్ల 1943 నుంచీ వారానికొకసారి ఈ లాటరీను నిర్వహిస్తున్నారు. అప్పట్లో మొదటి బహుమతి 8 లక్షల ఫ్రాంకులుండేది. మొత్తం 93 కోట్ల 60 లక్షల ఫ్రాంకులని ప్రతివారం ఈ లాటరీ ద్వారా గెలిచిన వారికి పంచుతూ వుంటారు.

ఒక్కో లాటరీ టిక్కెట్టు విలువ 260 ఫ్రాంకులు. అయితే సగటు కార్మికుడు అంత వెచ్చించి ఓ టిక్కెట్టు కొనలేడు. కాబట్టి దాంట్లో 10వ భాగంతో 26 ఫ్రాంకులకే టిక్కెట్టు అమ్ముతారు. ఆ నెంబరుకి తగిలిన బహుమతి సొమ్ముని వాటిని కొన్న 10 మందికి సమానంగా పంచుతారు.




ఫ్రాన్స్ దేశంలోని నాలుగు లక్షల దుకాణాల్లో ఈ పదోవంతు టిక్కెట్లను అమ్ముతారు. అలా అమ్మకానికి పెట్టిన టిక్కెట్లలో 80 శాతం తక్కువకాకుండా అమ్ముడవుతూ వుంటాయి. వాటిమీద ఇచ్చే కమిషన్ తక్కువయినా దుకాణదారు పోటీపడి అమ్మడం ఎందుకంటే ఆ టిక్కెట్ల కోసం వచ్చినవాళ్లు తమ దుకాణంలో ఇంకేమయినా కొంటారని. వైన్ ఫ్యాక్టరీ వర్కర్, ఆటోమొబైల్ మెకానిక్, రైల్వే ఇంజన్ డ్రయివర్ ఇలా పేద ప్రజలకే ఈ లాటరీ అధికంగా తగలడానికి కారణం... ధనవం

తులకి పెద్దగా ఆశక్తి లేక వాటి జోలికి పోకపోవడమే.

"వారంవారం బహుమతి వస్తుందేమో అనే ఆశ ఇచ్చే థ్రిల్లు చాలు మేము హుషారుగా బతకడానికి" అంటారు అక్కడ లాటరీ టిక్కెట్టు కొనే ప్రజలు.

---

# డర్టీడాలర్

అమెరికాలో ఒక్క డాలరు నోట్లు మాత్రమే ఆరున్నర బిలియన్స్ సర్క్యులేషన్‌లో వున్నాయి. శాన్ ఫ్రాన్సిస్కోకి చెందిన 'నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రీసెర్చి' ఇటీవల అమెరికాలోని వివిధ ప్రదేశాలనుంచి కొన్ని ఒక డాలరు నోట్లను సేకరించి వాటిమీద బాక్టీరియా క్రిములున్నాయేమోనని పరీక్షలు జరిపింది. ఆ నోట్లని పరిశుద్ధమైన రక్తంగల చిన్న ప్లాస్టిక్ డబ్బాలో ముంచి వాటిని 24 గంటలపాటు 98-6 డిగ్రీల ఫారిన్‌హీట్ (మనిషి ఒంట్లోని ఉష్ణోగ్రతకి సమానం) ఉష్ణోగ్రతలో 24 గంటల పాటు వుంచారు. ఆ రక్తంలో అనేక రకాల బాక్టీరియా క్రిములు మైక్రోస్కోప్ లోంచి చూస్తే కనపడ్డాయి. అయితే వాటిలో 70 శాతం క్రిములు మనిషికి హాని చేయనివి. 30 శాతం మాత్రం మనిషి ఆరోగ్యాన్ని దెబ్బతీసే క్రిములు ఆ నోట్లని అంటుకుని వుండటం కనిపించింది. ఇందులో ఓ రకం బాక్టీరియా ఆహారపదార్థాల్లోకి చేరితే 24 గంటల్లో విస్తరించి ఫుడ్ పాయిజనింగ్‌కి దారి తీస్తుంది అని తేలింది.




డబ్బుని అమెరికన్స్‌లో చాలామంది శుభ్రంగా వుంచరు. వాటిమీద బీరుచుక్కలు అధికంగా ఉంటాయి. పబ్‌లో బీరు తాగేముందు డాలర్ నోటుని కౌంటర్ మీద వుంచి తాగడంతో చుక్కలు వాటిమీద పడతాయి. కొందరు బీరు సీసాని లేదా గ్లాసుని ఆ నోటుమీద వుంచి తాగుతారు కింద తడవ కూడదని. ఇంకా వాటి మీద నీళ్ల చుక్కలు కూడా బాక్టీరియాని ఆకర్షిస్తాయి.

కాబట్టి ఈ పరిశోధనలు జరిపిన ఆ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ డబ్బుని చేత్తో తాకాక సబ్బుతో చేతులు శుభ్రంగా కడుక్కున్నాక భోజనం చేయాలని సూచిస్తున్నారు.

మనదేశానికి వస్తే హోటల్‌లో భోజనం చేసేవారు డబ్బిచ్చి భోజనం టిక్కెట్టుకొన్నాక చేతులు కడుక్కుని తినడం శ్రేయస్కరం. అలాగే కూరలు కొన్నాక డబ్బివ్వాలిగానీ ముందే డబ్బు పట్టుకుని బండి దగ్గరకు వెడితే నోట్లనుంచి మన చేతులద్వారా బ్యాక్టీరియా మనం ఏరుకున్న కూరల్లోకి వెళ్లడం తథ్యం అని గుర్తుంచుకోవాలి. అమెరికాతో పోలిస్తే మనది అంత శుభ్రమైన దేశం కాదు కాబట్టి మన నోట్లలో బాక్టీరియా అధికంగా వుండే అవకాశం ఎక్కువేమరి.



# 'మాయలేడి' పై సమీక్షలు

నవంబర్ 'చతుర' లో ప్రచురితమైన గోపరాజు నాగేశ్వరరావు రచన 'మాయలేడి' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## తీరం చేరని కెరటాలు

(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)

కెరటానికి ఆరాటం తీరం చేరాలనీ అన్న కవి పలుకులు ఎంతో భావగర్భితంగా వివిధ కోణాల్లో వివిధ భావనలు కలిగిస్తాయి. కెరటం తీరానికి చేరువలోనే వుంటుంది. సాఫీగా లేస్తూ పడుతూనే వస్తుంది. ఒక్కోసారి ఉవ్వెత్తున లేస్తూ వేగం పెంచుతుంది. తీరానికి చేరువ అవుతూండగానే మరల వెనుకకు నెట్టబడుతుంది. అదే పంథాలో బతుకు సముద్రంలో చాలామంది కోరికలు కూడా తీరం చేరని కెరటాలే అనే సత్యం 'మాయలేడి'లో నిగూఢంగా ఉంది.



కోరికలు అనంతం. కోరికలే అన్ని అనర్థాలకు మూలం అనుకుంటే 'మోక్షం' పొందాలనుకోవడమూ ఓ కోరికే. అయితే పేదవాని కోరికలు మితం. మరి ఆ సమంజమైన అతిచిన్న కోరికలు కూడా పేతురు, మార్తమ్మల వంటి సామాన్యుల జీవనయాత్రకు సుదూరతీరం అనేది వాస్తవమే గాక 'ముక్కుపుడకలాంటి చిన్న కోరికను **కూడా** తీర్చలేని ఎందరో సగటు భర్తల అంతర్మథనమే రచయిత కలంనుండి జాలువారిన 'మాయలేడి'. తాతలు, తండ్రులు మిగిల్చిన ఆస్తిపాస్తులో, అడ్డదారిన శబ్బరపనులు చేసి ఆర్జించిన సంపాదనో ఉన్నవారే కాస్తా కూస్తో ఖరీదైన జీవనయానం సాగించగలరు. కొంతమంది భోగలాలసలో తేలియాడనూగలరు. అలాగాక నీతినియమాల పరిధుల మధ్య ఓలలాడేవారూ, అందులోనూ రెక్కాడితేగాని డొక్కాడని సామాన్యులకు బతుకు అశనిపాతంగా, అతిమితమైన చిన్నపాటి కోరికలు కూడా కలలుగా అందని తీరాలుగానే మిగిలిపోతాయి అనే నిత్యసత్యాన్ని కళ్ళకు కట్టినట్లు నవలలో పొందుపరచారు.

విషజ్వరంకన్నా భయంకరమైన పేదరికంలో కమ్మని కలలు కనడమేకాని కమ్మనైనవి అనుభవేద్యం కావు. కోరికలు పరుగులు తీస్తే పేదరికం పగ్గం వేస్తూ వుంటుంది. అనివార్యపు అవాంతరాలు ప్రత్యక్షంగా లేక పరోక్షంగానైనా తీరాన్ని దూరంచేస్తూ బతుకునే నిర్వీర్యం చేస్తూవుంటాయి అనేది నర్మగర్భితంగా నవలలో ఇమిడ్చారు.

నిజానికి ఏ కోణంలో చూసినా నష్టపోయేది పేదవాడే. అసలు అందరికీ

కవర్‌ఫొటోగ్రాఫర్: కె.భాస్కర్

అలుసు **పేదవాడే**. 'రాజకీయపు పోకడే' మానవ మనుగడగా మారిన నేటి ట్రెండ్‌లో ఉన్నవాడిని ఎవరూ ఏమీ చేయలేరుగాని వారి వారి అవసరాలకు బలిచేసేది చివరికి పేదవాడినే. పేదరికం ఓ శాపమై మేకవన్నె పులియైన రాజకీయపు 'మాయలేడి' వెంట పరుగులిడితే ఈ జీవన చదరంగంలో పావులుగా బలైపోయేదీ ఎక్కువగా పేదవారే.

గోపరాజుగారు లోగడ రాసిన 'నరమేధం' లా సినీమా ఫక్కీలో గాకుండా అనుదిన జీవితయాత్రలో నిత్యమూ తారసపడే యదార్థ సంఘటనలు యథాతథంగా, నవలగా మలిచారు. కోర్కెకైనా చంపుకోవాలి లేదా నీతినియమాల అవధులైనా దాటాలి. లేదంటే బలిపశువుగా మారాలి తప్ప బతుకు పయనంలో తీరం చేరేందుకు మార్గం పేదరికానికి లేదు అనే వాస్తవాన్ని చక్కగా నవలా రూపం చేశారు.

**–టి. త్రినాథ్**
ఒరిస్సా-761 208

## భేషైన ఇతివృత్తం

**(ద్వితీయ బహుమతి రు: 75/– పొందిన సమీక్ష)**

శ్రీ గోపరాజు నాగేశ్వరరావుగారి "మాయలేడి" ఇతివృత్తం గొప్పది. అట్టడుగు ప్రజల జీవితాలలోని స్థితిగతులను రచయిత హృద్యంగా రచించారు. భార్యకు ముక్కుపుడక చేయించాలనే పేతురు చిన్న కోరిక, అతడినీ అతడి భార్యనే కాక, పాఠకులను కూడా కదిపి కుదిపేస్తుంది. సామాన్య జీవితాలలోని చేదు సంఘటనలు వారిని ఏ చిన్న కోరికలనూ తీర్చుకోనీయవు. పేతురు ముంత ఎన్నిసార్లు నిండినా వారి ముచ్చటకి ఉపయోగపడలేదు.

బడుగు ప్రజలలో నీతినిజాయితీలు, కష్టపడే స్వభావం కలవారు కోకొల్లలు. అటువంటివారికి ప్రతినిధే 'పేతురు'. అతడి చిన్న ప్రపంచంలో వృత్తిపట్ల అంకితభావం, తనను నమ్ముకొన్న భార్యాబిడ్డలపై అవధులు లేని ప్రేమ మనం చూస్తాం. ఇటువంటి సామాన్య వ్యక్తి వ్యవస్థను ఆకళింపు చేసుకొన్న తీరు, దాన్ని విమర్శించిన తీరు మనల్ని ఆశ్చర్యపరచదు. ఆవేదన పరుస్తుంది. అతడికి ఎదురైన సంఘటనలే ఆ స్థితికి కారణమని గ్రహిస్తాం. పేతురులాంటివాళ్ళు పిడికిలి బిగిస్తే, యోహానే కాదు అతడికి ఆశ్రయమిచ్చే రాజకీయ నాయకులు కూడా భంగపడక తప్పదు. అదే నవల ద్వారా రచయిత చెప్పారు.

'మార్తమ్మ' పాత్రలో అమాయకత్వం కొంత కన్పించినా దాన్ని మాయంచేస్తూ లోకం గూర్చి ఆమె ఆలోచనలను తెలుసుకొన్నాక మనం తలకిందులవుతాం. యోహాను లాంటి కాముకుణ్ణి, వాడి ఎత్తులను అతితేలికగా చిత్తు చేసిన తీరుకు ముగ్ధులవుతాం. బురదలో పుట్టిన పద్మానికి మలినం అంటనట్లు 'ముత్యాలమ్మ' పాత్ర నవలకే వన్నె తెచ్చింది. మార్తమ్మలోని పాతివ్రత్యం మనసుని జారనీయలేదు. ఆమె దరిద్రం ఎంత అనుభవించినా నైతిక విలువలను కోల్పోక పోవడమే ఆమె పాత్రను ఎత్తుకు తీసుకెళుతుంది. 'ముత్యాలమ్మ' పాత్ర హుందాగా సాగింది. మరుగున పడిన మాణిక్యాలు ఇలాంటి వాళ్ళు మన సమాజంలో ఎందరో ఉన్నారు. వారి జీవితాలలోని చేదునర్థం చేసుకొంటే వారిపై ఎవరికీ తేలికభావం ఉండదు.

నవలలో నచ్చని విషయం ఒకటే. 'ఏలియా' వంటి పసివాడిచేత హత్యలు చేయించడం. ముగింపు బాగుండలేదు. మాదిగపల్లె అంతా పిడికిలి బిగించి పోరాడితే చట్టం, న్యాయం వారికి విజయం తప్పక కలిగిస్తాయి. చైతన్యం పొందిన ప్రజలు అన్యాయాన్ని అవలీలగా ఎదిరించగలరు. గడ్డిపరకలు కలిపి తాడుగా పేనితే మదపుటేనుగుని సైతం బంధించ**డం**



లేదా? ఏలియాను గమనించి కూడా ముత్యాలమ్మ వారించకపోవడం అతడు చేయబోయేపనికి ఆమె ఆమోదం లభించి నట్లే అయింది. దీనివలన మార్తమ్మ బిడ్డ పట్ల ఆమె స్పందన సరిగా లేదన్పిస్తుంది. వీటిని తప్పిస్తే నవల ఆద్యంతం బావుంది.

-టి. సూర్యనారాయణమూర్తి,
నాగూరు.

## ప్రతీకాత్మక నవల

***(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)***

"**మా**యలేడి" నవల ప్రతీకాత్మక రచన. అరణ్యవాసంలో సీత మాయలేడిపై మరు లుగొని, రావణుని చెరలో చిక్కి కష్టాల పాలైంది. మాయలేడికి ప్రతీక ఈ నవలలో ముక్కుపుడక. పూట గడవడమే కష్టమవు తున్న దళితుడు పేతురు భార్య ముక్కుపు డక కోసం ప్రలోభాలకి లోబడి సాటి మని షిపై దౌర్జన్యం చేసి హత్యాప్రయత్నం నేరం మీద పోలీసుల కబంధహస్తాలలో పడరాని పాట్లు పడతాడు. చివరకు భార్యే హత్యకి గురవుతుంది.

నవలలో ప్రధాన పాత్రల పేర్లు బైబిలు గ్రంధంలోనివి. ఇవి ఆయా పాత్రల శీలస్వ భావాలకి, ప్రవర్తనకీ అద్దం పడతాయి. బైబి లులో పేతురు ప్రభువాక్య ప్రచారం కోసం అనేక కష్టాలు ఎదుర్కొన్నట్లే ఈ నవలలో పేతురు దృఢచిత్తంతో కష్టాలెదుర్కొంటాడు. మార్తమ్మ ప్రభుభక్తి పరాయణురాలు. నవ లలో ఈమె ఏ ప్రలోభాలకీ తలవంచ కుండా, నీతికీ నిజాయితీకి కట్టుబడి చివరికి కపట శ్రేయోభిలాషి యోహాను చేతిలో కడ తేరింది.

నవలలో ఏలియా చిన్నవాడైనా, అన్యా యానికి దౌర్జన్యానికి ప్రతీకారంగా మాత్ర హంతకుని సంహరించి హింసకి ప్రతిహింసే ప్రస్తుత పరిస్థితులలో అనివార్యమని రుజువు చేస్తాడు.

ముఖ్యపాత్రలకి సపోర్ట్‌గా నిలిచిన ముత్యాలు మార్తమ్మ తనని అక్క అని పిలి స్తేనే పొంగిపోతుంది. మార్తమ్మ బాహ్య సౌందర్యంతోపాటు శీలసౌందర్యానికీ ముగ్ధ రాలై, ఆమె వంచించబడకుండా కాపాడు తుంది. అంతటితో ఆగక హంతకుడు యోహాను ఉనికి తెలియజేసి ఏలియా ప్రతీ కారం తీర్చుకుందుకు పరోక్షంగా దారిచూపి స్తుంది.

వాస్తవ జీవితాన్ని ప్రతిబింబించి, పోలీసు వ్యవస్థని తూర్పారబట్టి, వర్గవైషమ్యాలని విశదీకరించిన నవల 'మాయలేడి'.

-శారా,
మద్దెలపాలెం-530 013.

## నవరామాయణం

***(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)***

**భా**ర్య తెమ్మన్న 'మాయలేడి' కోసం పోయి సీతాపహరణ తాలూకు వ్యధకు లోనయి ఇక్కట్లపాలయిన రామాయణ కథానాయకునిలా-

పేతురు తన స్థాయిలో కేవలం పెళ్లాం ముక్కుపుడక కోసం ముప్పుతిప్పల పాలయి చివరకు శాశ్వతంగా ఆమెను కోల్పోయిన వైనం-నవంబర్ చతుర నవలగా హృదయా లను ద్రవింపజేసింది. గోపరాజు నాగేశ్వర రావుగారి మాయలేడి, మార్తమ్మ ముక్కుపు డక మోజును బ్యాక్‌డ్రాప్‌గా పెట్టుకుని పోలీస్ డిపార్ట్‌మెంట్‌లోని అంతర్నాటకాలు, సమకాలీన రాజకీయాలలోని శ్రీ వైష్ణవమా యలు బహిర్గతపరుస్తూ, ప్రత్యక్షంగా జరు గుతున్న దోపిడీ, పీడనలను కళ్లకు కట్టినట్లు చూపిస్తుంది. ముఖ్యంగా దళితుల మధ్య తగవులు పెట్టడం, విడగొట్టడం వాళ్ళు కష్టాల పాలయితే ఆదుకున్నట్లు నటిం





చటం- చివరకు వాళ్ళ ఒకేఒక్క హక్కయిన ఓటుతో సీట్లు సాధించుకునే క్రమంలో-

ఒక పద్ధతి ప్రకారం రాజ్యాంగ వ్యవస్థ సాగించే హింస వున్నదున్నట్లుగా వాస్తవికంగా సృజించిన రచన ఇది!

ఈ ఇతివృత్తం పరిధిలో అన్ని అంశాలను సహజమైన శైలితో, చక్కని తేలిక పదాలతో ఖచ్చితమైన వ్యాఖ్యలతో రచయిత, ఈ (అ) వ్యవస్థలోని దోపిడీ, పీడనలకు గురయ్యే వర్గాల అసహాయత్వాన్ని వేదనని, ఉక్రోషాన్ని, అల్పసంతోషాన్ని అద్భుతంగా మలిచేరు.

"మానం పోయే పనిచేయను. శబ్బర పన్లు నా శాతగాదు" అని కరాకండిగా చెప్పే పేతురు పాత్ర ఆద్యంతమూ ఒక పేద, అమాయక, నిజాయితీకల, సాధారణ దళిత మనస్తత్వాన్ని ప్రతిబింబిస్తుంది. అలాగే "నాకు సదువులేదు, గేనంలేదు. ప్రెపంచకం తెలవదు. తెలిసిందల్లా నీలుపల్లానికి బార్త య్యనీ, పాలు తెల్లంగుంటయ్యనీ. జన్మనిచ్చిన అమ్మా నాన్న సిన్నప్పటికాడ్నించి నేర్పిచ్చిందీ, నూరిపోసిందీ మంచిదని, ఆళ్లు సీదరిచ్చుకుంది శబ్బర అని మాత్రం తెల్సు నాకు" అనే మార్తమ్మ పాత్ర చిట్టచివరివరకూ కల్లాకపటం తెలీని స్వచ్ఛమైన మంచితనానికి, హృదయానికి అద్దం పడుతుంది. ఇలా పేతురు, మార్తమ్మలలో వున్న... సహజంగా జనంలో వుండాల్సిన ఈ సహజ లక్షణాలను ఆదర్శవంతంగా చెప్పుకునే దయనీయస్థితిలో వున్న నేటి దుష్ట వ్యవస్థ వికృతరూపాన్ని అసహ్యించుకునే విధంగా వున్న రచన ఇది!

ముత్యాలమ్మలాంటి పతితుల, యోహాను వంటి భ్రష్టుల, మార్తమ్మలాంటి బాధాసర్ప ద్రష్టుల, పేతురు లాంటి దగాపడ్డ తమ్ముల-వెక్కిళ్లతో గుక్కతిప్పుకోకుండా సాగిన రచన ఇది!!

కేవలం ఒక్క చిన్న ముక్కుపుడకే మరీచిక అయ్యి పోలీసులు, రాజకీయనాయకులు మారీచులై, మాయలేళ్లై మోసగిస్తే తేలిగ్గా ఒక్కసారి కాదు పలుమార్లు మోసపోయే పేతురులాంటివాళ్ళు ఈ దేశపు సగటు ఓటు హక్కుదారులు.

-ఎ. సరళారాణి,
గొల్లపూడి-521 225

## వాస్తవిక దర్పణం

*(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

డబ్బు, అధికారం, పరపతి, పలుకుబడిను పయోగించి గుణవతి, శీలవతి, ఆత్మాభిమానంగల మార్తమ్మలాంటి స్త్రీలను చెరచాలనే యోహానులాంటి కామాంధులకు సవాల్‌లా ఉందీ నవల.

మమత, మమకారం, ఆత్మీయతానురాగాలకు ఆలవాలమైన పల్లెప్రాంతాలలో పేదరికం, అమాయకత్వాన్ని ఆసరాగ తీసుకొని 'డబ్బు' అనే 'మాయలేడిని' ఎరగా చూపి పేతురు, మార్తమ్మలాంటి అభాగ్యులతో వెంకటేశ్వర్లు, బెంజిమెన్, రామిరెడ్డి, ఏసోబు లాంటి రాజకీయశక్తులు హెడ్డు జీవరత్నం, ఎస్సై లోకనాథంలాంటి పోలీసు అధికారులు ఎలా ఆడుకుంటున్నారనే వాస్తవిక సత్యాన్ని చక్కగా వివరించారు.

మార్తమ్మ అతిచిన్నకోరిక ముక్కుపుడక పెట్టుకోవాలని. అయినా కుటుంబ పరిస్థితులవల్ల కోరిక తీరకపోయినా భర్తను మరోసారి అడిగితే ఎక్కడ మనోక్షోభకు గురి అవుతాడోననే భయంతో కుటుంబాన్ని, భర్తని, పిల్లలని ఆప్యాయతానురాగాలతో చూసుకుంటున్న మార్తమ్మ పాత్ర నగలు తేలేదని, చీరెలు తేలేదని భర్తలను వేధించి, సంసారాలను విచ్ఛిన్నం చేసుకొనే స్త్రీలకు కనువిప్పు కలిగించేవిధంగా ఉంది.

-రణబోతు శ్రీనివాసరెడ్డి,
కరివిరాల-508

★



# చతుర

జనవరి: 2000

సంపుటి: 22

సంచిక:12

"మెలుకువ వచ్చి కళ్ళు తెరిచి చూసిందామె!
ఎదురుగా భయంకరమైన భైరవ విగ్రహం!
కుక్కతల, మానవ శరీరం కలిసిన నగ్నప్రతిమ!
అంతలోనే... ఆ భైరవుని విగ్రహంలో చలనం!
అంతే...! ఆమె పెట్టిన కేకకు భూ నభోంతరాళాలు దద్దరిల్లాయి!"

అంతవరకూ రాసిన రచయిత బద్ధకంగా ఒళ్ళు విరుచుకుని లేచి పచార్లు ప్రారంభించాడు.

అటుపైన... ఆ అమ్మాయి జీవితాన్ని ఏ మలుపు తిప్పాడా రచయిత?

మానవ సంబంధాలు, మానవతా విలువలు, మనిషి జీవితంలోని ఆటు పోట్లు... ఇలా... విభిన్న కోణాలని ఇతివృత్తాలుగా చేసుకుని... మనిషిని ఆలోచింపచేయాల్సిన సాహిత్యం... మానవకంకాలు, మారణ హోమాలు, మాయా జాలాలను ఆధారంగా చేసుకుని... మనిషి మేధస్సును వికృత పథం వైపు నడిపిస్తూ... విషపూరితం చేస్తున్న విపరీత పరిస్థితులకు... విపుల విశ్లేషణ... **ఆర్.వి.టి.ఫణీంద్రుడు** రాసిన **'శిథిలాలయం'** ఈ నెల చతుర సమగ్ర నవల.

# శిథిలాలయం

-ఆర్.వి.టి.ఫణీంద్రుడు

టే పరికార్డర్‌లోనుండి చిన్నగా వినిపిస్తున్న సుప్రభాతం వింటూ రివాల్వింగ్ ఛైర్‌లో వెనక్కువాలి కళ్ళు మూసుకుని పడుకు నుంది డాక్టర్ ఇందిర. ఆమెకు ఆరోజు చాలా అలసటగా వుంది. రాత్రి చాలా సేపు మెలకువగా వుండి నోట్స్ ప్రిపేర్ చేసు కుంది. మరుసటిరోజు జరుగబోయే మెడి కల్ కాన్ఫరెన్స్‌లో ఆ పేపర్స్ చదవాలి. అలాగని ఇప్పుడు రెస్ట్ తీసుకోవడానికీలేదు. బయట కొంతమంది పేషెంట్స్ ఎదురు చూస్తున్నారు. అందరూ ముఖ్యమైనవాళ్ళే.

డాక్టర్ ఇందిర సైకియాట్రిస్ట్, సైకో ఎనా లసిస్ట్ కూడా. గతంలో ఆమె హాస్పిటల్‌కు రావడానికి పేషెంట్స్ భయపడేవారు. అది పిచ్చివాళ్ళ హాస్పిటల్ అనే అభిప్రాయం వుండేది.

కానీ ఇప్పుడు జనంలో మానసిక సమస్య లపట్ల అవగాహన పెరిగింది. ఎన్నోరకాల సమస్యలపై మానసిక వైద్యుడిని సంప్రదిస్తు న్నారు.

తలుపు చప్పుడుకు తలతిప్పి చూసింది ఇందిర. శ్రీనివాస్ లోపలకు వచ్చాడు. అతని వెనుకే తలుపు మూసుకుపోయింది.

శ్రీనివాస్ మధ్య వయస్కుడు. ఫుల్‌సూ ట్‌లో హుందాగా వున్నాడు. అతని బట్టలే కాదు, అతని వంటిపై నుండి వచ్చే ఖరీదైన పరిమళ ద్రవ్యాల సువాసన, అతని మానరి జమ్స్, అతని నుదుటిపై గీతలు, తలపై తెల్లవెంట్రుకలు అన్నీ అతను ఒక బిజినెస్ ఎగ్జిక్యూటివ్ అని చెప్పక చెబుతాయి.

శ్రీనివాస్ కుర్చీలో కూర్చుని బల్లపై రెండు చేతులు ఆనించి పెద్దరహస్యం చెబు తున్నట్లుగా చెప్పాడు.

"నిన్నరాత్రి కూడా నాపై హత్యాప్ర యత్నం జరిగింది డాక్టర్"

ఇందిర తన టేబిల్‌కు వున్న ఎర్రటి బటన్ నొక్కింది. దానితో పేషెంట్ ఎదు రుగా వున్న టేపురికార్డర్ పనిచేయడం మొదలుపెట్టింది. ఏ పేషెంట్ చెప్పేద యినా ఇందిర టేప్ చేస్తుంది. తర్వాత మరోసారి నిదానంగా ఆ సమస్య వింటే పరి ష్కారం దొరకవచ్చు.

"ఎలా తప్పించుకున్నారు? " సాధ్యమై నంత ఆదుర్దా గొంతులోనికి తెచ్చుకుంటూ అడిగింది.

"నేను వాళ్ళకంటే తెలివైనవాడిని డాక్టర్. వాళ్ళు నా కారు బ్రేకులు తీసేశారు. కారు కింద వున్న ఆయిల్ మరకలు చూసి ఆ కారు ఉపయోగించకుండా టాక్సీలో ఆఫీస్‌కు వెళ్ళాను"

"బహుశా అది మీ ఊహ కావచ్చు నేమో? "

"లేదు" అరిచినట్లు చెప్పాడు శ్రీనివాస్. "ఆఫీస్‌లో కూడా నాపైన హత్యాప్రయత్నం జరిగింది. మా ఆఫీస్ బాయ్‌ని వాళ్ళు ఉప యోగించుకున్నారు. వాడు కూల్‌డ్రింక్‌లో విషం కలిపి తెచ్చాడు"

"మరి ఆ డ్రింక్ పరీక్ష చేయించకపో యారా? దొంగలు బయటపడిపోదురు కదా? "

నుదుటిపైన అరచేత్తో కొట్టుకుని చెప్పాడు శ్రీనివాస్, "నాకు ఆ ఆలోచన రాలేదు డాక్టర్. ఆ డ్రింక్ మొత్తం వాష్‌బేసిన్‌లో ఒంపేశాను"

శ్రీనివాస్ ఒక వ్యాపారసంస్థలో చీఫ్ ఎగ్జి క్యూటివ్. తన తెలివితేటలతో ఆ కంపెనీ తయారుచేసే టీ.వీలకు ఉత్తమశ్రేణి టి.వి. లుగా పేరొచ్చేలా చేశాడు. అట్టడుగున వున్న సంస్థను అగ్రస్థానానికి తీసుకువచ్చాడు.

సరిగ్గా రెండునెలల క్రిందట అతనికి ఈ ప్రాబ్లమ్ మొదలయ్యింది. తనను ఎవరో చంపబోతున్నారని అతని అనుమానం. ఆఫీ స్‌లో ఉద్యోగులు తనకు వ్యతిరేకంగా కుట్ర పన్నుతున్నారనీ, ఆఫీస్‌నుండి ఇంటికి, ఇంటి నుండి ఆఫీస్‌కు వెళ్ళేప్పుడు తనను ఎవరో వెంబడిస్తున్నారనీ భ్రమపడుతున్నాడు. సమయానికి తిండి తినలేదు. అందులో విషం కలపబడిందేమోనని అనుమానం.

కంపెనీ డైరెక్టర్స్‌లో అతని ఆరోగ్యంపట్ల ఆందోళన మొదలయ్యింది. వాళ్ళకు తెలుసు, తమ కంపెనీకి అతనొక బంగారు గుడ్లు పెట్టే బాతని. అతడిని వదులుకో వడం వాళ్ళకు ఇష్టంలేదు. ఫలితంగా శ్రీని వాస్‌ని డాక్టర్ ఇందిరవద్దకు పంపించారు.

"మీరు మీపైన జరిగే హత్యాప్రయత్నాల గూర్చి పోలీసులకు చెప్పదల్చుకోలేదా? "

"ఈ ప్రశ్నకు ఇదివరకొకసారి సమా ధానం చెప్పాను డాక్టర్. పోలీసులు కూడా ఈ కుట్రలో వున్నారని నా అనుమానం. కాబట్టి నా జాగ్రత్తలు నేను తీసుకుంటున్నా నేగానీ పోలీసులసాయం అడగడంలేదు"

అతని బి.పి. చూసి కొన్ని మందులు రాసిచ్చింది ఇందిర. అవి కేవలం బి.పి. తగ్గడానికే అని శ్రీనివాస్ అభిప్రాయం. అసలు అతనికి డాక్టర్ వద్దకు రావడం ఇష్టంలేదు. కానీ డైరెక్టర్స్ ఆదేశాలమేరకు రాకతప్పలేదు. వచ్చిన తర్వాత ఇందిర అత డిని తన వాక్చాతుర్యంతో ఆకట్టుకుంది. అప్పటినుంచి చెప్పిన సమయానికి క్రమం తప్పకుండా వస్తున్నాడు.

శ్రీనివాస్ బయటకు వెళ్ళి పోయాక, లక్ష్మీదేవి లోపలకు వచ్చింది.

ఆవిడకు నలభై ఏళ్ళుంటాయి. సంఘసం స్కర్తగా సమాజంలో ఆవిడకు మంచి పేరుంది. చూడగానే డబ్బున్నమనిషని తెలి సిపోతుంది. ఆవిడ జీవితం వడ్డించిన విస్తరి. కానీ ఆవిడకు ఎప్పుడూ ఏదో ఒక జబ్బు వస్తూనే వుంటుంది. టీ.వీ.లో గానీ, పత్రికల్లోగానీ ఏదైనా వ్యాధి గురించి విన్నా, చదివినా అది తనకూ వున్నట్లు అనిపిస్తుం టుంది.

ఆమె కుర్చీలో కూర్చుని తనబాధలు చెప్పు కుంది.

ఇందిర ఆమెను సమాధానపరచి కొన్ని మందులు రాసిచ్చింది.

లక్ష్మీదేవి వెళ్ళిపోయాక మరొక వ్యక్తి వచ్చాడు. అతనికి ఎప్పుడూ ప్రయాణాల సరదా. ఒకరోజు ఉన్న ప్రదేశంలో మరో రోజు వుండడు. దానివల్ల అసౌకర్యంగా ఫీల వుతున్నా ఆ అలవాటు మానుకోలేకపోతు న్నాడు.

ప్రతీ మనిషిలోనూ మరోమనిషి వుంటాడు. ప్రతీ చిన్న సమస్యకూ ఆ మనిషి స్పందిస్తాడు. ఆ స్పందించడం అనేది ఒక్కోమనిషిలో ఒక్కొక్కలా వుంటుంది. అందువల్లనే అనేకరకాల మాన సిక సమస్యలు ఉద్భవిస్తున్నాయనేది డాక్టర్ ఇందిర థీరీ!

ఈసారి కాలేజీ స్టూడెంట్ శైలజ లోప లకు వచ్చింది. కుర్చీలో కూర్చుంటూనే తన చేతిలోని పుస్తకాన్ని టేబుల్‌పై వుంచింది.

ఇందిర ఆసక్తిగా ఆ పుస్తకాన్ని తెరిచి చూసింది. అది ప్రఖ్యాత రచయిత కార్తీక్ రాసిన నవల. అట్టవెనుక కార్తీక్ ఫోటో వుంది.

"మీకు కూడా కార్తీక్ అంటే ఇష్టమా డాక్టర్? " ఉత్సాహంగా అడిగింది శైలజ.

తలవూపింది ఇందిర.

"నాకు ఆయనంటే ప్రాణం మేడమ్. ఆయన పుస్తకాలు వదలకుండా చదువు తాను" చెప్పింది శైలజ.

కార్తీక్ ఫోటోవైపు చూసింది ఇందిర. అమాయకంగా నవ్వుతున్నాడు. ఆ నవ్వంటే ఆడపిల్లలు ప్రాణం పెడతారట! కానీ ఆ నవ్వువెనుక...

తల విదిలించి పుస్తకాన్ని బల్లపై పడే సింది ఇందిర. శైలజవైపు చూసి చిన్నగా నవ్వింది. తన సమస్య ఏమిటో చెప్పమ న్నట్లు. శైలజ తన ప్రాబ్లమ్ చెప్పసాగింది.

★ ★ ★

కారు ఆ వీధిలోకి తిరగ్గానే ఆసక్తిగా బయటకు చూశాడు కార్తీక్. పైన వేలాడదీ సిన బ్యానర్స్ అతడిని ఆకర్షించాయి. "రచ యిత కార్తీక్‌గారికి స్వాగతం"

"కళాతపస్వి కార్తీక్‌గారికి స్వాగతం"

# మార్లిన్ అవాలనుకునే నటీమణులు

మార్లిన్ మన్రో మరణించి 30 ఏళ్ళు కావస్తున్నా ఇంకా ఆమెకున్న గ్లామరు ప్రేక్షకుల్లో తగ్గలేదు.

ఓ హాలీవుడ్ నిర్మాత మార్లిన్ మన్రో జీవితాన్ని తెరకెక్కించాలనుకున్నప్పుడు కొందరు నటీమణులు ఆ పాత్రకోసం పోటీపడ్డారు. ఆమెలా జుట్టుకి గోధుమవన్నె రంగు వేసుకుని, మార్లిన్‌లా మేకప్ చేసుకుని, ఫొటోలు తీయించుకుని వాటిని ఆ నిర్మాతకి పంపారు. ఈ ముగ్గురిలో ఆ పాత్ర ఎవరిని వరిస్తుందో మరి. మొదటి అమ్మాయి పేరు ఎలిజబెత్ హుర్లే. ఈ అమ్మాయి మోడల్ గర్ల్. రెండో అమ్మాయి మెలనీ గ్రిఫిత్. ఈమె సినిమా నటి. మూడో అమ్మాయి జీన్ ట్రిపిల్ హార్న్. ఈ అమ్మాయి 'బేసిక్ ఇన్‌స్టింక్ట్'లో నటించింది.



ఇటువంటివే రకరకాల స్లోగన్స్ రాసివున్నాయి.

నవ్వుకున్నాడు కార్తీక్. సమాజంలో ట్రెండ్ సెట్టర్ ఎప్పుడూ ఒక్కడే వుంటాడు. అతని చుట్టూ మిగిలిన వాళ్ళు గుమిగూడతారు. ఇప్పుడు తనున్నస్థానంలో మరొక వ్యక్తి వుంటే అతనికి కూడా ఈరకమైన ఆదరణే లభిస్తుంది. తనైనా మరొకవ్యక్తి అయినా ఈ స్థాయికి చేరుకోవడం ఎంత కష్టమో, ఆ తర్వాత ఆ స్థానాన్ని నిలబెట్టుకోవడం అంతకంటే కష్టం. దానికి నిరంతరం శ్రమపడాలి.

"సార్! ఆ కనిపించే ఆడిటోరియంలోనే మీకు సన్మానం జరగబోయేది" ప్రభు చెప్పాడు.

బయటకు చూశాడు కార్తీక్. చాలా పెద్ద బిల్డింగ్. అక్కడకూడా రంగురంగుల జండాలు. బెలూన్లు, బ్యానర్లతో హడావిడిగా వుందా ప్రాంతం. ప్రభు ఆసక్తిగా కార్తీక్‌వైపు చూస్తున్నాడు.

నవ్వుతూ తలవూపాడు కార్తీక్. ప్రభు ముఖం బెలూన్‌లా ఉబ్బింది.

ప్రభు కార్తీక్ వీరాభిమాని. అతని ఆధ్వర్యంలోనే ఈ సన్మానం జరుగుతోంది. "సార్! ఇదే మన హోటల్" చెప్పాడు ప్రభు.

కారు ఒకహోటల్ కాంపౌండ్‌లో ఆగింది. అటెండర్ వచ్చి తలుపు తెరిచి పట్టుకున్నాడు. ఠీవిగా కిందకు దిగాడు కార్తీక్. అక్కడున్న అందరికళ్ళలోనూ ఒకేరకమైన భావం. ఒక మానవాతీతమైన వ్యక్తిని చూస్తున్న భావన. ఒక అపురూపమైన కళాఖండాన్ని చూస్తున్నంత తపన.

హోటల్ సిబ్బంది తమను పరిచయం చేసుకోవడం మొదలుపెట్టారు. అందరినీ పేరుపేరునా పలకరిస్తూ అడిగినవాళ్లకు ఆటోగ్రాఫ్‌లిస్తూ లోపలకు నడిచాడు కార్తీక్.

ఏ రంగంలోనయినా మొదటిస్థానంలో వున్నవ్యక్తి ఎంతో వినయంగా వుండాలి. ఆకాశంలో ఎంత ఎత్తుకు ఎదిగినా చూపు భూమిపైనే వుండాలి.

కార్తీక్ తనకు కేటాయించిన గదిలోనికి నడిచాడు. అదో ఖరీదైన హోటల్. కార్పెట్ నుండి వాల్‌డెకరేషన్స్ వరకు అన్నీ ఖరీదైనవే. "సార్! నేను మళ్ళీ వస్తాను. మీరు విశ్రాంతి తీసుకోండి" ప్రభు చెప్పాడు.

"చీఫ్ గెస్ట్ వస్తున్నారా?" అడిగాడు కార్తీక్.

"ఇందిరగారిని ఈరోజు కూడా కలిశాను. ఆవిడ ఖచ్చితంగా వస్తానన్నారు సార్"

కార్తీక్ తల వూపాడు. ప్రభు గది తలుపు తెరుచుకుని బయటకు వెళ్లిపోయాడు.

కార్తీక్ బాత్‌రూంలోకి నడిచాడు. షేవింగ్ చేసుకుని, స్నానం పూర్తిచేశాడు. అతడి ఆలోచనలనిండా ఇందిర నిండి వుంది. ఇందిర అతని చిన్ననాటి స్నేహితురాలు. కార్తీక్ చిన్నతనంలోనే ఊరువదిలి వచ్చేశాక ఆమెను మళ్ళీ కలుసుకోలేదు. ఎలాగైనా ఆమెను కలవాలన్న అతని కోరిక ఈరోజు తీరబోతోంది. ఆమె ఈ ఊర్లోనే పెద్ద సైకియాట్రిస్ట్‌గా ప్రాక్టీస్ చేస్తోందని తెలిసే ఇక్కడ సన్మానానికి ఒప్పుకున్నాడు. చీఫ్ గెస్ట్‌గా ఆమెనే పిలవాలని షరతుపెట్టాడు.

బాల్కనీలోనికి నడిచాడు కార్తీక్. కిందరోడ్డుపై జనం హడావిడిగా పరుగులు పెడుతున్నారు. ఎవరి జీవితం వాళ్లది. పొద్దుట లేచింది మొదలు రాత్రి నిద్రపోయేవరకు ఒకటే హైరానా. ఈ యాంత్రికయుగంలో కొడుకు తల్లితోనూ, భార్య భర్తతోనూ ప్రేమగా ఒక్కమాట మాట్లాడుకోవడానికి కూడా తీరికలేనంత బిజీ. ఇరుకిరుకు జీవితాలు.

"మే ఐ కమిన్ సార్...?" ఒకకంఠం మృదువుగా అడిగింది.

గుమ్మందగ్గర ఒకయువకుడు నిలబడి వున్నాడు. అతనికి సుమారుగా పదిహేడు సంవత్సరాల వయస్సు వుండచ్చు. పొడ

వుగా తెల్లని శరీరచ్ఛాయతో వున్నాడు. వెనుకకుదువ్విన ఉంగరాల జుత్తువల్లనో, అప్పుడే వచ్చినట్లున్న మీసకట్టువల్లనో, ఆడ పిల్లకువలే ఎర్రగా వున్న కింది పెదవివల్లనో తెలీదుగానీ అతని ముఖం చాలా అందంగా, అమాయకంగా వుంది.

"నేను మీ అభిమానినిసార్" చెప్పాడ తను.

"మీ పేరు? " కుర్చీ చూపిస్తూ అడిగాడు కార్తీక్.

"అన్వేష్. ఇంజనీరింగ్ మొదటి సంవత్సరం చదువుతున్నానండీ. మీ పుస్తకాలన్నీ చదివాను. నా లైబ్రరీలో మీ పుస్తకాలన్నీ వుంటాయి. సార్! ఈమధ్య మీరు బాక్సింగ్‌ను బాక్‌గ్రవుండ్‌గా చేసుకుని రాసిన నవల నిజంగా అద్భుతం సార్. ఒకవైపు బాక్సింగ్ పుట్టుపూర్వోత్తరాలు, మరొకవైపు యువహృదయాలలో ప్రేమ. భలే రాసారు సార్. జోడుగుర్రాలపై స్వారీ మీకే సాధ్యం" చెప్పాడు అన్వేష్.

కార్తీక్ ముఖం బెలూన్‌లా ఉబ్బింది. కీర్తి కండూతి తనివితీరనిది. ఎంతమంది ఎన్ని విధాల పొగిడినా ప్రతీసారీ తియ్యగా, పదహారేళ్ళ అమ్మాయి ఇచ్చిన మొదటి ముద్దులా మధురంగానే ఉంటుంది.

"సార్! ఆటోగ్రాఫ్" పుస్తకం ఇచ్చాడు అన్వేష్.

రెండునిముషాలు ఆలోచించాడు కార్తీక్. చాలామందిలా సంతకం మాత్రమే చేయడు.

ఆటోగ్రాఫ్ ఇవ్వడంలో కార్తీక్‌కు ఓ ప్రత్యేకత వుంది. దానిపై ఒక మంచి వాక్యం రాస్తుంటాడు. అది సాధారణంగా ఎదుటివాళ్ళకు నచ్చుతుంది.

"మీ నాన్నగారేం చేస్తుంటారు అన్వేష్? " ఆటోగ్రాఫ్ చేస్తూ అడిగాడు కార్తీక్.

"ఈ ఊళ్ళోనే ఒక స్కూల్లో టీచర్ సార్"

ఒక్కక్షణం ఆగి ఏదో చెప్పబోయి, విరమించుకున్నాడు. కార్తీక్ అది గమనించాడు.

"ఏదో అడగబోయి ఆగిపోయారు. ఏమిటో చెప్పండి? "

"సార్! నేను కవితలు రాస్తాను. చిన్న చిన్న కథలు కూడా రాస్తుంటాను. అఫ్‌కోర్స్ ఇంతవరకు ఒక్కటి కూడా ప్రచురింపబడలేదనుకోండి" సిగ్గుపడుతూ చెప్పాడు.

"ఏమైనా తెచ్చారా? " ఉత్సాహం నటిస్తూ అడిగాడు కార్తీక్.

నిజానికి అతనికి ఆ కుర్రాడి కథలు గానీ, కవితలు గానీ చదవాలనిలేదు. దాదాపు తనను చూడడానికి వచ్చిన ప్రతిఒక్కరూ కవితలో, కథలో తీసుకువస్తారు. అవి చదివి తాను దిగ్భ్రాంతి చెంది ప్రచురితమయ్యేలా చేస్తాడని వాళ్ళ ఊహ.

సాధారణంగా ఆ రచనల్లో పరిపక్వత ఉండదు. కథలో ముఖ్యమైన ఎత్తుగడ, ముగింపు సరిగ్గా వుండవు. పేరాలు సరిగా విభజించలేరు. కవితలయితే ఏవో నాలుగు వాక్యాలు రాసి అదే కవిత్వమంటారు.

కానీ, ఎవ్వరినీ శత్రువులుగా చేసుకోవడం కార్తీక్‌కు ఇష్టం వుండదు. అందుకే వాళ్ళు తెచ్చినవి ఓపికగా చూస్తాడు. ఇంకా బాగా రాయమని గాని, ఏదైనా పత్రికకు పంపమని గానీ చెబుతాడు. వాళ్ళు తలవూపి వెళ్ళిపోతారు.

అంతే! ఆ విషయం అక్కడితో ముగుస్తుంది. ఆ తర్వాత వాళ్ళు ఉత్తరాలు రాసినా పట్టించుకోడు.

అన్వేష్ చేతిలోని కాగితాలు తీసుకుని యధాలాపంగా చదవడం మొదలుపెట్టిన కార్తీక్‌కు ఆ కథలో ఓ మంచి రచయిత వున్నాడని అర్థమైంది. మంచి భాషతో విషయం హృదయానికి హత్తుకునేలా చెప్పగలిగే నేర్పు ఆ రచయితకు పుష్కలంగా వుంది.

కథ పూర్తిగా చదివాక అన్వేష్‌ని అభినందించాడు కార్తీక్.

"అన్వేష్! మీరు వీలు చూసుకుని మా



ఇంటికి రండి. మీలో మంచి రచయిత వున్నాడు. నేను కొన్ని మెళకువలు చెబుతాను. మీకు మంచి భవిష్యత్ వుంది"

అన్వేష్ సంతోషంగా బయటకు వెళ్ళిపోయాడు.

కార్తీక్‌కు భరింపలేని శిరోవేదన మొదలయ్యింది. ఆ కుర్రాడు పూర్తిగా అతని గతానికి ప్రతినిధిలా వున్నాడు. సరిగ్గా ఆ వయస్సులోనే అతని జీవనసమరం మొదలైంది. సమాజంలో ఉన్నతస్థానం కొరకు అతను పడ్డ పాట్లు, తిన్న ఎదురుదెబ్బలు, చేసుకున్న ఆత్మవంచన... ఓహ్... గతమంతా ఒక పీడకల. అలాగని అతను గతాన్ని మర్చిపోలేడు. అతనేకాదు. ఏ మనిషీ గతాన్ని విస్మరించలేడు. గతాన్ని మరిచిన మనిషి పాడెపై పెట్టిన శవంతో సమానం.

పాత జ్ఞాపకాలు అతడిని చుట్టుముడుతున్నాయి.

అతనిలోని కార్తీక్ బయటకు వస్తున్నాడు. ఎంతోకాలంగా అతడు నొక్కిపెట్టి వుంచిన అసలు కార్తీక్ ఒళ్ళు విరుచుకుంటూ బయటకు వస్తున్నాడు.

గతం అతని కళ్ళముందు ప్రత్యక్షమయింది.

★ ★ ★

నలభయ్యేళ్ళక్రితం...

ఆంధ్రదేశంలోని ఒక పల్లెటూరు.

అది గోదావరి ఒడ్డునున్న చిన్న పల్లెటూరు. ఆ ఊరిచుట్టూ వున్న గోదావరి ఎంత అందంగా ఉంటుందో, ఆ ఊళ్ళో వున్న కొబ్బరిచెట్లు అంత అద్భుతంగానూ వుంటాయి. పగలు ఆ చెట్ల ఆకుల సందుల నుండి పడే ఎండ ఎంత వెచ్చగా వుంటుందో రాత్రిపూట ఆ చెట్లమధ్య పడే వెన్నెల అంత చల్లగానూ వుంటుంది.

ఆ ఊరి ప్రత్యేకత శివాలయం. దానిగోపురం చుట్టుపక్కల పదిగ్రామాలకు కనిపిస్తుందని అంటారు. ఆ గుడి చూడడానికి ఎక్కడెక్కడినుంచో యాత్రికులు వస్తుంటారు.

ఆ వచ్చినవాళ్ళు సుబ్రహ్మణ్యశర్మగారిని కూడా దర్శించుకువెళతారు.

ఆయన మహాపండితుడు. ఆయన రచించిన కావ్యమాల, బ్రహ్మోపనిషత్, వ్యాకరణమాల మొదలైనవి ఆ రోజుల్లో ఉద్గ్రంథాలు.

శర్మగారి ఎత్తరుగుల ఇల్లు సాహిత్యాభిమానులకు ఒకపుణ్యక్షేత్రం. ఆ అరుగులపై చాపలు పరిచి వాటిపై ఊళ్ళో కాస్త అక్షరజ్ఞానమున్న వాళ్ళంతా వచ్చి కూర్చునేవాళ్ళు. సాహిత్యచర్చలు జోరుగా జరిగేవి. చిన్న చితక కవులు తమ రచనలు చదివి వినిపించేవారు. శర్మగారు వాటిని విని బావుంటే మెచ్చుకునేవారు. లేకుంటే మందలించేవారు. ఆయన ఏమన్నా ఎవరూ బాధపడేవారు కాదు. ఆయనకా అధికారం వున్నట్లే అందరూ భావించేవారు.

శర్మగారికి ఇద్దరు మగపిల్లలు, ఒక ఆడపిల్ల. ఆయన రెండోకొడుకు స్వాతంత్ర్యసమరంలో పాల్గొని జైలులో ఏదో వ్యాధితో మరణించాడు. ఆ వార్త విన్నవెంటనే కోడలు గోదావరి ఒడిలో చేరిపోయింది.

అది శర్మగారికి కోలుకోలేని దెబ్బ. కానీ చనిపోయేముందు కోడలు ఆయన చేతిలో ఒక పసికందుని పెట్టిపోయింది. ఆ రోజు నుండి శర్మగారి లోకం పూర్తిగా ఆ పిల్లవాడే అయిపోయాడు.

శర్మగారి సాహిత్య చర్చలు చాలా రకాలుగా వుండేవి. అక్కడ కాళిదాసాదికవుల గ్రంథాలపై రసవత్తరమైన చర్చలు కొనసాగుతూ ఉండేవి. శర్మగారి మనవడు చిన్ననాటినుంచి తాతగారి ఒడిలో కూర్చుని అవన్నీ వింటుండేవాడు.

ఒకరోజు ఎప్పటిలానే ఆ అరుగుల నిండా ఈ సాహితీ బంధువులు కూర్చుని వున్నారు. ఆ సమయంలో ఇంటిముందు ఒక పల్లకి ఆగింది.

ఆ పల్లకిలోనుండి ఒక ఆజానుబాహుడు




కిందకు దిగాడు. ఆయన రాయవరం జమిందారు. బ్రిటిష్‌వాళ్ళచేత రావు బహద్దూర్ బిరుదు పొందినవాడు. ఆ రోజుల్లో ఆ ప్రాంతాలలో ఆయన మాటకు తిరుగుం డేదికాదు.

జమిందారు అక్కడకు రాగానే ఒక్క శర్మ గారు తప్పించి అందరూ లేచి నిలబడ్డారు.

జమిందారుగారి రాకతో సాహిత్య చర్చలు మరింత జోరుగా సాగాయి.

"అయ్యా! అర్జునుడు ఉత్తర గోగ్రహణ సమయంలో ఒక్కడిగా నిలిచి కౌరవులంద రినీ ఓడించాడు కదా? మరి కురుక్షేత్రంలో అంత సమయం ఎందుకు తీసుకున్నాడు? " చౌదరిగారు అడిగారు.

"ఉత్తర గోగ్రహణంలో అర్జునుడు చేసింది ఒకరకంగా అధర్మయుద్ధం. సమ్మోహనాస్త్రంతో కౌరవులను మూర్ఛపోగొట్టాడు. అయినా కౌరవులు అశేషమైన సైన్యంతో ఒంటరిగా వున్న తనను ముట్టడించినప్పుడు అర్జునుడు చేసింది ధర్మసమ్మతమే. కానీ కురుక్షేత్రంలో అలాకాదుకదా? " శర్మగారు వివరణ ఇచ్చారు.

అప్పుడు జమిందారుగారు ఒక సమస్య ఇచ్చారు.

"ఒకటవ పాదంలో మూడవ అక్షరం 'స' రెండవపాదంలో నాలుగవ అక్షరం 'త', మూడవపాదంలో ఏడో అక్షరం 'కృ', నాలుగవ పాదంలో ఎనిమిదో అక్షరం 'క్ష' వచ్చేట్లుగా ఎవరైనా ఒక పద్యం చెప్పండి? "

అంతా తెల్లబోయారు. ఒక్కరుకూడా అలా పద్యం చెప్పలేకపోయారు. అక్కడ మౌనం రాజ్యమేలింది.

హఠాత్తుగా శర్మగారు రాగయుక్తంగా ఒక పద్యం చెప్పారు. సరస్వతీదేవి అలవోకగా తన వీణను మీటినట్లు, మంత్రబద్ధమైన ఓంకారనాదాన్ని గాయత్రీదేవే ఉచ్చరించినట్లు ఒక మధురమైన భావన అందరి మనస్సుల్లోనూ మెదిలింది.

జమిందారు తన మెడలోని హారాన్ని తీసి శర్మగారి మెడలో వేసి ఆయనకు సవినయంగా నమస్కరించారు.

శర్మగారి ఒడిలో కూర్చుని ఇదంతా చూస్తున్న పిల్లవాడి మనస్సులో చెప్పలేని భావం కలిగింది.

అదే అతడు భవిష్యత్‌లో రచయిత కావడానికి పునాది వేసింది.



సమాజంలో బాగా పేరుపొందిన వ్యక్తులకు వారసులవ్వడం నిజంగా భయంకరమైన శాపం. మనం ఏం చేస్తున్నామో మన చుట్టూ ఉన్నవాళ్ళు జాగ్రత్తగా గమనిస్తుంటారు. మనచర్యలను వాళ్ళతో పోల్చి చెబుతారు. దానితో మన వ్యక్తిత్వం మనది కాకుండా పోతుంది.

కార్తీక్‌కు ఆ విషయం చాలా చిన్నప్పుడే తెలిసిపోయింది. ఊళ్ళోనే కాదు, బళ్ళోకూడా అతను పండిత సుబ్రహ్మణ్యశర్మగారి మనవడే. అతను క్లాసులో ఫస్ట్ వచ్చినప్పుడు ఆ ఘనత శర్మగారికి దక్కేది. "అది పులిపిల్లండి. శర్మగారి మనుమడు. ఆ తేజస్సు ఎక్కడికి పోతుంది" అనేవారు.

పరిస్థితి బాగోలేక మార్కులు సరిగా రాకపోతే "పండిత పుత్రః పరమశుంఠ అని, శర్మగారివంటి మహాపండితుడికి ఎటువంటి

మనుమడు పుట్టాడండి. కనీసం ఇంగువ కట్టినగుడ్డ చందమైనా కాలేదు భడవ" అనే వారు.

కార్తీక్ చేసే పనిలో మంచిచెడ్డలు తాత గారి ఖ్యాతితో ముడిపడి వుండేవి. ఒక్కొక్క సారి ఈయన మనవడిని కాకపోయినా బావుండేది అనుకునేవాడు. కానీ అతనికి తాతగారంటే చాలా ఇష్టం.

తాతగారి మెప్పు పొందడంకోసం అందరి కంటే ముందు లేచి తన పక్కబట్టలు తానే మడత పెట్టుకునేవాడు. బాగా చదివేవాడు. బాగా అంటే తాతగారికి వినపడేలా గట్టిగా చదవడం. ఎదుటివారి మెప్పుకోసం ఏ పనైనా చేయడం అతనికి ఆ రోజుల్లోనే అల వాటయ్యింది.

కార్తీక్‌కు గోదావరి అంటే కూడా చాలా ఇష్టం. అది అచ్చం తాతగారిలానే ఎప్పుడూ నవ్వుతూ ఉంటుంది. ఒక్కొక్కసారి వర దలు వచ్చినప్పుడు తాతగారిలానే కోపం గానూ వుంటుంది.

కార్తీక్ తాతగారితోపాటు గోదావరి గట్టుకు షికారు వెళ్ళేవాడు. దారిపొడవునా అందరూ శర్మగారికి నమస్కారాలు పెడు తుంటే కార్తీక్ కూడా తాతగారిలానే వెను కకు చేతులు పెట్టుకుని నడుస్తూ గంభీ రంగా తల వూపేవాడు.

ఈ రకంగా చిన్నతనంనుండి శర్మగారి వ్యక్తిత్వం కార్తీక్‌పై బలమైన ముద్రవేసింది.

★ ★ ★

ఆ ఊళ్ళో హైస్కూల్ చదువు అంటే ఎంతో గొప్పగా చెప్పుకునేవారు. మగపిల్లలు చదవడం ఎలా వున్నా ఆడపిల్లలను మాత్రం ఆరు, ఏడు తరగతులకు మించి చదివించేవారుకాదు. నాలుగైదు కుటుం బాలు మాత్రం ఆడపిల్లలను చదివించే వారు. అలా చదివేవాళ్ళలో ఇందిర ఒకర్తె. వాళ్ళ నాన్నగారు హైస్కూల్ హెడ్‌మాస్ట ర్‌గా పనిచేసేవారు. ఆయన లెక్కలు చెబితే ఎంత మొద్దు స్వరూపానికైనా నూటికి తొంభైమార్కులు వచ్చేవి. శ్రీరామచంద్ర మూర్తిగారంటే చుట్టుపక్కల గ్రామాలలో లెక్కల మాస్టారుగా పెద్దపేరు.

ఇందిర అంటే కార్తీక్‌కు చిన్నతనం నుండి చాలా అభిమానం. ఆమెతో కలిసి శివాల యంలో ఆడుతూ ఉండేవాడు. ఇందిర అక్కడ పడ్డ గడ్డిపూలు ఏరి దండకట్టేది. "కార్తీ! ఈ పూలు ఇంత అందంగా వుంటా యికదా? సువాసనగా కూడాను. అయినా వీటిని దేవుడికి వేయరు ఎందుకంటావ్? " అందోరోజు.

ఆ ప్రశ్నకు సమాధానం కార్తీక్‌కు తెలీదు. అయినా వాళ్ళిద్దరూ కలిసిన ప్రతీసారీ ఇందిర అదేప్రశ్న అడిగేది.

ఇంగ్లీషు మాస్టారికి ఒక జబ్బు వుండేది. ఆయనొక పదానికి స్పెల్లింగ్ అడిగి చెప్పని వాళ్ళను నిలబెట్టేవారు తప్ప కొట్టేవారు కాదు. సరైన సమాధానం చెప్పిన విద్యార్థితో లెంపకాయ కొట్టించేవారు. అలా చెంపదె బ్బలు తినడమంటే తల కొట్టేసినట్లుండేది. అందులోనూ ఖర్మకాలి ఆ కొట్టేది ఆడపిల్ల యితే మగపిల్లల పరిస్థితి మరీ ఘోరం!

ఒకరోజు ఇందిర మొగలి పువ్వులతో జడ కుట్టించుకుని బడికి వచ్చింది. పొడవాటి జడ, పొట్టిలంగా, పొట్టిచేతుల జాకెట్టు వేసు కుని భలే వుంది. ఆ అమ్మాయిని చూడగానే కార్తీక్‌కు నవ్వు ఆగలేదు. ఇంది రకు ఓ మారుపేరు వుంది. ఆ అమ్మాయి ముఖం గుండ్రంగా వుంటుంది. తెల్లగా బొద్దుగా వున్న ఆ పిల్లకు ఊళ్ళో మగపిల్లలు 'మామిడిపండు' అని పేరుపెట్టారు. ఆ పేరుతో ఎవరైనా పిలిస్తే ఇందిరకు ఏడుపొ చ్చేది.

"ఇందూ! నీ పూలజడ భలేవుంది" చెప్పాడు కార్తీక్.

ఇందిర చిన్నగా నవ్వింది. జడ ముందుకు లాక్కుని "నానమ్మ వేసింది" అంది.




కార్తీక్‌కు నవ్వు వచ్చింది. నవ్వుతూనే 'మామిడిపండు. మామిడిపండు' అంటూ పిలిచాడు. ఇందిర కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ముఖం ఎర్రగా చేసుకుని ముక్కుపుటాలు పొంగిస్తూ గిర్రున వెనక్కు తిరిగి క్లాసురూం లోనికి వెళ్ళిపోయింది.

ఆరోజు ఇంగ్లీషు మాస్టారు అడిగిన ప్రశ్న లకు సమాధానం చెప్పకుండా నిల్చున్న వాళ్ళలో కార్తీక్ కూడా వున్నాడు. కొట్టే అవ కాశం ఇందిరకు వచ్చింది. మిగిలిన మగపి ల్లలు సిగ్గుపడుతున్నా కార్తీక్ ధీమాగానే వున్నాడు. గతంలో చాలాసార్లు అవకాశం వచ్చినా ఇందిరను తాను మెల్లిగా కొట్టి వది లేశాడు. కానీ ఈసారి దృశ్యం మారిపో యింది.

"వాడిని గట్టిగా కొట్టమ్మా. తులసివ నంలో గంజాయి మొక్కలా పుట్టాడు. శర్మ గారి మనవడు! ఏం లాభం? అక్షరాలు రాని శుంఠ" అన్నారు ఇంగ్లీషు మాస్టారు ఇందిరతో.

అంతే!

ఏం జరిగిందో గ్రహించేలోగానే కార్తీక్ చెంప ఛెళ్ళుమంది. ఇందిర చేతివేళ్ళు అతని చెంపపై స్పష్టంగా పడేంత గట్టిగా కొట్టింది. అప్రయత్నంగా కార్తీక్ కళ్ళలో నీళ్లు తిరి గాయి. ఏడిస్తే మరింత లోకువైపోతానని పళ్ళ బిగువున ఆగాడు.

ఇంటికి వెళ్ళాక శర్మగారిముందు అతనికి ఏడుపు ఆగలేదు. ఏడుస్తూనే జరిగింది చెప్పాడు.

"ఆడపిల్ల చేతిలో దెబ్బలు తిన్నందుకు కాక, మాస్టారు అడిగినదానికి సమాధానం చెప్పనందుకు ఏడ్వు" నవ్వుతూనే చెప్పారు శర్మగారు.

'నాకు అవకాశం రాకపోతుందా! అప్పుడు చెబుతాను.' కసిగా ఎన్నోసార్లు అనుకు న్నాడు. కాని ఆ తర్వాత అతనికి ఆ అవ కాశం రానేలేదు.

ఆ సంవత్సరం స్కూలు వార్షికోత్సవం బ్రహ్మాండంగా జరిగింది. కార్తీక్‌ని నాట కంలో ఒక పాత్ర వేయమని అడిగారు. అయితే సిగ్గువల్లో, భీతివల్లో అతడు అంగీక రించలేదు.

వార్షికోత్సవంరోజు ఇందిర కూచిపూడి నృత్యం చేసింది. అందరూ ఆ అమ్మాయిని మెచ్చుకోవడమే. అందరి కళ్ళూ ఆ అమ్మా యిపైనే. ఆ సంబరం కార్తీక్‌లో సంచలనం కలుగజేసింది.

అక్కడ వున్న వందలమందిలో ఆమెకి గుర్తింపు వుంది. మరి తనకు...?

సముద్రం ఒడ్డున ఇసుకరేణువులా అన్ని వందలమందిలో తనూ ఒకడు. సరిగ్గా అప్పుడే కార్తీక్‌కు ఒక విషయం అర్థమైంది. "పదిమందిలో ఒకడిగా బతికేయడంకాక పదిమందిచేత శ్లాఘించబడేలా బతకడంలో ఆనందం వుంది"

★ ★ ★

సుబ్రమణ్యశర్మగారు కాలధర్మం చెందారు. ఆయన చనిపోయినందుకు అందరూ బాధపడ్డారు తప్ప కార్తీక్ గురించి పట్టించుకున్నవాళ్ళే లేరు. ఆస్తిలో అతనికి వాటావున్న విషయం అందరూ విస్మరిం చారు. తమకు భారంగానే అందరూ మాట్లా డసాగారు. తిండికొరకు బంధువులపైన ఆధారపడవలసిన పరిస్థితి కార్తీక్‌కు కూడా ఇబ్బందిగానే వుంది.

శివాలయంలోకి వెళ్ళి కూర్చున్నాడు. కార్తీక్‌కి తన పరిస్థితి తనకే అయోమ యంగా వుంది. మోకాళ్ళపై తలవాల్చుకుని కూర్చున్నాడు. అతని ప్రమేయం లేకుండానే కళ్ళనుండి నీళ్ళు కారుతున్నాయి.

"కార్తీక్" ఎవరో పిలిచారు.

తలెత్తి చూశాడు.

ఎదురుగా వనదేవతలా ఇందిర నిలబడి వుంది.

ఆ అమ్మాయిపై అప్పుడే యవ్వనం తన ప్రభావాన్ని చూపుతోంది. రాత్రంతా



వెన్నెల్లో తడిసిన తెల్లగులాబీలా వుంది.

"కార్తీ! అలా వున్నావేం? " మృదువుగా అడిగింది. కార్తీక్ ఏం మాట్లాడలేదు. ప్రపంచంలోని విషాదమంతా అతని కళ్లలోనే గూడుకట్టుకుని వుంది.

"కార్తీ! నీ పరిస్థితి నాకు తెలుసు. అది ఎంత దుర్భరమో అనుభవించేవాళ్ళకే గానీ, బయటివాళ్ళకు అర్థం కాదు. నీవు ఆ ఇంట్లో నుండి ఈ ఊళ్లోనుండి వెళ్ళిపోతే బెటర్ కదా? "

"వెళ్ళి ఏం చెయ్యను? ఇటు చదువు పూర్తికాలేదు. అటు ఆస్థి కూడా లేదు. ఎలా బతకగలను? "

"ఇక్కడ మాత్రం ఇలా ఎంత కాలం బతకగలవు? వీళ్ళందరికీ చాకిరీ చేస్తూ, తిట్లు, శాపనార్థాలు భరిస్తూ ఎంతకాలం వుంటావు? "

తెల్లబోయాడు కార్తిక్. అవును వీళ్ళ మధ్య ఇలా ఎంతకాలం బతకగలడు. ఈరోజు లోకానికి భయపడి నాలుగు మెతుకులు పెడుతున్నారు. కొంతకాలం పోయాక ఎద్దులాగయ్యావు. బయటకు పొమ్మంటారు. అదేదో ఇప్పుడే తేల్చుకుంటే?

ఒకే వయస్సు మగ, ఆడపిల్లలలో ఆడపిల్ల సహజంగా మానసికంగా, శారీరకంగా త్వరగా ఎదుగుతుంది. అందువల్లనే కార్తీక్ ఆలోచించని మరో కోణంనుండి ఆ అమ్మాయి ఆలోచిస్తోంది.

"కార్తీ! ఈ సంవత్సరం నువ్వు స్కూల్ ఫస్ట్ వచ్చావు! మన నాన్‌డిటెయిల్‌లో అబ్రహాంలింకన్ పాఠం చదివావుకదా? ఏ గొప్పవాడి కొడుకో కావడంవల్ల అబ్రహాంలింకన్ అమెరికా ప్రెసిడెంట్ కాలేదు. ఆయన అతిదుర్భరమైన పేదరికంనుండి తన జీవితాన్ని లాక్కువచ్చాడు. పట్టుదలతో కనీస సౌకర్యాలు లేకపోయినా జీవితంతోపాటు చదువుని లాక్కువచ్చాడు. అత్యున్నత శిఖరాలు చేరాడు"

కార్తీక్ తల ఆవేశంతో ముందుకు వెనక్కు కదిలింది. అతని మనసు వెయ్యి గుర్రాల రథమెక్కి పరుగులు తీస్తోంది. అతనికి ఇందిర స్థానంలో తాతగారు కనిపిస్తున్నారు.

అప్రయత్నంగా లేచి నిలబడ్డాడు.

"వెళ్లు కార్తీ! ఇక్కడినుండి వెళ్ళిపో. నువ్వు ఎక్కడ వున్నా నీ పేరు పదుగురి నోట నాకు వినబడాలి"

ఆ మాటలు ఇందిర నోటివెంబడి తన తాతగారే అంటున్నారనిపించింది కార్తీక్‌కు. తనకు తోడుగా నీడగా తాతగారున్నారనే తలంపు మొండిధైర్యాన్ని ఇచ్చింది.

ఆ రాత్రే ఆ ఊరు వదిలి తన జీవితగమ్యాన్ని వెదుక్కుంటూ బయల్దేరాడు కార్తీక్.

★ ★ ★

నేటికి పదిహేడేళ్ళ క్రితం...

హైదరాబాద్‌లో...

ఉదయం ఆరుగంటలు.

బయట నీళ్ళకుళాయి దగ్గర ఆడవాళ్లు సిగపట్లకు దిగుతున్నారు. పిల్లలు కేకలు వేస్తూ పరుగులు పెడుతున్నారు. పాలవాళ్ళ కేకలు, పేపరువాళ్ళ అరుపులు అన్నీ లోపలకు వచ్చేస్తున్నాయి.

లేచి కూర్చున్నాడు కార్తీక్. తన పరిసరాల్ని ఒకసారి పరీక్షగా చూసుకున్నాడు. చాలా పాతగది. అక్కడక్కడా పెచ్చులు వూడిపోయి బూజు వ్రేలాడుతూ చిరాగ్గా వుంది. అయినా అతనికి కొత్తదేం కాదు. ఇంట్లోనుండి పారిపోయి వచ్చాక ఈ అయిదు సంవత్సరాలూ అక్కడే కాలం గడిపాడతను.

మంచం దిగబోయాడు. కాళ్ళకు పుస్తకాలు తగిలాయి. అలవాటు ప్రకారం కళ్ళకద్దుకుని వాటిని మరో మూలకు తోశాడు. గదినిండా రణరంగంలో క్షతగాత్రులైన సైనికుల్లా పడివున్నాయి పుస్తకాలు. వాటిని జాగ్రత్తగా తప్పించుకుంటూ బయటకు వచ్చి డాబాపైన పచార్లు చేస్తూ పళ్లు తోముకున్నాడు.

ఆ గదిలోనే మరో మూల నరేష్ పడుకుని వున్నాడు. ఈ ఊరు వచ్చిన కొత్తలో పరిచయమయ్యాడతను. అప్పట్లో అతను ఓ సినిమాహాలువాళ్ల పోస్టర్లు అతికించేవాడు. ఇప్పుడు బుకింగ్‌క్లర్క్‌గా మారాడు.

నిజానికి ఆ గది నరేష్‌దే. కార్తీక్ వచ్చాక దానిని ఇద్దరూ పంచుకున్నారు. మొదట్లో కార్తీక్ ఇంటింటికి పేపర్లు వేసేవాడు. సాయంత్రాలు ప్రవేట్లు చెప్పేవాడు. కొంతకాలమయ్యాక ఒక రెస్టారెంట్‌లో బిల్లులు రాసేపని కూడా దొరికింది. పి.యు.సి. కట్టాడు. అది పాసయ్యాక డిగ్రీ ప్రయివేట్‌గా పాసయ్యాడు. ప్రస్తుతం ఒక ఎరువుల కొట్లో గుమస్తాగా పనిచేస్తున్నాడు.

"హల్లో పుస్తకాల పురుగూ! ఇంకా పళ్లు తోమడం కూడా పూర్తవలేదా? " ఎవరిదో కంఠం మృదువుగా పలకరించింది.

స్వప్న నిలబడివుందక్కడ. ఆమె సినిమాహాలు ఓనరుగారి అమ్మాయి. నరేష్ అంటే పడిచస్తుంది. ఇప్పుడు కూడా అతనికొరకే వచ్చివుంటుంది.

"నేనే నయం. సగం ముఖం కడుక్కున్నాను. లోపలకు వెళ్ళిచూడు. నీ మనోవల్లభుడు ఇంకా మంచం దిగలేదు" చెప్పాడు కార్తీక్.

స్వప్న దానిమ్మగింజల్లాంటి పళ్లు కనబడేలా నవ్వింది. "ఆ మనిషిని నేను నిద్రలేపుతానుగా" మాట సాగదీస్తూ లోపలకు వెళ్ళిపోయింది.

అప్పుడు గుర్తొచ్చింది కార్తీక్‌కు నరేష్ అలవాటు గురించి. వాడు రాత్రి పడుకునే ముందు లుంగీ కట్టుకునే పడుకుంటాడు. కాని తెల్లవారేసరికి లుంగీ ఒంటిపై వుండదు. గదిలో ఏదో మూల వుంటుంది. కాళ్లతో దానిని తన్ని తన్ని మంచంపైనుంచి కిందకు గెంటేస్తాడు.

హడావుడిగా లోపలకు పరిగెత్తాడు. కాని అప్పటికే జరగవలసిన డామేజ్ జరిగిపోయింది. స్వప్న లోపలకు వెళ్ళి నరేష్‌ని నిద్రలేపింది. నిజంగానే లుంగీ మంచం కింద వుంది. నిండా దుప్పటి కప్పుకుని పడుకున్నాడు. కాబట్టి స్వప్న బతికిపోయింది.

స్వప్న ఎక్కడికో రమ్మంటోంది. నరేష్ నువ్వు వెళ్లు నేను వెనకాలే వస్తానంటున్నాడు. ఊహూ! ఆ అమ్మాయి వినడం లేదు. ఖాళీగా వున్న కార్తీక్ మంచంపై కూర్చుని నేలపై వున్న పుస్తకం ఒకటి చేతిలోకి తీసుకుంది.

కార్తీక్‌వైపు నిస్సహాయంగా చూశాడు నరేష్.

"స్వప్నా! నువ్వు పద. నరేష్‌ను నేను స్వయంగా తీసుకువస్తాను"

"ఫర్వాలేదు కార్తీ. కాసేపు కూర్చుంటాను. ఈలోగా నరేష్ తయారవుతాడు. నిన్ను ఒకటి అడగాలి ఇలారా" పిలిచింది స్వప్న.

కార్తీక్‌కు విషయం అర్థమైపోయింది. గబగబా బాత్‌రూమ్‌లో దూరి సగంలో ఆపిన ముఖప్రక్షాళన కార్యక్రమం పూర్తిచేశాడు.

ఏదో ఒకలా స్వప్నను బయటకు తీసుకురావాలి. లోపలకు వచ్చి దండెంపై వున్న టవల్‌తో ముఖం తుడుచుకున్నాడు.

"నువ్వు కూడాలే. త్వరగా తయారవ్వు" నరేష్‌తో గారంగా అంది స్వప్న.

"లేవలేను స్వప్నా. నన్ను క్షమించు. ఈ విషయంలో నేను నిస్సహాయుడిని" చెప్పాడు నరేష్.

"వెధవ డైలాగులు ఆపి వెంటనే లే" కసిరింది.

కార్తీక్ అందుకున్నాడు.

"లేవలేడు స్వప్నా! వాడికి పూచో పూచో అనే కొరియావ్యాధి వుంది. నిద్ర మంచంపై నుండి లేచిన వెంటనే కాళ్ళు తడబడతాయి. సరిగ్గా నిలబడలేడు"

"అయ్యయ్యో! మరి ఎలా? " కంగారుగా అడిగింది స్వప్న.



"మంచంపై వుండగానే ఒక కప్పు కాఫీ తాగితే మామూలైపోతాడు"

"అయితే త్వరగా వెళ్ళి పట్టుకురా. నేను ఇక్కడే వుంటాను"

"లేదు స్వప్నా. వాడి కాళ్లకు నూనె రాసి మర్దన చేయాలి. కాస్త ఏమి అనుకోకపోతే కిందకు వెళ్ళి ఎదురుగా వున్న హోటల్‌లో రెండు కాఫీ పంపమని చెప్పు"

అలాగేనంటూ బయటకు నడిచింది స్వప్న.

అప్పటికే మంచంపైన మనిషి సలసలా మరుగుతున్నాడు. స్వప్న బయటకు వెళ్ళగానే దుప్పటి పక్కకు విసిరి "నేను అవిటివాడినా? కాళ్ళకు నూనె రాయాలా?" అరుస్తూ లేచి నిల్చున్నాడు.

సరిగ్గా అప్పుడే వాళ్ళిద్దరూ కలలో కూడా ఊహించని సంఘటన జరిగింది. బయటకు వెళ్ళిన స్వప్న గదిలో మర్చిపోయిన పర్సు కోసం తిరిగివచ్చింది.

గదిలో వున్న మగవాళ్ళిద్దరూ బొమ్మల్లా బిగిసిపోయారు.

కెవ్వుమని స్వప్న అరచిన అరుపుకు ఆ వీధి మొత్తం దద్దరిల్లిపోయింది.

★ ★ ★

కార్తీక్ ఒకవైపు ఉద్యోగం చేసుకుంటూనే మరోవైపు సాహితీ సాగరాన్ని మధించడం మొదలుపెట్టాడు.

తెలుగు సాహిత్యంలో ఎన్నెన్నో పుస్తకాలు, ఎందరెందరో రచయితలు! అన్నీ పఠించడానికి ఒక జీవితకాలం సరిపోదేమో. ఎందరో మహానుభావులు జీవితాలను కాచి వడబోసి రచించిన పుస్తకాలు.

వీటికి సమాంతరంగా మరోవైపు డిటెక్టివ్ సాహిత్యం వుండేది. దానిని శవసాహిత్యంగా పేర్కొనేవారు. అయితే దాని పాఠకులు దానికి వుండేవారు.

పదిమంది చేరి మాట్లాడేచోట మధ్యలో కవిత వాడటం ఫ్యాషన్‌గా వుండేది. అక్షరాలను ఆయుధాలుగా చేసి చదువరి గుండెల నుండి దూసుకుపోయేలా చేసేవాళ్ళు కవులు.

చదవడంతోపాటు కార్తీక్ చిన్న చిన్న కవితలు కూడా రాసేవాడు. కాని ఎవరికీ చూపించేవాడు కాదు. అతని ఆలోచనలకు స్పష్టమైన రూపం వుండేదికాదు. తన మనస్సులోని భావాలను సరైన పదాలలో పెట్టలేకపోయేవాడు. కలం పట్టిన కొత్తలో రచయితలంతా ఎదుర్కొనే సమస్యే అతనికీ ఎదురైంది.

అంతేకాదు. ఇరవైఏళ్ల వయస్సులో యువకులందరిలానే స్వప్న జగత్తులో తేలియాడేవాడు. ఒక డాక్టర్‌ని చూసినప్పుడు తాను కూడా పెద్ద డాక్టర్ అయినట్లు, యాక్టర్‌ని కలిస్తే పెద్ద మెగాస్టార్ అయినట్లు కలలు కనేవాడు.

అంతలోనే 'నా జీవితం ఇలా ఎరువుల కొట్లో బలయిపోవలసిందేనా' అనిపించి నిరాశ నిస్పృహలకు గురయ్యేవాడు.

★ ★ ★

నిశీధి నిశ్శబ్దంతో కలిసి ప్రపంచాన్ని ఏలుతోంది. చలిగాలి రివ్వున వీస్తోంది. రోడ్లన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. రోడ్డుకిరువైపులా వున్న వీధిదీపాలు మసక మసకగా వెలుగుతున్నాయి.

రోడ్డుపై వున్న ఖాళీడబ్బాని కాలితో లాగిపెట్టి తన్నాడు నరేష్. ఆ నిశ్శబ్ద వాతావరణంలో అది భయంకరమైన శబ్దాలు చేసింది. కార్తీక్ చెవులు మూసుకున్నాడు.

రెండవ ఆట సినిమా చూసి వస్తున్నారిద్దరూ. ఏవో కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు. హఠాత్తుగా కనబడిందది.

రోడ్డుకు కుడిపక్కగా ఒక చెట్టుకు గుద్దుకుని పడివుందో స్కూటర్.

గబగబా ముందుకు పరిగెత్తారిద్దరూ.

స్కూటర్‌కు కొద్దిదూరంలో నేలపై వెల్లకిలా పడివున్నాడొక వ్యక్తి. ఒళ్ళంతా గాయాలై రక్తం కారుతోంది. వాళ్ళకు ఏం చెయ్యాలో తోచలేదు. కనుచూపుమేరలో పురుగులేదు.

"ఏంచేద్దాం కార్తీ? " అడిగాడు నరేష్.

"మన ఇంటికి తీసుకువెళ్ళాలంటే చాలా దూరంకదా? పైగా రిక్షాలు కూడా అందు బాటులో లేవు" కార్తీక్‌కు ఏం పాలుపో లేదు.

"కాని ఇలా వదిలితే రక్తస్రావం అధికమై ఇతడు చనిపోయే ప్రమాదముంది. చెరో వైపు పట్టుకుని మోసుకుపోదాం పద" చెప్పాడు నరేష్.

ఇద్దరూ కలిసి ఆ మనిషిని ఎత్తుకుని నడ వసాగారు. ఇద్దరి భుజాలు పుళ్లుపడిపో యాయి. ఒక్కసారిగా ఇరవై లంకణాలు చేసినవాళ్ళలా తయారయ్యారు.

దారిలో ఒక ఆర్.ఎం.పి.డాక్టర్ ఇల్లు వుంది. ఆయన పేరు సుందరం. ఆ ప్రాంతానికి ఆయనే డాక్టర్.

చాలాసేపు కాలింగ్ బెల్ మోగించాక ఆ డాక్టర్ తలుపు తెరిచాడు.

"ఏమైంది? " నరేష్ భుజంపై మనిషిని చూసి ఆదుర్దాగా అడిగాడాయన.

"అదే మీరు చూసి చెప్పవలసింది" ఆయన్ను తోసుకుని లోపలకు వెళ్ళి భుజంపై మనిషిని అక్కడి బల్లపై పడుకోబె ట్టాడు నరేష్.

"కేసు నేను తీసుకుంటానో లేదో తెలుసు కోకుండా అలా బల్లపై పడుకోబెడతావే మిటి? " కాస్త కోపం చూపిస్తూ అన్నాడా యన.

"మీరు చూడకపోతే మీ గుమ్మంలో పడే సిపోతాం సార్. మాదేం పోయింది"

"అదేమిటి? అతడు మీ బంధువు కాదా? "

కార్తీక్ జరిగినదంతా వివరంగా చెప్పాడు. సుందరంగారు అతడిని పరీక్షించారు.

"బాగా తాగి వున్నాడు. ఆ మైకంలో చెట్టుని గుద్ది వుంటాడు. గాయాలకు కట్టుక డతాను. తెల్లవారాక అతనే లేస్తాడు" చెప్పారు.

అతడి గాయాలకు కట్లు కట్టి రెండు ఇంజక్షన్లు ఇచ్చారు.

"ఇతడిని ఇక్కడే వుంచి మీరు వెళ్ళి పొండి. ప్రొద్దుటరండి" నరేష్‌వైపు చూస్తూ చెప్పాడాయన.

★ ★ ★

తెల్లవారాక వాళ్ళు వెళ్ళేసరికి ఆ వ్యక్తి లేచి కూర్చుని ఉన్నాడు. చాలా హుషారుగా వున్నాడు. అన్నింటికంటే విచిత్రం సుందరం గారు నానా హడావుడి చేస్తున్నారు. డబ్బున్న మహరాజులకు తప్పించి మామూలు మనుషులకు అక్కడ అటు వంటి ట్రీట్‌మెంట్ లభించదు. అంటే ఆ కొత్తమనిషి దగ్గర డబ్బు వాసన పసిగట్టాడ న్నమాట.

"హల్లో! మీకు ఎలా కృతజ్ఞతలు చెప్పుకో వాలో నాకు తెలియడంలేదు. అర్ధరాత్రి నన్ను అంతదూరం నుండి మోసుకువచ్చా రంటే"...భుజాలు ఎగరేసాడతను.

కార్తీక్ మొహమాటంగా నవ్వాడు. అతడు తన జేబునుండి పర్సు బయటకు తీశాడు.

"మీ సహాయానికి ప్రతిఫలం కాదు. ఏదో నా కృతజ్ఞతకొద్దీ" అంటూ కొన్ని నోట్లు తీసి ఇవ్వబోయాడు.

తోకపై కర్రదెబ్బ తగిలిన పాములా రెచ్చి పోయాడు నరేష్.

"డబ్బుకోసమే అయితే రాత్రే ఆ పర్సు తీసుకుపోయేవాళ్ళం సార్. అక్కడ మమ్మల్ని అడిగే వాళ్ళు ఎవ్వరూలేరు" తీవ్ర స్వరంతో చెప్పాడు.

"ఆహా! అలాగని కాదు" అతడు తడబ డ్డాడు.

"లేదులెండి. భగవంతుడి దయవల్ల మాకు డబ్బు అవసరం మరీలేదులెండి.





అయినా మేము చేసిందేముందండీ. ఆ పరి స్థితిలో ఎవ్వరున్నా ఆ మాత్రం సాయంచే సేవారు" కార్తీక్ కల్పించుకుని చెప్పాడు.

"నాపేరు త్రిమూర్తులు" చెప్పాడతను.

తమపేర్లు, ఉద్యోగాలు చెప్పారిద్దరూ.

"అచ్చా! నాకు ప్రత్యేకంగా ఉద్యోగం అంటూ ఏమీలేదు. నేను కాక నా మనుమ లదాకా తిని కూర్చునేలా మా నాన్న సంపా దించాడు. అందువల్ల సరదాగా నాటకాలు ఆడటం, దర్శకత్వం చెయ్యడం నా పనిగా పెట్టుకున్నాను"

"అయితే నాకు మీ నాటకంలో ఒక పాత్ర ఇవ్వండి" నరేష్ ఉత్సాహంగా అన్నాడు.

"అదీ అలా చెప్పండి! మీ క్కూడా నాట కాల పిచ్చి వుందన్నమాట. ఈ శనివారం ఆనంద కళాక్షేత్రం తెలుసుగా. అక్కడికి వచ్చేయండి మరి మీ సంగతేమిటి? " కార్తీక్‌ని అడిగాడు.

"అబ్బే! నాకటువంటి పిచ్చిలేదులెండి" నవ్వుతూ చెప్పాడు కార్తీక్.

చెప్పాడేగాని ఆ శనివారం నరేష్‌తోపాటు అతడు కూడా వెళ్ళాడు. అప్పుడే కాదు ఆ తర్వాత చాలాసార్లు వెళ్ళాడు. తొందరలోనే ఆ పిచ్చి అతనికి కూడా అబ్బింది.

త్రిమూర్తులు ఒకనాటిక రాశాడు. అందులో నరేష్ తాగుబోతుగా నటించాడు. ఆ పాత్ర అతనికి బాగా పేరు తెచ్చింది. ఆ నాటిక కూడా చాలా పేరు గడించింది. చాలా ప్రదర్శనలిచ్చింది. త్రిమూర్తులు ఆ నాటిక ప్రింటు చేయించాడు. బాగానే అమ్ముడయ్యింది.

దాంతో కార్తీక్‌కు నాటిక రాయాలనే సరదా పెరిగిపోయింది. వారం రోజులు తిండి తిప్పలు మాని ఒక నాటిక రాసాడు. కొద్దిగా సైన్స్ కలిపి మనుష్యుల మనస్సుల్లోని ఆశనూ, అవకాశవాదాన్ని ఎత్తి చూపిస్తూ రాసాడు. ఎంతోకాలంనుండి దాచుకున్న రకరకాల కొటేషన్స్‌తో ఆ నాటిక నింపేశాడు.

అది విపరీతంగా సక్సెస్ అవుతుందనీ, ఎన్నో ప్రదర్శనలిస్తుందనీ, ఎన్నో అవార్డులు అందుకుంటుందనీ ఆశించాడు. ఆ నాటిక మొదటి ప్రదర్శన త్రిమూర్తులు దర్శకత్వంలో నరేష్ వాళ్ళు ప్రదర్శించారు.

అంతే! అదే ఆఖరి ప్రదర్శన! అది సూపర్ ఫ్లాప్ అయ్యింది. కనీసం ఒకళ్ళ నుండి కూడా మెప్పురాలేదు. పెద్ద రచయిత కావాలన్న తన బంగారు కల మొదట్లోనే చెదిరిపోతున్నదని భయం వేసింది కార్తీక్‌కు.

అప్పుడు త్రిమూర్తులు చెప్పాడో కొటేషన్. కార్తీక్ జీవితంలో మర్చిపోలేనిది.

"రచయిత తనకు తెలిసిందంతా ప్రదర్శించకూడదు. పాఠకులు ఎంత అర్థంచేసుకుంటారో అంతవరకే చెప్పాలి"

★ ★ ★

కార్తీక్ రైల్వేస్టేషన్‌ముందు ఆటో దిగాడు. ఒకసారి చేతిగడియారంవంక చూసుకుని లోపలకు నడిచాడు. కుడిచేతిలోని సూట్‌కేస్ బరువుగా వుంది.

"సికింద్రాబాద్ ఎక్స్‌ప్రెస్ వెళ్ళిపోయిందా?" అటు వెడుతున్న రైల్వేకూలీని అడిగాడు. అతను రాలేదన్నట్లు తలవూపాడు.

కార్తీక్ ప్లాట్‌ఫారం పైకి వెళ్ళి హిగిన్ బాదమ్స్ దగ్గర నిలబడి సూట్‌కేస్ నేలపై వుంచాడు. లోపల చాలా రకాల పుస్తకాలు వున్నాయి. ఆసక్తిగా చూడసాగాడతను.

ఎప్పటికైనా తను రాసిన పుస్తకాలు కూడా అక్కడ వుండాలనుకుంటూ అలాగే పగటికలలలోనికి వెళ్ళిపోయాడు.

"ఎక్స్‌క్యూజ్ మి"

ఉలిక్కిపడి పక్కకు తప్పుకున్నాడు కార్తీక్. ఒక యువతి అతడిని దాటుకుని షాపు ముందుకు వెళ్ళింది.

తెల్లగా చక్కగా వుందామె. ఎర్రటి చీర పైన నల్లటి పువ్వుల ప్రింట్ చక్కగా అమిరింది. ఆమెనుండి చక్కటి పౌడర్‌వాసన కార్తీక్‌ను తాకింది.

బాగానే వుందిగాని ముక్కే కొద్దిగా లావుగా వుంది అనుకున్నాడు. ఆమె కొలతలు కూడా అద్భుతంగా వున్నాయి. మిస్ ఇండియా కొలతల్లాగా.

"పార్వతీ! త్వరగారావే" వెనుకనుండి మరో కంఠం మృదువుగా వినబడింది.

గిర్రున వెనక్కు చూశాడు కార్తీక్.

అక్కడ మరో మెరుపుతీగ నిలబడివుంది. ఖరీదైన చీరలో మరీమరీ చూడాలనిపించేలా వుంది. ఆమె ఎందుకో నవ్వింది. ఆ నవ్వు చాలా బావుంది.

"ఏయ్ సరోజ! ఇంకా ఏమైనా పుస్తకాలు తీసుకోమంటావా? " పార్వతి అడిగింది.

"నాకేమీ వద్దు. త్వరగారా. రైలు వచ్చేస్తోంది" చెప్పిందామె.

అయిదు నిముషాల్లో బండిరావడంతో అటు కదిలాడు కార్తీక్.

తన కంపార్ట్‌మెంట్ వెదుక్కుని వెళ్ళి





తలుపు పక్కనే అంటించి వున్న ప్రయాణీకుల పేరు, టిక్కెట్ నంబర్లు గల కాగితాన్ని చదివాడు. తన పేరు, టిక్కెట్ నంబరు ఎదురుగా వున్న బెర్త్ నంబరువంక చూశాడు. పదహారు. కంపార్ట్‌మెంట్‌లోనికి ఎక్కాడు. తన సామాను సీటుకింద వుంచి కూర్చున్నాడు. అదే సమయంలో ప్లాట్‌ఫారంపై తాను చూసిన యువతులిద్దరూ లోపలికి వచ్చారు.

కార్తీక్ గుండె ఝల్లుమంది.

ఆ ఇద్దరిలో పార్వతి అందంగా వున్నా, సరోజలో ఏదో ఆకర్షణ వుంది. ఆ ఆకర్షణ ఆమెను మళ్ళీ మళ్ళీ చూడమంటోంది.

స్నేహితురాలితో మాట్లాడుతూ మధ్య మధ్య ఒకటిరెండుసార్లు కార్తీక్‌వైపు చూసింది. ఆ చూపు తల్చుకుని కొన్ని సంవత్సరాలు బతికేయవచ్చు అంత గొప్పగా చూసింది.

అంతలోనే ఆ అమ్మాయి కార్తీక్ దగ్గరకు వచ్చింది. అతనిముందు నిలబడి "ఎక్స్‌క్యూజ్ మి" అంది.

ఆకాశంలో అతివిలాసంగా సాగే దేవకన్య హఠాత్తుగా తనముందు వాలినట్లు చిత్తరువులా బిగిసిపోయాడు కార్తీక్.

"మాలో ఒకరికి పైబర్త్ ఇచ్చారు. ఏమి అనుకోకపోతే అది మీరు తీసుకోగూడదూ" అంది.

తల వూపాడు కార్తీక్.

ఆ అమ్మాయి అందంగా ఓ చిరునవ్వు నవ్వి "థాంక్స్" అంది.

"మీ పేరు" పక్కనున్న పార్వతి అడిగింది.

"కార్తీక్" చెప్పాడు.

"రైలు టైంకే నడుస్తుంది కదా? " ఎదురుగా వున్న బెర్త్‌పై కూర్చుంటూ అంది సరోజ.

కార్తీక్ ఎరువులషాపు పనిపైన బయలుదేరాడు. ఆ ఊళ్ళో రెండు రోజులు వుండాలి.

"మీరు ఏం చేస్తుంటారు? " పార్వతి అడిగింది.

కార్తీక్ చెప్పాడు. ఆ తర్వాత ఆ అమ్మాయి పుస్తకం చదవడంలో పడిపోయింది. కార్తీక్ సరోజను మాటల్లోకి దింపాడు. రైలు పెద్దగా కూతపెట్టి పరుగందుకుంది.



ఈ మధ్య కార్తీక్ దృష్టి మళ్ళీ సాహిత్యంవైపు మళ్ళింది. అప్పటికే మార్కెట్లలో చాలా రకాల వార, మాసపత్రికలు వున్నాయి. సీరియల్స్ యమజోరుగా సాగుతున్నాయి. కథా ప్రక్రియకు విలువ తగ్గింది. నవలా ప్రక్రియకు డిమాండ్ పెరిగింది.

ఆ నవలలు కూడా ఆడవాళ్ళే లేదా ఆడపేరుతో మగవాళ్ళే ఎక్కువగా రాస్తున్నారు. ఎవరో ఒక రచయిత్రి సీరియల్ లేనిదే ఏ పత్రిక మనుగడా సాగని పరిస్థితి వచ్చింది. కథలు కూడా ప్రేమించుకోవడం, విడిపోవడం వంటి అంశాలపైనే ఎక్కువ వుండేవి. ఇందుకు భిన్నంగా పత్రికలు కథల పోటీలు నిర్వహించినప్పుడు మాత్రం చిత్రంగా బీదవాళ్ళ కథలు వచ్చేవి. బహుమతులు ఎక్కువగా వాటికే వచ్చేవి. వాటి రచయితలు కూడా వేరే వుండేవారు.

వారిలో ముఖ్యుడు భద్రం. నాటిక పోటీలలో అతడు కార్తీక్‌కు పరిచయం అయ్యాడు. అతని ద్వారానే కార్తీక్ కథ అనే దానిని ఎలా నడపాలి అనేది నేర్చుకున్నాడు. భద్రం మాటలు చిత్రంగా వుండేవి.

"ఇప్పుడైతే నేను రచయితను కానీ, నా చిన్నతనంలో ఏనాడూ నేను రచయితను కావాలని అనుకోలేదు. నేనెప్పుడూ కవితలు, గేయాలు రాయలేదు. సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొనలేదు. కాని నా చుట్టూ మనుష్యులు ఏం చేస్తున్నారా అని గమనించేవాడిని. రచనలు అనేవి వంటింట్లో నుండో, కాక్‌టైల్ పార్టీల నుండో కాకుండా జనం మధ్యనుండి రావాలి"

"రచయిత కావడానికి అర్హత ఏమిటి సార్? " కార్తీక్ అడిగాడు.

"ఒక్కమాటలో చెప్పాలంటే మంచి రచయిత కావడానికి పండితుడివి కానక్కరలేదు. వ్యాకరణం రానవసరంలేదు. కావలసిందల్లా కాస్త భాషాజ్ఞానం. మంచి శైలి. అన్నింటికీ మించి నిజాయితీ. నీతో నీవు రాజీపడకుండా వుండటం"

అతని మాటలు కార్తీక్‌ను బాగా ఆకర్షించేవి. ఆ మాటలను పునాదిగా చేసుకుని తన ఆలోచనలు కొనసాగించేవాడు.

ఈలోగా డిటెక్టివ్ సాహిత్యంలో కూడా పెనుమార్పులు వచ్చాయి.

అడుగు జాడలు, వేలిముద్రలు, సిగరెట్ బూడిదలు, నేరస్థుడి మనస్తత్వ విశ్లేషణ, వీటి ఆధారంగా వాలు కుర్చీలో పడుకుని కళ్ళుమూసుకుని నేరస్థుడి ఆచూకి చెప్పే మేధావుల స్థానంలో ఆరడుగుల పొడవుతో కండలు తిరిగిన శరీరంతో అమ్మాయిలతో ఆడుకునే అందమైన హీరోలు ప్రత్యక్షమయ్యారు.

ఈ జరుగుతున్న మార్పులన్నింటిని గమనిస్తూ తన మొదటి కథకు ఇతివృత్తం వెదుక్కున్నాడు కార్తీక్.

చివరకు ఒక కొత్త ప్రయోగంతో కథ రాసాడు. అందులో అంతవరకు కొన్నివందల నవలల్లో కొన్ని వేల కథల్లో సబ్జక్ట్ అయిన ప్రేమనే ప్రధానాంశంగా తీసుకున్నాడు.

అసలు ప్రేమంటే ఏమిటి అనే దానిని తన పది పేజీల కథలో చర్చించాడు. ప్రేమకు నిర్వచనం వివిధ పాత్రలచేత వివిధ రకాలుగా చెప్పించాడు. ఒక వ్యక్తి కాలేజీలో ఒక అమ్మాయిని ప్రేమిస్తాడు. ఆ తర్వాత వేరొకరిని పెళ్ళాడతాడు. భార్యను ప్రేమించాననుకుంటాడు. కాని కొంతకాలం గడిచాక భార్యాభర్తల మధ్య తగవులు రావడంతో అది భ్రమ అనుకుంటాడు. పిల్లలను ప్రేమిస్తున్నాననుకుంటాడు. వాళ్ళు ఎవరి దారి వాళ్ళు చూసుకునేసరికి అదీ భ్రమే అనుకుంటాడు. చిట్టచివరికి వేరొకరినుండి ప్రేమను పొందడంకంటే తన చుట్టూ వున్న వాళ్ళందరికి తన ప్రేమను పంచడంలోనే ఎక్కువ ఆనందం వుందనుకుంటాడు.

ఆ కథ ఒక వారపత్రికలో ప్రచురించాక అచ్చులో చూసుకుని అతను పొందిన ఆనందం అంతా ఇంతాకాదు. అమృత భాండం దొరికినట్లు, కల్పవృక్షం తన పెరటిలో వెలసినట్లు అతని సంతోషం మాటలలో వర్ణించలేనిది.

నరేష్ కూడా చాలా సంతోషించాడు. కనిపించిన వాళ్ళందరికీ చూపించాడు.

సరిగ్గా నెలరోజుల తర్వాత మరొక కథ ప్రింటయ్యింది. భార్య భర్తనుండి ఏం కోరుకుంటుంది అనే అంశంపై రాసాడు. ఆ కథకు అతనికి ప్రత్యేక ప్రశంశలు అందాయి. ఆ విధంగా ఒక ఏడాదిలో దాదాపు ఇరవై కథలు రాసాడు. ఒక నవలికకు ప్రథమ బహుమతి వచ్చింది. ఆ సందర్భంగా అతని ఫోటో, పరిచయం ప్రచురించబడ్డాయి. పాఠకులలో అతనికి గుర్తింపు మొదలయింది.

అయితే అది అతనికి సంతృప్తినివ్వడం లేదు. ఇంకా ఇంకా పేరు గడించాలి. డబ్బు సంపాదించాలి.




అతని కోరిక అతడిని కుదురుగా వుండని వ్వడంలేదు.

★ ★ ★

ఈ ఏడాది కాలంలో పార్వతితోనూ, సరోజతోనూ కార్తీక్ స్నేహం బాగా పెరిగింది. వాళ్ళు ముగ్గురూ చాలా సన్నిహితులైపోయారు.

ఇద్దరిలోనూ సరోజ అందమైన, డబ్బున్న అమ్మాయి. ఆమె వాడే సెంట్ కూడా ఖరీదైనదే! ఆమె వెళ్ళి చాలా సేపయినా ఆ సువాసన కార్తీక్‌ను అంటిపెట్టుకునే వుండేది.

పార్వతి మధ్యతరగతి అమ్మాయి. ఆమె కళ్ళు ఆమెలో ప్రత్యేమైన ఆకర్షణ. అవి అప్పుడే పుట్టిన పసిపాప కళ్ళలా స్వచ్ఛంగా అమాయకంగా వుంటాయి. ఆమె సమక్షంలో కార్తీక్‌కుగంటలు నిముషాల్లా గడిచిపోయేవి.

ఆరోజు సరోజ పుట్టినరోజు. పార్వతి ఊళ్ళో లేకపోవడంతో కార్తీక్‌ను తీసుకుని సినిమాకు వెళ్ళింది. ఒక ఆడపిల్లతో ఒంటరిగా సినిమాకు వెళ్ళడం కార్తీక్‌కు అదే ప్రథమం. చాలా ఎక్సైటింగ్‌గా ఫీలయ్యాడు.

సినిమా మధ్యలో అతని చెయ్యి సరోజ చేతిపై పడింది. ఆ అమ్మాయి చేతిని వెనక్కు తీసుకోలేదు. సరిగదా కార్తీక్ చేతిని గట్టిగా పట్టుకుంది.

"కార్తీ! కథలు ఎలా రాస్తారు? " అతని భుజంపై తల వాలుస్తూ అడిగింది.

"ఎలాగేమిటి? పెన్నుతో కాగితంపై రాస్తాను"

"ఛీ... అది కాదు మూడ్ వచ్చినప్పుడు మాత్రమే రాస్తారంటారు కదా? నీకు మూడ్ ఎప్పుడు వస్తుంది? "

"అదో పిచ్చి నమ్మకం రోజా! ఇప్పటి రచయితలు సామాన్యంగా తమ ఇష్టం వచ్చినప్పుడు అదే మూడ్ సరిగ్గా వున్నప్పుడు రాస్తామంటున్నారు. కాని ప్రఖ్యాతి చెందిన రచయితలంతా ఒక పథకం ప్రకారం, ఒక కఠినమైన క్రమశిక్షణతో రచనలు చేసేవారేనని మనోవైజ్ఞానికులు అంటున్నారు"

"అంటే ఎలా? " అతని చెవిలో గుసగుసగా అడిగింది సరోజ.

ఆమె స్పర్శ అతనిలో గిలిగింతలు రేపుతోంది. ఆమె చేతులమృదుత్వం, కంఠంలో జీర, చివరకు అతని కంఠానికి తగులుతున్న ఆమె ఊపిరి కూడా అతన్ని రెచ్చగొడుతున్నాయి.

"ఇర్వింగ్ వాలెస్ ఒక నవల ప్రారంభిస్తే మొదట్లో చాలా నెమ్మదిగా రాసేవారట. ఆ తర్వాత అది వేగం పుంజుకుంటుంది. ఒక అధ్యాయం పూర్తయిన తర్వాత కొంచెం నెమ్మదిగా తన రచన కొనసాగించి మళ్ళీ వేగాన్ని పెంచేవారు. రోజుకు పది పేజీల నుండి ఇరవై పేజీల వరకు రాసేవారు. ఏపనైనా సరిగ్గా ప్రారంభిస్తే ఆ తర్వాత పూర్తి చెయ్యడానికి తగిన ఉత్సాహం దాని నుండే లభిస్తుంది"

సరోజ తన మాటలు వినడంలేదని గ్రహించి ఆపేశాడు. అతనికి కొద్దిగా నిరుత్సాహం కలిగింది. అయితే సరోజ పెదవులతో అతని బుగ్గలను తాకే సరికి సర్వం మరిచిపోయాడు. ఆమె వదులుతున్న ఊపిరి తన గుండెలను కాల్చేస్తున్నట్లు వుంది. మెల్లిగా తలప్రక్కకు జరిపి ఆమె పెదవులు అందుకున్నాడు. దేవుడు ఆడదాని పెదవులలో అమృతం దాచాడనుకున్న కార్తీక్‌లో క్షణాలలో ఆవేశం పెరిగింది.

ఆ తర్వాత ఎన్నోసార్లు వాళ్ళిద్దరూ సినిమాలకు, పార్కులకు వెళ్ళారు. అయితే అవన్నీ పార్వతికి తెలియకుండా జాగ్రత్త పడేవాళ్ళు. పార్వతితో కార్తీక్ అనుబంధం వేరేరకంగా వుండేది.

పార్వతికి సాహిత్యంపై మంచి అవగాహన వుంది. ఇదివరలో వచ్చిన కథలు, ఇప్పుడు వస్తున్న నవలలు అంటూ ఆమె మాటలు మొదలుపెడితే కాలం తెలిసేది

కాదు.

వాళ్ళ మాటలలో ఎన్నో విషయాలు వచ్చేవి. సిగ్మండ్ ఫ్రాయిడ్ నుండి నెపోలియన్ హిల్ వరకు షేక్స్పియర్ నుండి షిడ్నిషెల్డన్ వరకు ఎందరో వచ్చేవారు.

నిజంగా పార్వతి ఒక నడిచే గ్రంథాలయం. ఇటువంటి విషయాలలో సరోజ ఏమాత్రం శ్రద్ధ చూపేదికాదు. అయినా కార్తీక్ సరోజ అంటేనే ఇష్టం చూపేవాడు.

ఒకసారి పేపర్లో ఎవరో చిన్నిపాప ఫొటో పడింది. ఆ పాపకు ఆపరేషన్ చెయ్యాలనీ, లేకపోతే బతకదనీ, అందుకు ఐదువేల రూపాయలు కావాలనీ ఆ ఫొటో కింద రాసారు. ఆ పాప తండ్రి తన నిస్సహాయ స్థితి తెలియజేస్తూ దాతల సహాయం కోరాడు.

ఆ వార్త చూపిస్తూ సరోజ కళ్ళ నీళ్ళుపెట్టుకుంది. ఆమె సున్నిత హృదయానికి కార్తీక్ ముగ్ధుడైపోయాడు. ఆ తర్వాత ఎప్పుడో పార్వతి కనబడినప్పుడు ఆ విషయం చెప్పాడు.

"కేవలం ఏడిస్తే సరిపోతుందా కార్తీ. నిజంగా సరోజ తల్చుకుంటే ఆ డబ్బు ఇచ్చి ఆ పాపను రక్షించలేదా? "

"తనకు ఇంట్లో అంత డబ్బు ఇవ్వొద్దా? "

"సహాయం చెయ్యదల్చుకుంటే ఎలాగైనా చెయ్యవచ్చు కార్తీ"

సరోజను తప్పుపడుతుంటే కార్తీక్ కు చాలా బాధ కలిగింది. అందుకే పార్వతితో వాదనకు దిగాడు.

"ఏ రకంగా చెయ్యగలం? సరోజ స్థానంలో నువ్వు వుంటే ఏం చేసేదానివి? "

"నేను పార్వతి స్థానంలోనే వుండి చేశాను. పార్వతిగానే చేశాను. ఈ ఊళ్ళోనే రాఘవరావుగారనే లాయరుగారున్నారు. ఆయన ఇటువంటి బాధితులకు వెంటనే సహాయం అందిస్తారు. ఆయన నుండి కొంత డబ్బు సేకరించాను. రోటరీ వంటి సంస్థలనుండి మరికొంత డబ్బు సంపాదించాను. మొదట్లో ఇదంతా బోగస్ కాదుగదా అనే అనుమానం కలిగింది. లాయర్గారు ఆ పాప గూర్చి వాకబ్ చేశారు. నిజమేనని రుజువుచేసుకున్నాక డబ్బు ఇచ్చాము. నా వాటాగా బ్లడ్ డొనేట్ చేశాను" గబగబా చెప్పింది.

కార్తీక్ కు నోట మాటరాలేదు. ఆమె ముఖంలోనికి చూస్తూ వుండిపోయాడు.

అతని కళ్ళలో ఏమి కనిపించిందో సన్నగా గువ్వ గొణుగుతున్నట్లుగా అంది.

"చూస్తూచూస్తూ ఒక మనిషిని ఎలా వదిలేస్తాం? మనం రక్షించగలిగే అవకాశం వుండి కూడా ఎలా చనిపోనిస్తాం? "

★ ★ ★

రోజులు హాయిగా దొర్లిపోతున్నాయి. సరోజ ప్రేమలో పడ్డ కార్తీక్ కు రోజులు ఎలా గడుస్తున్నాయో తెలీడంలేదు. పార్వతితో కూడా అతని స్నేహం పెరగసాగింది. అలాగే వీరభద్రంతోనూ స్నేహం దినదిన ప్రవర్థమానమవసాగింది. ఒకరకంగా వీరభద్రం కార్తీక్ కు గురుతుల్యుడయ్యాడు. రాసిన ప్రతీదీ అతనికి చూపించేవాడు. వీరభద్రం తన అభిప్రాయం నిష్కర్షగా చెప్పేవాడు. కథలపై అతని అభిప్రాయాలు చాలా బావుండేవి.

"కార్తీ! కథ కూడా జిజ్ఞాసనుండి పుట్టిందే. ఇది భాష ఎంత ప్రాచీనమైనదో అంత ప్రాచీనమైనది. కథా శిల్పంపై చాలా వాదోపవాదాలున్నాయనుకో. అయితే కథ రాయడం కూడా ఒక నేర్పు. ఈ దేశంలో దారిద్రరేఖ దిగువున కోట్లాది మంది వున్నారు. వారినుండే రచయిత ఉత్తేజం పొందాలి. వారికే అతని సాహిత్యం ఉపయోగపడాలి"

ఇది మాత్రం కార్తీక్ కు నచ్చేదికాదు. అసలు కథలు, నవలలు చదివేది మధ్యతరగతి ప్రజలు. బాగా డబ్బున్న వాళ్ళుగాని, పేదవాళ్ళుగాని పుస్తకాల జోలికి పోరు. ఇక




# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపటం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచటం, లేనిపక్షంలో తిప్పిపంపటం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జనవరి చతుర నవల శిథిలాలయం..........................

సమీక్షకుని పేరు : ..................................................

చిరునామా : ..........................................................

..........................................................

..........................................................

..........................................................

పేదవాళ్ళకు సాహిత్యం ఎలా ఉపయోగప డుతుంది?

"కార్తీ! నీకొక సంఘటన చెప్పనా? సాహిత్యం ఎంత బలమైనదో తెలియజేసే సంఘటన. బ్రిటిష్ దేశపు గని కార్మికుల బాధలు ఒకపుడు వర్ణనాతీతంగా వుండేవి. తిండిలేక ఆరు ఏడు సంవత్సరాల పిల్లలు కూడా బొగ్గుపని చేసేవారు. అందులో ప్రతీ సంవత్సరం కొన్నివేల మంది చనిపోయే వారు. అప్పుడు ఎలిజిబెత్ బ్రౌన్ అనే కవయిత్రి ఈ దయనీయ పరిస్థితికి స్పందించి "క్రై అవర్ చిల్డ్రన్" అనే గేయం రాసింది. ఆ గేయం బ్రిటిష్ ప్రజలను కదిలించి వేసింది. పెద్దదుమారం రేగింది. బాలకార్మిక చట్టం వచ్చింది. పిల్లలకు నిర్బంధవిద్య ప్రవేశపెట్టారు. వాళ్ళకు ఉచిత భోజన సదుపాయం కలుగజేసారు. అదీ సాహిత్యమంటే. జీవితమే సాహిత్యం. సాహిత్యం జీవితం కోసమే"

వీరభద్రం మాటలు ఎంతగా కదిలించినా కార్తీక్ వాటిని అమలులో పెట్టదల్చుకోలేదు. అలా చేస్తే తను కూడా వీరభద్రంలా పేద రచయితగా ఉండిపోవాలి. అది అతని ఆశయం కాదు. కార్తీక్ ఒక సెన్సేషనల్ రచయిత కావాలి. ఈ ఆంధ్రదేశంలో ప్రతీ టీనేజ్ ఆడపిల్లచేతిలోనూ తన పుస్తకాలు వుండాలి. అర్ధరాత్రి వరకు టేబుల్ లైటు వెలుగులో చదివే ప్రతీకుర్రాడి ముందు తన పుస్తకమే వుండాలి. ప్రతీ ఆడపిల్ల తన నవలా నాయకుడిని భర్తగా కోరుకోవాలి. ప్రతీ యువకుడు తనంత ఎత్తు ఎదగాలని వాంఛించాలి.

కార్తీక్‌లోని ఈ కోరిక వటవృక్షంలా పెరుగుతోంది. అతడు తన చుట్టూ వున్న నవలా ప్రపంచాన్ని పరిశీలించి చూశాడు. ప్రతీ పత్రికలోనూ రెండుమూడు సీరియల్స్ వుంటున్నాయి. అవన్నీ ఆడవాళ్ళు రాసినవే.

ఆ నవలలు అన్నీ ఒకేరకం కథాంశంతో ఉండేవి. బాగా డబ్బున్న హీరో పేదపిల్లను పెళ్ళి చేసుకోవడం, ఆ అమ్మాయి ఏదో చిన్న మాట పంతంపై విడిపోవడం.

అన్నింటిలోనూ ఒకేరకమైన వర్ణనలు, ఒకేరకం పదజాలం ఉపయోగించేవారు. చిలిపిగా చూశాడనీ, కొంటెగా నవ్విందనీ, ఈ రకంగా వుండేవి.

"అతని విశాలమైన ఛాతీపై ఆమె నిశ్చింతగా తలవాల్చింది" అని గాని,

"అతడిని లతలా అల్లుకుపోయి ఆ గాఢ పరిష్వంగంలో తన ఉనికినే మరిచిపోయింది" అనిగాని.

"ఆ పవిత్రమూర్తిని తల్చుకుని వారి కళ్ళు చెమర్చాయి" అనిగాని ముగింపు వాక్యాలు వుండేవి.

ఆ నవలలు మధ్యతరగతి ఆడపిల్లలకు ఎక్కడలేని ఆశలు కల్పించేవి. పెద్ద పడవ లాంటి కారు, కోటవంటి బంగళా, బోలెడు ఆస్థి వున్న ఆరడుగుల హీరో తమను వెదుక్కుంటూ వస్తాడని కలలుకనేవారు ఆడపిల్లలు.

ఆడవాళ్ళ ఆత్మాభిమానం పేరుతో హీరోయిన్ భర్తతో చిన్న కారణంతో విడిపోవడం. పోనీ విడిపోయింది స్వతంత్రంగా బతుకుతుందా అంటే అదీ లేదు. చివరిలో మళ్ళీ భర్తను కలుస్తుంది. దాదాపు అన్ని నవలలు ఇదే పద్ధతిలో మూడు వందల పేజీలు సాగేవి.

ఇప్పుడు అదేవిధంగా రాయడానికి కార్తీక్‌కు మనసొప్పలేదు. ఆ విధంగా రాస్తే ఆ మూసలో కొట్టుకుపోవడమే.

ఒక నెలరోజుల మనోమథనం తర్వాత అతని ఆలోచనలు ఒక కొలిక్కి వచ్చాయి. అది కూడా చాలా కాజువల్‌గా జరిగింది. ఓ ఇంగ్లీషు నవల చదువుతుండగా సడన్‌గా వచ్చిందా ఆలోచన.

ఒక పల్లెటూరి యువకుడు దగ్గరి బంధువుల కుట్రతో జైలుకు వెళ్ళాడు. భార్యను పోగొట్టుకుంటాడు. అన్నివిధాలా నిస్పృహాయుడైన ఆ యువకుడు తోటి ఖైదీవల్ల

ఎన్నో విద్యలు నేర్చుకుంటాడు. చివరకు తన పగ తీర్చుకుంటాడు.

ఇంగ్లీషు నవలనుండి ప్లాట్ మాత్రమే తీసుకుని, అందులోని సన్నివేశాలు ఏమాత్రం పడకుండా రాయడం మొదలుపె ట్టాడు. అతనికి మంచి శైలి వుంది. సొంత శైలిలేని వ్యక్తి ఈ రంగంలో నిలబడడం అసాధ్యం.

తాతగారి దయవలన అతనికి మంచి భాషాపటిమ వుంది. పూర్తి వ్యవహారికం లోనూ కాకుండా పూర్తి గ్రాంధికంలోనూ కాకుండా రాయసాగాడు. పట్టుచీరపై జరీ పూలద్దినట్టు మధ్యమధ్య చక్కటి వర్ణనలతో చక్కగా రాసాడు.

దానికి 'చేతవెన్నముద్ద' అని పేరు పెట్టాడు. ఇక అక్కడినుండి ప్రతీ పత్రికాఫీస్కు, పబ్లిషర్ దగ్గరకు తిరగసాగాడు. ఇటువంటివి ఈ కాలంలో ఎవ్వరూ రాయడం లేదని కొందరు, ఆడపేరుతో రాస్తేనే ప్రచురిస్తామని కొందరు అతడిని నిరుత్సాహపర్చారు.

పార్వతి ప్రోత్సాహంతో ఓ పబ్లిషర్కు నవల సినాప్సిస్ జతచేస్తూ ఉత్తరం రాశాడు. పదిరోజులలో నవల తీసుకురమ్మని ఉత్తరం వచ్చింది. ఆ పబ్లిషర్ కూడా రచయితే. కలంపేరుతో ఎన్నో నవలలు రాసాడు. రచయిత కనుకనే తోటి రచయితకు సాయం చేస్తున్నాడు అనుకున్నాడు కార్తీక్!

కార్తీక్కు ఓ సమస్య ఎదురయ్యింది. అది కర్నూలు వెళ్ళడం. అక్కడినుండి కర్నూలు చాలాదూరం. చార్జి ఎక్కువే వుంటుంది. అతని దగ్గర నయాపైసాలేదు. తను పని చేస్తున్న షాపు యజమానిని అడిగి చూశాడు. అది సీజనుకాదు కాబట్టి ఆయన పెదవి విరిచాడు.

నరేష్ కూడా చాలాచోట్ల ప్రయత్నించాడు. ఎక్కడెక్కడో తిరిగాడు. కానీ ఎక్కడాపనిజరగలేదు. ఇక ఆశ వదులుకుంటున్న సమయంలో పార్వతి తన మెడలో గొలుసు తీసి ఇచ్చింది.

మొదట కార్తీక్ అది తీసుకోవడానికి ఒప్పుకోలేదు. పార్వతి చాలా బతిమిలాడింది. నరేష్ కూడా ప్రస్తుతం ఈ అవసరం తీరితే ఆ తర్వాత విడిపించి ఇవ్వవచ్చునని సలహా ఇచ్చాడు. కార్తీక్కు కూడా అది నిజమేనన్పించింది. నవలకు ఎంతో కొంత పారితోషికం రాకపోదు. ఆ డబ్బుతో గొలుసు విడిపించి ఇవ్వవచ్చు మనస్సు రాయి చేసుకుని ఆమెవద్దనుండి గొలుసు తీసుకున్నాడు.

ఆ మర్నాడే ఎన్నో ఆశలతో, ఎన్నెన్నో ఊహలతో తన స్వర్ణ స్వప్నం నిజం చేసుకోవడానికి కర్నూలు బయలుదేరాడు.



ఒకరాత్రి మొత్తం ప్రయాణంలో గడిచిపోయింది. ఆ తర్వాతిరోజు పదిగంటలవుతుండగా కర్నూలు బస్టాండ్లో దిగాడు కార్తీక్. రాయలసీమ ప్రాంతం అతనికి పూర్తిగా కొత్త. అది చాలా పెద్ద బస్టాండ్. ఒక పక్కగా వున్న బాత్రూమ్స్వైపు వెళ్ళి కాలకృత్యాలు తీర్చుకున్నాడు. ఆ పక్కనే వున్న రెస్టారెంట్లో టిఫిన్ చేశాడు.

ఆ తర్వాత అడ్రస్ వెదుక్కుంటూ వెళ్ళాడు. ఎక్కడో దూరంగా ఒక మేడ పైభాగంలో వుందా పబ్లిషర్ ఆఫీస్. దాని కింద భోజన హోటల్ వుంది. రెండుబోర్డులు పక్కనే వుండడంవల్ల ఏది ఎక్కడో అతనికి అర్థంకాలేదు.

హోటల్ లోపలకు వెళ్ళి కౌంటర్లో కూర్చున్న వ్యక్తిని అడిగాడు. ఒకపక్కగా వున్న చెక్కమెట్లు చూపించాడతను. పైకి వెళ్ళాడు కార్తీక్.

అది ఒక చిన్నగది. అందులో ఒక ఐరన్ టేబుల్ దానిచుట్టూ నాలుగు కుర్చీలు వేసి వున్నాయి. టేబుల్పై ఆ పబ్లిషర్ ప్రచురించిన పుస్తకాలు పేర్చి వున్నాయి.




ఆ టేబుల్ వెనుక కుర్చీలో ఒక భారీకాయుడు కూర్చుని వున్నాడు. ఏదో బిజీగా రాసేసుకుంటున్నాడు. వెనక్కి దువ్విన జుట్టు పెద్ద గడ్డిమేటలా వుంది. నల్లగా కుర్చీకి సరిపడా వున్నాడు. కారాకిళ్ళీ కాబోలు కసాపిసా నములుతున్నాడు.

"నమస్తే సార్" లోపలికి వెళుతూ విష్ చేశాడు కార్తీక్.

"నమస్తే... నమస్తే" ప్రశ్నార్ధకంగా చూస్తూ అన్నాడతను.

"నాపేరు కార్తీక్. మీకు నవల సినాప్సిస్ పంపాను. మీరు నన్ను ఈరోజు రమ్మని రాశారు" ఆయన తనకు రాసిన ఉత్తరం చూపించాడు.

"ఓ... మీరే రచయిత కార్తీక్ అన్న మాట. వెరీగుడ్. నవల తెచ్చారా? "

"తెచ్చానండి" సంచిలో నుండి తీస్తూ చెప్పాడు.

"మిస్టర్ కార్తీక్ మీకో విషయం చెప్పాలి. మాది చాలా చిన్న పబ్లికేషన్. అందువలన కొత్తవాళ్ళ నవలలు వేసుకుని రిస్క్ తీసుకోవడం కష్టం" చెప్పబోయేదానికి ఉపోద్ఘాతంలా అన్నాడతను.

కార్తీక్ గుండెలు దడదడలాడాయి. ఇంత కష్టపడి ఇంతదూరం వచ్చాక చుక్కెదురయ్యింది.

"అయినా నేను మిమ్మల్ని ప్రోత్సహించదలచాను. అదయినా మీ కథలు చదివి మీలో ప్రతిభను గుర్తించడం వల్లే మీకో అవకాశం ఇవ్వదలిచాను. కానీ పూర్తి బాధ్యత నేనే తీసుకోవడం కష్టం. మీ పుస్తకం రెండువేల కాపీలు వేస్తాను. మీకు తెలియంది ఏముంది? ప్రస్తుతం నవలలకు మార్కెట్ లేదు. ఎంతో పేరున్న మా వంటి వాళ్ళం రాసిన నవలలే మార్కెట్ కావడం లేదు. మీ నవల పబ్లిష్ చెయ్యడానికి అయిన ఖర్చులో సగం మీరు పెట్టుకోండి. మిగిలిన సగం నేనుపెట్టుకుంటాను"

ఒక్కసారిగా నిరాశానిస్పృహలు అతడిని చుట్టుముట్టాయి. అంత డబ్బు తాను పెట్టుకోలేడు. ఇక ఆశ వదలుకోవడం మంచిది.

కార్తీక్ మనస్సులో భావాలు ముఖంలో కనిపించినట్లున్నాయి.

ఒక్కక్షణం ఆగి అతనే చెప్పాడు.

"అప్పుడే అలా డీలాపడిపోతే ఎలాగండి? "

"మీరు వెళ్ళి ఆలోచించి చెప్పండి. ఈలోగా ఆ స్క్రిప్ట్ నాకిచ్చారంటే సరిచేస్తాను. టైటిల్ మారుస్తాను"

"సారీ సార్. ఇదంతా వృధా తతంగం. నా దగ్గర అంత డబ్బులేదు. ఇక స్క్రిప్ట్ మీకిచ్చి ప్రయోజనమేమిటి? నేను వెళ్ళివస్తాను" లేచి నిలబడుతూ చెప్పాడు కార్తీక్.

"అరె అలా •కంగారుపడతారేమిటి? కూర్చోండి. ఒక విషయం చెబుతాను. వినండి. మీ అంతట మీరు ఆ నవల ప్రింటు చేయించలేరు. ఏ పత్రికవాళ్ళూ అది స్వీకరించడంలేదు. కాబట్టి ఒక పనిచెయ్యండి"

వింటున్నాడా లేదా అన్నట్లు ఒక్కక్షణం ఆగాడు. టేబుల్ పై గాజుగ్లాసులో వున్న మంచినీళ్ళు తాగాడు. ఆ తర్వాత చెప్పాడు. "మీకు కొంత డబ్బు ఇస్తాను. తీసుకుని ఆ నవల నాకిచ్చెయ్యండి. నా పేరుపైన ప్రచురించుకుంటాను. ఏమంటారు? "

కప్పల రాజ్యాన్ని బలవంతంగా ఆక్రమించుకున్న పాములా, నిస్సహాయంగా పడి వున్న ఎరను చూసిన దుమ్ములగొండిలా నవ్వాడతను.

కార్తీక్‌కు అతనిపై అసహ్యం వేసింది. చటుక్కున లేచి బయటకు వచ్చేశాడు. ఘోస్ట్ రైటర్‌గా మారమని సలహా ఇస్తున్నాడు. ఇతడు రాసినట్లుగా చెప్పబడే నవలలన్నీ నిజంగా ఇతను రాసి వుండడు. ప్రపంచంలో అందరూ తనను చూసి పరిహసించేవాళ్ళే.

కార్తీక్‌కు జీవితం చీకటిమయంగా అనిపించింది. చిన్నతనంలో ఇంట్లోంచి పారి



పోయి వచ్చినప్పుడు కూడా భయంవేసింది. కానీ ఇంత నిరాశగా భవిష్యత్తే లేనట్లుగా అనిపించలేదు.

గమ్యం లేకుండా ఊరంతా తిరగడం మొదలుపెట్టాడు. ఇంటికి ఏ ముఖం పెట్టుకుని వెళ్లాలో తెలీడంలేదు. ఎలాగైనా నవల పబ్లిష్ అవుతుందని ధీమాగా వచ్చాడు. అన్యాయంగా పార్వతి గొలుసు తీసుకున్నాడు. ఇప్పుడు దానిని తిరిగి ఇచ్చేదెలాగ?

మనసు పరిపరివిధాలుగా పోతోంది. ఏమీ తినబుద్ధికాలేదు. తిరిగి బస్టాండ్‌కు వచ్చి ఒక సిమెంట్ బెంచీపై కూర్చున్నాడు.

"హల్లో కార్తీ. వచ్చిన పని ఏమయింది?" ఎవరిదో పరిచితమైన కంఠం వినబడింది. ఉలిక్కిపడి అటుచూశాడు.

వీరభద్రం నిలబడివున్నాడు.

ఎందుకో తెలీదుగానీ అప్పుడు అక్కడ వీరభద్రాన్ని చూడటం చాలా ఆనందాన్ని కలుగచేసింది.

"ఏమిటి? అలా దిగులుగా వున్నావేం?"

"ఏమీలేదు. మీరేమిటి ఇలా వచ్చారు?"

"చిన్నపని వుండి నిన్ననే వచ్చాను. నిన్న సాయంత్రం మీ ఇంటికి వచ్చాను. అప్పటికే నీవు బయలుదేరావట. నరేష్ మొత్తం చెప్పాడు. నీకు డబ్బు కావలసివస్తే నా దగ్గరకు రావచ్చుకదా?"

కార్తీక్ మాట్లాడలేదు. తనే మళ్ళీ చెప్పాడు.

"నన్ను నీ స్నేహితుడిగా భావించడంలేదన్నమాట?"

"అదికాదు. అంతా హడావిడి అయిపోయింది" తడబడ్డాడు.

"నవల తీసుకున్నాడా?"

జరిగినదంతా వివరంగా చెప్పాడు కార్తీక్.

"వాడి సంగతి నాకు బాగా తెలుసు. నీవు బయలుదేరకముందే నాకు చెప్పివుంటే వద్దనేవాడిని. ఇప్పుడు ఒక పనిచేద్దామా? విజయవాడ వెడదాం. నిన్ను ఒక ఎడిటర్ దగ్గరకు తీసుకెడతాను. ఆయనకు నీలాంటి వాళ్ళను ప్రోత్సహించే గుణం వుంది. నీ స్క్రిప్ట్ ఆయనకు చూపించు. నచ్చితే సీరియల్‌గా వేసుకుంటాడు"

ఫౌంటెన్‌లో నుండి నీళ్ళు ఒక్కసారిగా పైకి ఎగజిమ్మినట్లు కార్తీక్‌లో ఆనందం రివ్వున ఎగజిమ్మింది.

అప్పుడే విజయవాడ బయలుదేరారు. విజయవాడ చేరేలోగా బస్సులోనే నవల మొత్తం చదివేశాడు వీరభద్రం.

ఆ నవల అతనికే కాక ఆ ఎడిటర్‌కు కూడ నచ్చింది. కాకపోతే చిన్నచిన్న మార్పులు చేశాడు. సంతోషంగా ఒప్పుకున్నాడు కార్తీక్. "నీలో మంచి రచయిత వున్నాడు కార్తీ. వాడికి ఊపిరిపోసి వృద్ధి చెయ్యి. మనవల్ల సమాజానికి మేలు జరగకపోయినా ఫర్వాలేదు. కీడు మాత్రం జరగకూడదు" బయటకు వచ్చాక చెప్పాడు వీరభద్రం.

ఆ తర్వాత జేబులోనుండి ఐదు వంద నోట్లు తీసి కార్తీక్ చేతిలో పెట్టాడు.

"అమ్మాయి గొలుసు విడిపించు. నవలకు పారితోషికం వచ్చాక నా అప్పు తీరుద్దువుగానిలే"

కార్తీక్ కళ్లలో నీళ్ళు తిరిగాయి. ఏదో చెప్పబోయాడు.

"ఇంక మాట్లాడకు. నేను నీ స్నేహితుడిని. నీకు సహాయం చెయ్యడం నా ధర్మం" భుజం తట్టి చెప్పాడు.

ప్రతీమనిషిలోనూ మంచీచెడూ వుంటాయి. మంచిపాళ్ళు ఎక్కువ వున్న మనిషిని మాత్రమే దేవుడంటాం.

కార్తీక్‌కు ఆ క్షణంలో వీరభద్రం దేవుడిలానే కనిపించాడు.

★ ★ ★

ఒకరోజు షాపులో కూర్చుని ఎకౌంట్స్ చూసుకుంటున్నాడు కార్తీక్. ఆరోజు బేరాలు లేకపోవడంతో ఖాళీగా వున్నాడు.

అప్పుడు వచ్చింది పార్వతి.

"హల్లో కార్తీ! ఏమిటి బిజీగా వున్నారు.




ఏదైనా కథ రాస్తున్నారా? " అడిగింది.

"ఒకటే కథ. ఇదిగో చూస్తున్నావుగా. ఈ లెక్కలు తెమిలేదాకా కథలు, కాకరకాయలు జాన్తానై"

"సరే నీకొక గుడ్‌న్యూస్ చెప్పనా? "

"చెప్పు"

"ఈరోజు నాకు పెళ్ళిచూపులు" అతని కళ్ళలోకి పరీక్షగా చూస్తూ చెప్పింది.

"కంగ్రాచ్యులేషన్స్"

పార్వతి ముఖం ఒక్కసారిగా వాడిపోయింది. తల దించుకుని మెల్లిగా అంది, "నీకేరకమైన బాధా లేదా కార్తీ"

"ఎందుకు? " అయోమయంగా అడిగాడు.

ఒక్కనిముషం ఏదో ఆలోచనలో వున్నట్టు ఆగి తర్వాత చెప్పింది.

"ఆడపిల్లనయినా సిగ్గువిడిచి నేనే చెబుతాను. నువ్వంటే నాకు చాలా ఇష్టం. నిన్ను తప్ప మరొకరిని నా భర్తగా ఊహించలేను. ఇలా చెప్పానని మరోలా భావించకు. వచ్చి మా నాన్నగారితో మాట్లాడు"

అతికష్టంపై చెప్పినట్లు ఆ మాటలు చెప్పి అక్కడినుంచి వెళ్ళిపోయింది.

కార్తీక్ నివ్వెరపోయాడు. అతని మనసు నిండా సరోజ నిండివుంది. అనవసరంగా పార్వతిలో ఆశలు రేపానా అనుకున్నాడు.

ఆరోజు సాయంత్రం సరోజను కలిసినప్పుడు ఈ విషయం చెప్పి పార్వతికి తమ ప్రేమ విషయం చెప్పమన్నాడు.

"పోనీ నీవు పార్వతిని చేసుకోవచ్చుకదా" అంతా విన్నాక సరోజ చెప్పింది.

"డోంట్ బీ సిల్లీ. పార్వతిని చేసుకుంటే నీ గతేమిటి? "

"సారీ కార్తీ! నీవు మన ఇద్దరి స్నేహాన్ని అపార్థం చేసుకున్నావు. నా పెళ్ళి మా బావతో ఎపుడో నిశ్చయమైపోయింది. ఆయన ఫారిన్‌లో వున్నారు"

"మరి నాతో సినిమాలు, షికార్లు..."

అప్పటికే కార్తీక్ ముఖం కోపంతో జేవురించింది. సరోజ ఏం చెప్పదలిచిందో అతనికి అర్థమైంది.

"స్నేహితులతో సినిమాలకువెళ్ళడం తప్పా? అయినా కేవలం సినిమాలకు వెళ్ళినంతమాత్రాన పెళ్ళివరకు ఎలా ఆలోచించావు? "

"నీవు బజారుమనిషిలా సరసాలు ఒకరితో, పెళ్ళి వేరొకరితోనూ అంటావని తెలీక అలా ఊహించుకున్నాన్లే" కసిగా చెప్పాడు.

ఠక్కున లేచి నిలబడింది సరోజ. ఆమె ముఖంలో కోపం మచ్చుకైనా లేదు. తాపీగా ఒక్కొక్కమాట చెప్పడం మొదలుపెట్టింది.

"నన్ను బజారుమనిషి అన్నావు బాగానే వుంది. మరి నీ మాటేమిటి? కేవలం డబ్బు కోసం నన్ను పెళ్ళి చేసుకుందామనుకున్నావు. అంతేకదా? నిన్ను నేను ఏం చూసి పెళ్ళి చేసుకోవాలి. బాగా చదువుకున్నవాడివనా? బాగా డబ్బున్నవాడివనా? పోనీ పెద్ద పబ్లిక్ ఫిగర్‌వా? నాలుగు కథలు రాసినంత మాత్రాన గొప్పవాడినైపోయాననుకుంటున్నావా? నీవు కేవలం ఓ చిన్న గుమస్తావి. చాలా సామాన్యుడివి. అది నీకు కూడా తెలుసు. అందుకే నా కాళ్ళు పట్టుకుని పైకి వద్దామనుకున్నావు. నీవు నీకంటె పైకి చూసినట్లే నేను నాకంటే పైకి చూడటం సహజంకదా? ఈమాత్రం దానికి నోరు పారేసుకోవడం దేనికి? "

ముళ్ళతొడుగుతో ముఖంపైన కొట్టినట్లు ఉలిక్కిపడ్డాడు కార్తీక్. అవమానంతో కుంచించుకుపోయాడు. మరొక్కమాట మాట్లాడకుండా అక్కడినుండి లేచివచ్చేశాడు.

ఇంటికి ఎలా వచ్చాడో అతనికే తెలియలేదు. కార్తీక్ మనస్సులో ఆలోచనలు కడలి తరంగాల్లా ఎగిసిపడుతున్నాయి. సరోజ అతన్ని ఎక్కడ కొట్టాలో అక్కడే కొట్టింది.

అలా ఎంతసేపు కూర్చున్నాడో అతనికీ తెలీదు. నరేష్ వచ్చి గది చీకటిగా వుండటం చూసి లైటు వేశాడు.

"అలా వున్నావేం కార్తీ? " ఆందోళనగా



అడిగాడు.

తలపైకెత్తి అతని ముఖంలోనికి చూశాడు కార్తీక్. ఎదురుగా తన ప్రాణస్నేహితుడు. చిన్నప్పటినుండి కష్టం, సుఖం తనతో పంచుకున్న ఆప్తమిత్రుడు.

జరిగినదంతా వివరంగా చెప్పాడు.

"చూడు కార్తీ... నువ్వు మేధావివి. నీకు నేను చెప్పనవసరంలేదు. అయినా ఒక ప్రశ్న అడుగుతాను. సమాధానం చెప్పు"

కార్తీక్ మవునంగా ఉన్నాడు.

"నీ జీవితాశయం ఏమిటి కార్తీ? "

"పెద్ద రచయిత కావడం" చెప్పాడు కార్తీక్.

"ఇప్పుడు ఇంకో ప్రశ్న అడుగుతాను. జవాబు చెప్పు. చేపలు పట్టడానికి వెళ్ళేవాడికి ఏం కావాలి? "

"వల లేదా గాలం"

"మరి పిల్లలకు పాఠాలు చెప్పాలనుకునే వాడికి? "

"పుస్తకాలు"

"వలతో చదువు చెప్పడం, పుస్తకాలతో చేపలు పట్టడం కుదురుతుందా? "

"లేదు"

"సరిగ్గా అలాగే పెద్ద రచయిత కావాలనుకునేవాడికి ఆ రంగంతో అవినాభావ సంబంధం వున్న అమ్మాయి కావాలిగాని, సరోజవంటి అభిరుచి లేని అమ్మాయి కాదు, అవునా? "

"అవును" హీనస్వరంతో చెప్పాడు కార్తీక్.

"నీకు కావలసిన మనిషిగా ఒక సలహా ఇస్తాను, విను. పార్వతిని పెళ్ళి చేసుకో నీ జీవితం పచ్చగా వుంటుంది"

నరేష్ మాటలు విన్నాక కార్తీక్‌కు తనకు కావలసిందేమిటో తెలిసివచ్చింది. ఒక వర్షపు చినుకు ఇసుకనేలపై పడితే ఇంకిపోతుంది. తామరాకుపై పడితే ముత్యంలా అనిపిస్తుంది. అదే చినుకు ముత్యపుచిప్పలో పడితే మంచి ముత్యమవుతుంది. సరియైన వస్తువుకు సరియైన స్థానం అందాన్నిస్తుంది.

పార్వతిని పెళ్ళి చేసుకోవడానికే నిశ్చయించుకున్నాడు కార్తీక్. భవిష్యత్తులో అతని బంగారు కల నిజం చేసుకోవడానికి వ్యాసుడికి గణపతిలా, తిక్కనకు గురునాధుడిలా ఆమె కార్తీక్‌కు చాలా సహాయపడుతుంది.

★ ★ ★

హిందీ సాంగ్ హమ్‌చేస్తూ బాత్‌రూమ్ నుండి బయటకు వచ్చింది స్వప్న. ఆమె వంటిపై టవల్ మాత్రమే వుంది. ఆమె ఎత్తయిన పరువాలు సగంవరకు బయటకు కనిపిస్తున్నాయి.

గదిలోనికి రాగానే వంటిపైనున్న టవల్ తీసి స్టాండ్‌పైకి విసిరేసింది. పఫ్‌తో శాండిల్ పౌడర్ శరీరం అంతా రాసుకుంది. ఆమెకు శాండిల్ వాసన చాలా ఇష్టం. స్నోతోసహా అన్నీ శాండిల్‌వే కొంటుంది.

బీరువాలోనుండి పాంటీ తీసుకుని తొడుక్కుంది. తర్వాత అదే కలర్ బ్రా!

బీరువాలోనుండి వైలెట్ కలర్ చీర తీసి కట్టుకుంది. చెవులకు మ్యాచింగ్ కమ్మలు పెట్టుకుంది. మేకప్ పూర్తికాకుండానే నరేష్ ఆ గదిలోకి వచ్చాడు. నరేష్‌కు స్వప్న ఇంట్లో తిరిగే స్వతంత్రం ఉంది. సినిమా హాల్లో పనితోపాటు ఇంటికి కావలిసిన వస్తువులు కూడా తెచ్చిపెడుతుంటాడు.

స్వప్నను చూడగానే కన్నుగీటాడు. టేబుల్ వైపున్న పౌడర్ డబ్బా అతనివైపు విసిరింది స్వప్న. తలవంచి దానిని తప్పుకుని ముందుకు వచ్చాడు నరేష్. స్వప్నను తన కౌగిలిలోకి తీసుకున్నాడు. ఆమె ఎద ఎత్తులు అతని చాతికి గుచ్చుకుంటున్నాయి. గులాబి రేకుల్లా వున్న ఆమె పెదవులపై తన పెదవులుంచి ముద్ర వేశాడు. స్వప్న బుగ్గలు ఎర్రబడ్డాయి. కళ్ళలో ఏవో మెరుపులు.

సరిగ్గా అప్పుడే స్వప్న తల్లి ఆ గదిలోనికి వచ్చింది. వీళ్ళిద్దరిని అలా చూడగానే బిగిసి




పోయింది.

★ ★ ★

ఆ తర్వాత చాలా గొడవ జరిగింది. నరేష్‌పై రెండుసార్లు హత్యాప్రయత్నం జరిగింది. ఒకరోజు స్వప్న ఇంటినుండి పారిపోయి నరేష్ దగ్గరకు వచ్చేసింది.

కార్తీక్‌కు ఏం చెయ్యాలో తెలీలేదు. బాగా ఆలోచించి వాళ్ళను తీసుకుని అక్కడికి దూరంగా వున్న ఒక గ్రామానికి బయలుదేరాడు. ఆ గ్రామంలో నరేష్ దూరపు బంధువులు వున్నారు. అక్కడికి ప్రయాణం కూడా కష్టమే. ముందు రైలు ప్రయాణం. తర్వాత బస్సు. ఆ తర్వాత గుర్రపుబండి. దారంతా వాళ్ళు భయపడుతూనే వున్నారు.

జట్కాబండి తోలే వ్యక్తి పేరు శంకరం. తాతముత్తాతల నుండి గుర్రపుబండి తోలడమే వాళ్ళ జీవనాధారమంట.

"ఎవరింటికండి? అడిగాడతను.

"గోవిందంగారి ఇంటికి" చెప్పింది స్వప్న.

"గోవిందంగారు చాలా మంచారండి. దాదాపు పాతికేళ్ళక్రితం వాళ్ళు ఈ ఊరు వచ్చారు. ఇక్కడే చిన్న హోటల్ తెరిచారు. ఇక్కడే స్థిరపడిపోయారు. గోవిందంగారి భార్య చనిపోయినప్పుడు ఊరు ఊరంతా కదలి వచ్చిందంటేనే ఆలోచించండి. ఆయనంటే ఇక్కడి వాళ్ళకు ఎంత ఇష్టమో? "

గుర్రం పరుగుపెడుతోంది. అంతకంటే వేగంగా కార్తీక్‌లో ఆలోచనలు పరిగెడుతున్నాయి.

"భార్య చనిపోయాక గోవిందంగారు మళ్ళీ పెళ్లి చేసుకోలేదండి. కూతురుపైనే ప్రాణాలు పెట్టుకుని బతుకుతున్నాడు"

ఒక యువకుడు వాళ్ళ జట్కాకు అడ్డం వచ్చాడు. శంకరం తన చేతిలోని చెర్నాకోలాతో అతడిని గట్టిగా కొట్టాడు. ఆ తర్వాత కార్తీక్‌వైపు తిరిగి చెప్పాడు.

"వెధవలుబాబు... చిటికెడు గంజాయి ఇస్తే కన్నతల్లి పీక కొయ్యమన్నా కోసేస్తారు"

"ఇంత పల్లెటూరిలో గంజాయి ఎక్కడ దొరుకుతుంది? " ఆశ్చర్యంగా అడిగాడు కార్తీక్.

"ఈ ఊరు సముద్రానికి దగ్గరగా వుంది. పైగా రోడ్డు, కరెంటు సదుపాయాలు లేవు. అందువల్ల పోలీసులు ఇక్కడికి ఎప్పుడోగాని రారు. ఇక్కడి రైతులు పొలాలలో గంజాయి మొక్కలు పెంచుతారు. సముద్రం దగ్గరవడంవల్ల స్మగ్లర్లకు రవాణా తేలిక. మా ఊరివాళ్ళకు దీనివల్ల సమస్యేమంటే ఎక్కడెక్కడినుండో కుర్రవాళ్ళు ఈ ఊరు వచ్చి ఇక్కడి ప్రశాంతత పాడుచేస్తున్నారు"

గోవిందంగారి హోటల్ రావడంతో మాటలు ఆపుచేశాడు. నరేష్ ముందు అతని వెనుకే మిగిలినవాళ్ళు లోపలకు వెళ్ళారు.

గోవిందం చాలా పొట్టి మనిషి. కాని లావుగా, పెద్దపెద్ద మీసాలతో ఫన్నీగా వుంటాడు. ఆయన కూతురి పేరు రేఖ. నరేష్‌ను చూసి వాళ్ళు సంతోషించారు. ముఖ్యంగా రేఖ స్వప్నతో క్షణాలలో కలిసిపోయింది.

గోవిందంగారి హోటల్ బిజినెస్ అంతా పొద్దుట పదకొండు గంటలలోపే అయిపోతుంది. ఊళ్లో ప్రజలలో ఎక్కువమంది వ్యవసాయ కూలీలు. వాళ్ళు పొలాలకు వెళ్ళేలోగా ఈ హోటల్‌కు వచ్చి టిఫిన్ చేసి లేదా భోజనం చేసి వెళ్ళిపోతారు. డబ్బు కొంతమంది వెంటనే ఇచ్చేస్తారు, మరికొందరు సాయంత్రం ఇస్తుంటారు.

అప్పుడప్పుడు కొంతమంది కొత్తవాళ్ళు వస్తుంటారు. వాళ్ళకు గదులు కూడా అద్దెకు దొరుకుతాయి. వాళ్ళంతా స్మగ్లర్లని, వ్యాపారం కొరకు వస్తారని గోవిందంగారికి తెలుసు. కాని ఆయన వ్యాపారం సగం వాళ్ళపైనే ఆధారపడివుంటుంది.

నరేష్‌కు, స్వప్నకు ఘనంగా పెళ్లి జరిగిపోయింది. కార్తీక్ వాళ్ళతో నాలుగురోజులు

సరదాగా గడిపాడు. రేఖ కార్తీక్‌ను అన్నయ్యా అని పిలిచేది. అక్కడ అందరూ మధ్యాహ్నంనుండి రాత్రివరకు కలిసి కూర్చుని మాట్లాడుకునేవాళ్ళు. మగవాళ్ళు చదరంగం బోర్డు ముందు పెట్టుకుని ఆడుకునేవారు.

ఒకరోజు అలా కూర్చుని ఆడుకుంటుండగా ఒకవ్యక్తి సుడిగాలిలా హోటల్‌లోకి దూసుకువచ్చాడు. అతని కుడికంటికి కొద్దిగా పక్కగా కత్తితో చీరిన గుర్తుంది. దాని నుండి రక్తం ధారగా కారుతూ అతని చెంపలను తడుపుతోంది. మనిషి భయంతో వణికిపోతున్నాడు.

"వాళ్ళు నన్ను తరుముతున్నారు. కనబడితే చంపేస్తారు" వీధివైపు వేలితో చూపిస్తూ చెప్పాడు.

అతని కళ్ళలో భీతిని చూడగానే గోవిందంగారు కుర్చీలోనుండి లేచి అతనివైపు నడిచారు. ఆ వ్యక్తి చెయ్యిపట్టుకుని తీసుకువెళ్ళి వంటగదిలోనికి తోశారు.

"అక్కడే ఉండు బయటకి రాకు"

ఆయన మాటలు పూర్తి కాకుండానే తలుపు దడదడలాడింది. నలుగురు కుర్రాళ్లు లోపలకు వచ్చారు. అందరూ టీనేజ్ వాళ్ళే. వారిలో కొద్దిగా లావుగా, ఎత్తుగా వున్న కుర్రాడి చేతిలో ఒక చిన్న కత్తి వుంది. బహుశ దానితోనే ఆ వ్యక్తిని గాయపరిచివుంటాడు.

"ఒరే ముసలిపీనుగా! నీ హోటల్‌లోకి ఒకడు పారిపోయి వచ్చాడు. వాడిని ఎక్కడ దాచావ్. నిజం చెప్పు" గద్దిస్తున్నట్టు అడిగాడు.

"నోరు మూసుకుని బయటకు పొండి. ఏ చెట్టుకిందో కూర్చుని గంజాయి తాగండి" గోవిందంగారు కూడా అదే స్వరంతో జవాబు చెప్పారు.

వాళ్ళ నలుగురి ముఖాలు ఎర్రబారిపోయాయి. అందులో ఒకడు ఒక కుర్చీ నేలకేసి కొట్టి విరిచేశాడు. మిగిలిన ముగ్గురూ రాబందుల్లా గోవిందంగారిని చుట్టుముట్టారు. కార్తీక్ ఆందోళనగా కుర్చీలో నుండి లేచాడు. కాని అతని అవసరం లేకపోయింది.

వాళ్లను ఆయన ఒంటిచేత్తో విదిలించేశారు. ఆయన కొట్టిన దెబ్బకు ఒకడి ముందుపళ్లు రాలిపోయాయి. మరొకడికి మోచెయ్యి దగ్గర జాయింట్ తప్పుకుంది. వాళ్లు కాళ్లు, చేతులు కట్టేసిన మేకల్లా అరిచారు. మిగిలినవాళ్ళు మోకాళ్లపై కూర్చుని చేతులు జోడించారు.

"పొండి" అరిచారు గోవిందంగారు. "ఈ చుట్టుపక్కల మళ్ళీ కనపడ్డానికి వీల్లేదు" ఒక్కక్షణంలో మాయమయ్యారు వాళ్లు.

"ఇక్కడ ఇటువంటివి మామూలే. గంజాయిగాని, నల్లమందుగాని తీసుకుంటే వాళ్ళు రాక్షసులతో సమానం. లేకపోతే కుక్కపిల్లను కూడా వాళ్లు తరమలేరు" వెనక్కు తిరిగి చూసి నవ్వుతూ చెప్పారు గోవిందంగారు.

వంటగదిలో దాక్కున్న మనిషి కృతజ్ఞతలు చెప్పుకుని వెళ్ళిపోయాడు. మరో రెండు రోజుల తర్వాత కార్తీక్ వెనక్కు వచ్చేశాడు. నరేష్, స్వప్న అక్కడే వుండిపోయారు.



ఆయనకు యాభై సంవత్సరాలు ఉంటాయి. వయస్సు మహిమ శరీరంపై కనబడుతోంది. బట్టతల, ముఖంపై ముడుతలు, కళ్లకింద నలుపు. కాని డబ్బు తెచ్చిన ఏదో దర్పం ఆయన కళ్లలో కనబడుతోంది.

"నా కూతురు ఎక్కడ? " గంభీరంగా వుంది ఆయన కంఠం.

ఆశ్చర్యంగా చూశాడు కార్తీక్. ఆయన స్వప్న తండ్రి అని అతనికి తెలుసు. కాని తన ఇల్లు వెదుక్కుంటూ ఆయన వస్తాడని మాత్రం ఊహించలేదు. ఇప్పుడు తన కూతురు అంటున్న ఈ పెద్దమనిషే నాలు




గురోజుల కిందట అల్లుడిని చంపించి కూతురి మనస్సు మార్చేయాలనుకున్నాడు.

ఇక ఇప్పుడు తన చేతిలో ఏమీలేదని తెలుసుకుని కాళ్ళ బేరానికి వచ్చాడు.

అతని మనస్సులోని భావాలు చదివినట్లు చెప్పాడాయన.

"నీకు భయపడో, ఏమీచేతకాకో రాజీకొచ్చాననుకుంటున్నావా? నా కూతురికోసం వచ్చాను. ఆ మాటకొస్తే నా దగ్గర డబ్బుంది. ఆ డబ్బుతో కొండపైని కోతిని కూడా దించగలను"

"కోతులను దింపొచ్చు సార్. కానీ మీ డబ్బు చూసి ఆడే కోతులు ఇక్కడ లేవు"

"ఏం ఛాలెంజ్ చేస్తున్నావా? అయినా నీతో నాకు మాటలేమిటి? నా కూతురు ఎక్కడ వుంది? " గొంతు హెచ్చించి అడిగాడాయన.

ఆ సరికి కార్తీక్‌కు కూడా ఉక్రోషం వచ్చేసింది. అతను కూడా గొంతు పెంచాడు.

"మీ వద్ద బోలెడు డబ్బు వుంది కదా? ఆ డబ్బు సాయంతో తెలుసుకోండి"

"నన్ను మరీ చేతకాని వాడిలా జమకట్టకు. నేను తల్చుకుంటే క్షణాలలో మిమ్మల్నిద్దరినీ అష్టకష్టాలపాలు చేయగలను"

"మీరేమి చెయ్యలేరు. స్వప్న మేజర్. తన ఇష్టమైనవాడిని పెళ్ళి చేసుకునే హక్కు ఆమెకు వుంది"

ఆయన నవ్వాడు. నిశ్శబ్దంగా నవ్వాడు. ఒక నవ్వులో అంత పైశాచికత్వాన్ని కార్తీక్ ఎప్పుడూ చూడలేదు.

"ఏదైనా చెయ్యగలను యంగ్‌మాన్. ఉదాహరణకు ఒకటి చెబుతాను విను. నా కూతురు పిచ్చిదనీ, ఆ పిచ్చిదాన్ని కిడ్నాప్ చేసి ఎత్తుకుపోయి రేప్ చేశారనీ కేసు పెడతాను. నా డబ్బుతో డాక్టర్లని, లాయర్లని, పోలీసులను కొనేస్తాను. అప్పుడు నీ గతి నీ స్నేహితుని గతి ఏమవుతుందో ఆలోచించు"

బిత్తరపోయాడు కార్తీక్. వచ్చిన మనిషి ఎంత కర్కోటకుడో అర్థమయింది.

ఒక్కక్షణం ఆగి తిరిగి ఆయనే చెప్పసాగాడు.

"కాని నేనొక తండ్రిని. చిన్నతనం నుండి దానిని ఎంతో గారాబంగా పెంచాను. మొదట్లో అది చేసిన పనికి చాలా కోపం వచ్చింది. అందుకే దానిని మందలించబోయాను. కాని నా భార్య దుఃఖం చూశాక నాలో కన్నపేగు మేల్కొంది. ఉన్న ఒక్కగానొక్క కూతుర్ని దూరం చేసుకోవడం అవివేకమనిపించింది. అందుకే వాళ్లను ఇంటికి తీసుకుపోదామని వచ్చాను"

కార్తీక్ ఏదో చెప్పబోయాడు. ఆయన చెయ్యెత్తి వారించాడు.

"నీవేమి చెప్పనక్కరలేదు. నా కూతురు ఎక్కడ వుందో నేనే తెలుసుకుంటాను. వాళ్లను వెనక్కు తెచ్చుకుంటాను" చెప్పాడు.

విసురుగా గుమ్మంవరకు వెళ్ళి ఆగి కార్తీక్‌వైపు తిరిగి చెప్పాడు.

"నిన్ను మాత్రం క్షమించను. నీవు నన్ను కాదు. డబ్బుని అవమానించావు. ఆ డబ్బుకున్న శక్తి ఎలాంటిదో నీకు రుచి చూపిస్తాను. నీ పొగరుబోతుతనానికి తగిన ప్రతిఫలం అనుభవిస్తావు"

కార్తీక్ అప్పుడు ఆ మాటలు లెక్కచెయ్యలేదు. ఆయనను చాలా తక్కువ అంచనా వేశాడు.



ఆ గది మల్లెపూలతో అలంకరించివుంది. గది గోడలకు గులాబిపూలు అంటించారు. డబుల్‌కాట్ మంచంపై స్వీట్ డ్రీమ్స్ అని రాసివుంది. ఏ.సి. నిర్విరామంగా పనిచేస్తుండటంతో గది అంతా చల్లగా వుంది. మంచం పక్కనే బల్లపై రకరకాల స్వీట్స్ పళ్ళాలలో పేర్చి వున్నాయి. ఆ పక్కనే వెలుగుతున్న అగరువత్తుల సువాసన మనస్సును ఎక్కడికో తీసుకుపోతోంది.

మంచంపై అసహనంగా కదిలాడతను.

అంతలోనే సర్దుకు కూర్చున్నాడు. ఈలోగా తలుపు తెరుచుకుని ఒక అద్భుత సౌందర్య రాశి లోపలికి వచ్చింది. ఆత్రంగా ముందుకు వెళ్ళాడు. ఆ అమ్మాయి తల వంచుకుని వుంది. చుబుకం పట్టుకుని పైకె త్తాడు.

"ఏమండీ, కూర్చునే నిద్రపోతున్నారా? "

ఛీ! అటువంటి అతకని డైలాగ్స్ చెబుతుం దేమిటి? అనుకుంటుండగా ఎవరో గట్టిగా కుదిపారు.

కార్తీక్‌కు మెలకువ వచ్చింది.

ఎదురుగా పార్వతి నవ్వుతూ నిల్చుంది.

తెల్లటి చీరలో దేవకన్యలా వుంది. అమృతం కోసం సాగరమథనం చేస్తుంటే బయటకు వచ్చిన లక్ష్మీదేవిలా వుంది.

అంటే ఇంతసేపూ తను కలగన్నాడన్న మాట. ఉలిక్కిపడి చుట్టూ చూశాడు కార్తీక్. అది శోభనం గది. ఒక నవారుమంచంపై ఇస్త్రీ దుప్పటి పరిచి వుంది. పక్కనే బల్లపై ఒక పళ్ళెంలో కొన్ని స్వీట్స్ వున్నాయి.

"కలగంటున్నారా? " అడిగింది.

తల వూపాడు కార్తీక్.

"ఏసి రూమ్, డబుల్‌కాట్ బెడ్, రాసుల కొద్దీ మల్లెపూలు ఇవన్నీ కనబడివుండాలే? "

"నీకెలా తెలుసు? " ఆశ్చర్యంగా అడి గాడు.

"ఇంతకాలంనుండి మిమ్మల్ని ప్రేమిస్తూ మీ వెనుక తిరుగుతున్నాను. ఆ మాత్రం తెలీదా? మీరు మనిషి సామాన్యంగా వుంటారుగాని మీ కలలు మాత్రం ఈస్ట్ మన్ కలర్‌లో వుంటాయి" పాలగ్లాసు అతని చేతికిస్తూ చెప్పింది.

"అంటే నేను పగటి కలలుకనే సోంబేరి నని నీ అభిప్రాయమా? " సీరియస్‌గా ముఖంపెట్టుకుని అడిగాడు.

"స్టాప్! ఈ రోజు మనం పోట్లాడుకోకూ డదు"

"మరేం చెయ్యాలి? "




"అది కూడా నేనే చెప్పాలా? "

"మొగుడు చెప్పడం పాతపద్ధతి. భార్య చెప్పడం కొత్తపద్ధతి. నీవే చెప్పు"

"మొదటిరాత్రి భర్తగారు పాలు తాగాలి బాస్" పాలగ్లాసు అతని నోటికందిస్తూ చెప్పింది పార్వతి.

"తాగాలి. కాని గ్లాసుతో కాదు" ఇంకా ఏదో చెప్పబోయాడు.

అరచేత్తో అతని నోరు మూసింది పార్వతి.

"సెన్సార్ బాస్. సినిమా రూలు ప్రకారం ఇటువంటివి మాట్లాడకూడదు"

"మరేం చెయ్యాలి? "

"పాట పాడాలి. పాడదామా? " నాలుక బయటకు చాపి వెక్కిరించింది.

పెళ్ళి ఈ ఊళ్ళోనే. పార్వతి ఇంటి దగ్గర జరిగింది. అదే ముహూర్తానికి నరేష్‌కి స్వప్నకి వివాహం జరిగింది. అందువల్ల ఈ పెళ్ళికి నరేష్ రాలేదు. అలా పెళ్ళికి రాని మరో వ్యక్తి సరోజ అదే పార్వతిని అడి గాడు.

"నీ ఫ్రెండ్ పెళ్ళికి రాలేదేం? "

"ఏమో? , బహుశా ప్రేమికుడి పెళ్ళికి రావడానికి కష్టం కలిగిందేమో? "

పక్కలో తాచుపామున్నట్లు అదిరిప డ్డాడు. అతని కళ్లలో ఆశ్చర్యాన్ని గమనించి చిన్నగా నవ్వింది పార్వతి.

"మీ ఇద్దరి సినిమాలు, షికార్లు అన్నీ నాకు తెలుసు. తెలిసినా పట్టించుకోలేదు. ఎందుకంటే తాడుకొస నా చేతిలో వుంది"

"తెలిసి కూడా కోరి చేసుకున్నావా నన్ను? "

"మిమ్మల్ని ప్రేమించడానికి నాకెంత హక్కు వుందో మీకు నచ్చిన మనిషిని ఇష్ట పడ్డానికి మీకూ అంతే హక్కుంది. అలాగే సరోజ క్కూడా. ఇందులో ఎవరూ ఎవరినీ తప్పు పట్టడానికి లేదు. కాకపోతే మీ పెళ్ళి జరగదని తెలుసు. కాబట్టి నేను ఆశ వదు లుకోలేదు. పెళ్ళికి ముందు ఎలా ఉన్నా పెళ్ళయ్యాక నా భర్త నన్ను ప్రేమించేలా

చేసుకోకపోతే నా ఆడతనమే వ్యర్థం"

అలాగే ఆమె ముఖంలోనికి చూస్తూ ఉండిపోయాడు. అందమైన భార్య దొరకడం కష్టంకాదు. డబ్బున్న భార్య దొరకడం కూడా అంత కష్టం కాదు. కాని తెలివైన భార్య దొరకడం మాత్రం చాలా కష్టం.

"తెల్లవార్లూ ఇలా మాటలతో, చూపులతోనే సరిపెడతారా? ఇంతకాలం చూసి చూసి ఇలా..." ముక్కుపట్టి ఊపుతూ అంది.

ఉక్రోషంగా భుజాలు పట్టుకుని వెనక్కు వంచాడు కార్తీక్.



పెళ్ళి నరేష్ జీవితంలో విశేషమైన మార్పు తెచ్చింది. కాని కార్తీక్ జీవితంలో మాత్రం ఏ మార్పులేదు. అదే ఉద్యోగం, అదే చిన్న గది. కాకపోతే ఆ గదిలో నరేష్ బదులు పార్వతి వుంటోంది, అంతే.

నరేష్ అప్పుడప్పుడు వచ్చేవాడు. ఒకటి రెండుసార్లు అతని మామగారు కూడా కనబడ్డారు. కాకపోతే మౌనంగా ఉండిపోయేవారు. కార్తీక్ కూడా పలకరించే వాడు కాదు. ఆయన ప్రతిజ్ఞ గుర్తొచ్చి నవ్వుకునేవాడు. ఆవేశంలో మనిషి ఎన్ని ప్రతిజ్ఞలైనా చేస్తాడు. ఆ తర్వాత ఆ వేడి నిలబడదు.

కాని అందరూ ఒకేలా ఉండరని అతనికి త్వరలోనే తెలిసింది.

పెళ్ళయ్యాక చాలామంది మగవాళ్ళలాగే కార్తీక్ కూడా కొద్దిగా లావయ్యాడు. జీవితం సాఫీగా సాగిపోతోందిగానీ, ఎన్ని నెలలైనా అతని నవల ప్రచురణ జరగడం లేదు. అది కొద్దిగా ఆందోళనగా వుంది. చాలా సార్లు వీరభద్రాన్ని కలిశాడు.

"చూడు కార్తీ! వాళ్ళవద్ద చాలా నవలలు వుంటాయి. అవన్నీ ఒక వరుసలో ప్రచురిస్తారు. అందులోనూ ఇప్పుడు ఆడవాళ్ళ యుగం నడుస్తోంది. ముందు ప్రముఖ రచయిత్రులవి ప్రచురించడానికే చూస్తారు. వాళ్ళకు సర్క్యులేషన్ ముఖ్యం కదా? " అనేవాడు. నిస్సహాయంగా వచ్చేసేవాడు కార్తీక్.

పార్వతితో అతని సంసారజీవితం ఆనందకరంగా వుంది. ఆమెకు కూడా మొదటి ఇష్టం సాహిత్యమే కావడంతో వాళ్ళలోకమే వేరుగా వుండేది. పక్కన ఎవరైనా వున్నా వీళ్ళ భాష వాళ్ళకు అర్థమయ్యేది కాదు. కోపగించుకోవడాలు, తిట్టుకోడాలు వాళ్ళ సంసారంలో వుండేవి కావు. అది నిజంగా పార్వతి గొప్పతనమే. కార్తీక్ ఎప్పుడు ఏం మాట్లాడతాడో ఒకక్షణం ముందే ఆ అమ్మాయి పసికట్టేసేది.

పార్వతి నెలతప్పినప్పుడు కూడా వాళ్ళకు అభిప్రాయబేధం కలుగలేదు. ఇద్దరూ అమ్మాయే కావాలనుకున్నారు. ఆడపిల్లల పేర్లు వందకుపైగా పోగేసివుంచింది పార్వతి. పుట్టబోయే పాపకు 'నీహారిక' అని పెట్టాలని ఇద్దరూ నిర్ణయించుకున్నారు. 'నీహారిక' పేరుతో ఒక కథ కూడా రాసాడు కార్తీక్. దానికి కథల పోటీలో బహుమతి రావటంతో అది మంచి శకునంగా వాళ్ళు భావించారు.

★ ★ ★

ఓ అర్థరాత్రివేళ పార్వతికి నొప్పులు మొదలయ్యాయి. రిక్షాలో వేసుకుని ఆమెను

హాస్పిటల్ కు తీసుకువెళ్ళాడు కార్తీక్. తెల్ల వార్లు అక్కడే కూర్చున్నాడు. మూలుగు తున్న పార్వతి బాధ వినేకొద్దీ అతని మనస్సు ద్రవించిపోతోంది. పుట్టేది ఆడైనా, మగైనా ఈ ఒక్కదానితోనే ఆపెయ్యాలి. ఇంత నరకయాతన భార్య మరొకసారి అనుభవించడానికి వీల్లేదు, అనుకున్నాడు. నాలుగైదుసార్లు నర్సులను హడావుడి చేశాడుగానీ.

"అబ్బ ఊరుకోండి సార్! ప్రపంచంలో మీ ఒక్కరికే భార్య వున్నట్లు ఏమిటా కంగారు? మీరెంత గింజుకున్నా తెల్లారి పది గంటలదాకా పురుడు రాదు" చెప్పిందో నర్సు.

పార్వతి ఆ బాధ తెల్లవార్లూ భరించింది.

తెల్లవారాక కబురు అందుకున్న అతని అత్తగారు రావడంతో మనస్సు కొంచెం శాంతించింది.

ఈలోగా కొట్టునుండి ఒక కుర్రాడు వచ్చాడు. జేబులో నుండి తాళాలు తీసి వాడికిచ్చాడు కార్తీక్.

"అయ్యగారు మిమ్మల్ని రమ్మంటున్నా రండి" చెప్పాడా కుర్రాడు.

"ఈరోజుకు నేను రావడం వీలుకాదని రాజుగారికి చెప్పు. ఈ ఒక్కరోజూ కొట్టు పని ఆయననే చూసుకోమను"

"అలాక్కాదండి. మీరు అర్జంటుగా రావాలి"

"నీవు వెళ్ళి నేను చెప్పమన్నట్లు చెప్పు. రాజుగారికి తర్వాత నేను సర్దిచెప్పుకుంటానులే"

"మీరు రాకపోతే పోలీసులకప్పగిస్తానన్నారండి"

అదిరిపడ్డాడు కార్తీక్. తనేమి విన్నాడో అర్థంకాలేదు.

పరుగులాంటి నడకతో కొట్టుకు వెళ్ళాడు కార్తీక్. అక్కడ అతని యజమాని, అతని పక్కనే మరో కుర్చీలో నరేష్ మావగారు ఉన్నారు. నరేష్ మావగారిని చూస్తూనే ఇదంతా ఏదో కక్ష సాధించే ప్రయత్నమని అర్థమయ్యింది.

"చూడబ్బాయ్. నువ్వెంతో మంచి వాడివని, నమ్మకస్థుడవని వ్యాపారాన్ని నీ చేతికి అప్పగించాను. ఇంత ద్రోహం చేస్తావనుకోలేదు"

"ఏం జరిగిందండి? "

"ఏం జరిగిందా? ఏమీ తెలియనట్లే మాట్లాడుతున్నావే? నిన్న రాత్రి కాష్‌బాక్స్‌లో పదివేలు పెట్టాను. కొట్టు తాళాలు, గల్లాపెట్టి తాళాలు కూడా మన ఇద్దరివద్దే వున్నాయి. వేసిన తాళాలు వేసినట్లుండగానే డబ్బుపోయింది. అంటే అర్థమేమిటి? నువ్వు దొంగిలించావా? లేక నా డబ్బు నేనే దొంగిలించాననా? " కోపంగా అడిగాడు.

కార్తీక్ నివ్వెరపోయాడు. ఇంతదారుణంగా తనను దొంగతనం కేసులో ఇరికించేస్తారనుకోలేదు.

"పోన్లెండి రాజుగారు. పెళ్ళాం పురిటి నొప్పులతో హాస్పిటల్‌లో వుంది. ఏవో ఖర్చులకొరకు కక్కుర్తిపడి వుంటాడు. ఇతగాడు మా అల్లుడి స్నేహితుడు. అందువల్ల నా ముఖం చూసి అతడిని వదిలేయండి"

"అంత డబ్బు ఎలా వదిలివేయమంటారండి? "

"అబ్బెబ్బె... మిమ్మల్ని నష్టపొమ్మని నేను చెప్పడం లేదు. ఆ పదివేలు అతగాడు ఒక గంటలో తెచ్చిస్తాడు. లేకపోతే అప్పుడు పోలీస్ రిపోర్ట్ ఇవ్వండి"

కార్తీక్‌కు నోట మాట రావడంలేదు. తన ప్రమేయంలేకుండానే తనకు దొంగతనం అంటగట్టేసి శిక్ష కూడా వీళ్ళే విధిస్తున్నారు. పదివేలు... అంత డబ్బు తను ఎక్కడి నుండి తీసుకురాగలడు. అదీ ఒక గంటలో. మౌనంగా నిలబడ్డాడు.

"నువ్వు నాతో రావయ్యా" నరేష్ మావగారు అతడిని బయటకు తీసుకువచ్చారు.

"ఎలాగో ఒకలా ఆ డబ్బు కట్టేయ్. లేక




పోతే ఒక సంవత్సరమైనా జైల్లో కూర్చో వాలి" హితబోధ చేసాడాయన.

దెబ్బతిన్న చిరుతపులిలా క్రోధంగా చూశాడు కార్తీక్. కాని ఆ కళ్ళలోని రక్తపు చారికలు ఆయనను కొద్దిగా కూడా భయపెట్టలేదు. "డబ్బుతో కొండమీది కోతిని దింపగలను గాని మనుష్యులను ఏం చెయ్యలేనన్నావు కదూ? ఇప్పుడు అర్థమయ్యిందా? డబ్బుతో ఏమైనా చెయ్యవచ్చు. ఒక గంటలో నువ్వు డబ్బు తేలేదనుకో, జైల్లో కూర్చుంటావు. ఆ డబ్బు తెచ్చావే అనుకో అయినా నీ ఉద్యోగం పోతుంది. నీవు, నీ భార్య, పుట్టబోయే పిల్లాడు అంతా పస్తులు పడుకోవాలి"

నిస్సహాయంగా పళ్ళు కొరుక్కున్నాడు కార్తీక్.

"ఇప్పటికైనా నా గొప్పతనం తెలిసిందా? నేను వెళ్ళి సినిమాహాల్లో వుంటాను. సరిగ్గా గంటలోగా వచ్చి నా కాళ్ళపై పడి క్షమాపణ అడుగు పదివేలు ఇస్తాను. వేరే ఉద్యోగం ఇస్తాను. ఎంతయినా నీవు నా అల్లుడి స్నేహితుడివి కదా? " నవ్వుకుంటూ వెళ్ళిపోయాడాయన.

కక్ష మనిషితో ఎంత పనైనా చేయిస్తుందనుకుంటూ, ఏం చెయ్యాలో తోచక ఆలోచిస్తూ హాస్పిటల్ చేరాడు.

పార్వతికి నొప్పులు ఎక్కువయ్యాయి. అలా బాధపడుతూనే ఏమిటని అడిగింది. వివరంగా చెప్పాడు. పార్వతి ఒక్కక్షణం కూడా ఆలోచించలేదు. అలా బాధపడుతూనే తన చేతిగాజులు, మెళ్ళో మంగళసూత్రం తీసి కార్తీక్ చేతిలో పెట్టింది.

"వెళ్ళి త్వరగా వచ్చేయండి" చెప్పింది.

ఊహ తెలిశాక అతను ఏడ్చిన సందర్భాలు తక్కువ. ఎప్పుడో తాతగారు పోయినప్పుడు ఏడ్చాడు. మళ్ళీ ఇన్ని ఏళ్ళ తర్వాత చిన్నపిల్లాడిలా ఇప్పుడు ఏడ్చాడు.

పార్వతిని లేబర్ రూమ్‌కు తీసుకువెళ్ళారు. కార్తీక్ అలానే నిలబడ్డాడు.

★ ★ ★

కార్తీక్ తిరిగి హాస్పిటల్‌కి వచ్చేసరికి రెండుగంటలు పట్టింది. పదివేలు పట్టుకు వెళ్ళి తన యజమానికి ఇచ్చాడు. అప్పుడే అనుకున్నాడు తనదంటూ అయిన రోజున వీళ్ళపైన ఇంతకు ఇంతా ప్రతీకారం తీర్చుకోవాలని.

శవ సంస్కరణ చేసిన వాడిలా విరక్తిగా వచ్చేశాడు.

ఆసుపత్రి నిశ్శబ్దసముద్రంలో మునిగి తేలుతోంది. మధ్యమధ్య ఎవరో చంటిపిల్ల ఏడుపు కేర్‌మంటూ వినబడుతోంది. క్రోటన్ మొక్కల మధ్యగా నడుస్తూ లోపలకు సాగాడు. మెయిన్‌గేటువద్ద ఒక నర్సు వుంది.

"సిస్టర్! నా భార్యకేమయ్యింది? "

"షి ఈజ్ ఆల్‌రైట్. కానీ పుట్టినపాప మాత్రం...? "

"ఏమైంది? " ఆతృతగా అడిగాడు.

"చనిపోయింది? "

పామునోటికి చిక్కిన కప్పలా, బాణం దెబ్బతిన్న పావురంలా విలవిల్లాడాడు. యుద్ధరంగంలో ఆఖరి ఆయుధం కూడా జారవిడుచుకున్న సైనికుడిలా, అంతా అయిపోయిందనే వైరాగ్యభావంతో నిర్లిప్తంగా పార్వతిని వుంచిన గదిలోనికి నడిచాడు.

మంచంపై పడుకుని ఏడుస్తోంది పార్వతి. ఆమె తల్లిదండ్రులు చెరోవైపు నిలబడి ఓదారుస్తున్నారు.

అతను దగ్గరకు వెళ్ళగానే ఏడుస్తూ ఉయ్యాలవైపు చూపించింది. అటు నడిచాడు. నిశ్చలంగా నిద్రపోతున్నట్లు వుంది పాపాయి. తన పాప. తన కలలపంట మృతశిశువుగా జన్మించింది.

"ఏమ్మా ఆకాశంనుండి వచ్చేటప్పుడు ఆ రంగు అంటుకుందా? నీలి గులాబి రెక్కలంత మెత్తటి బుగ్గలపై ముద్దులు పెట్టాలని దేవకన్యలు నిన్ను తీసుకుపోయారామ్మా? లేకపోతే నా బంగారు తల్లి లేక




పోతే స్వర్గం చిన్నబోతుందని దేవుడు లాక్కుపోయాడా?

"నీకోసం కుట్టిన బుల్లిబుల్లి గౌనులు, నీ కొరకు చేయించిన చిట్టిచిట్టి గాజులు ఏం చెయ్యమంటావు తల్లీ? ఇంత అన్యాయం చేసేవేమమ్మా? ఆడపిల్లనయి అమ్మకు నాన్నకు భారం అవుతాననుకున్నావా? ఆడ పిల్లవయినంతమాత్రాన ఇంత త్యాగం చెయ్యాలా?

అతని మనస్సుకు ఏడిచే ఓపిక కూడా లేదు.

అంతు, దరిలేని శోకంలో మునిగిపోతున్నాడు.

ఆ దుఃఖంనుండే ఎవరిపైనో తెలియని కసిరేగుతోంది. చేతనయితే ప్రపంచాన్నే భస్మీపటలం చెయ్యాలన్నంత క్రోధం పుడుతోంది.

ఈ ప్రపంచాన్ని ఏలేది ఒకేఒక్క సిద్ధాంతం. ఒకేఒక్క ఇజం. మనిషి బతకాలంటే డబ్బు కావాలి. డబ్బే ఈ ప్రపంచాన్ని ఏలే ఏకైక నియంత. డబ్బు నీకు ఆప్తులను, బంధువులని ఇస్తుంది. నీకు ఆయుష్షు, సుఖసంతోషాలను ఇస్తుంది.

పిడికిలి బిగించి గోడపై టపటపా కసిగా బాదాడు.

★ ★ ★

పార్వతి పుట్టింటికి వెళ్ళి మూడునెలలయ్యింది. తననుతాను కూడదీసుకోవడానికి ఆమెకు ఆ వ్యవధి సరిపోతుంది. కానీ కార్తీక్‌కుమాత్రం సరిపోలేదు. ఉద్యోగం కొరకు అతను తిరగని గడపలేదు. ప్రతీచోట పెదవి విరుపే ఎదురైంది.

ఆ పరిస్థితిలో తను భార్యతోపాటు పుట్టింటికి వెళ్ళడం అతనికి అవమానంగా అనిపించింది. అందుకే కనీసం ఆమెను చూడడానికి కూడా అతను వెళ్ళలేదు. బయటకు వెళితే అందరూ తనను చూసి నవ్వుతున్నట్లే అనిపించేది. ఎవ్వరితోనూ మాట్లాడబుద్ధి అయ్యేదికాదు. కొంతకాలంపోయాక తిండి కూడా కరువైంది. తనకుతానే జైలుశిక్ష విధించుకుని ఖైదీలా వుండిపోయాడు.

ఒకరోజు సడన్‌గా ఆ కవరు కార్తీక్ చేతికి వచ్చింది. అతని నవల సీరియల్‌గా ప్రచురిస్తున్నట్లు పత్రికవాళ్ళు తెలియచేస్తూ రాసిన లెటర్ అది.

శిలగా పడివున్న అహల్యకు రామపాదం సోకినట్లయ్యింది. అన్నినాళ్ళ అచేతనావస్థ నుండి ఒక్కసారిగా బయటకువచ్చాడు. అన్నిరోజులూ నూతిలోకప్పలా పడివున్న అతను ఒక్కసారిగా నింగిలో స్వేచ్ఛగా ఎగిరే చిలుకలా మారిపోయాడు.

వెళ్లి అద్దంముందు నిలబడ్డాడు.

మాసినగడ్డంతో, తైల సంస్కారంలేని జుట్టుతో దుమ్ముకొట్టుకుపోయిన బట్టలతో దేశంలోని దారిద్ర్యానికి ప్రతినిధిలా వున్నాడప్పుడు. అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకుంటూ అలాగే నిలబడ్డాడు కార్తీక్.

ఈరోజు మొదలు ఈ ప్రతిబింబం తెలుగునాట ప్రముఖుల సరసన చేరిపోవాలి. మంచిగాని చెడుగాని మార్గం ఏదన్నది తనకు అనవసరం. తను తన లక్ష్యాన్ని ఎలాగైనా సాధించాలి.

కార్తీక్ ఆ ఉత్తరం పట్టుకుని పార్వతి దగ్గరకు వెళ్ళాడు. ఆమెమాత్రమే ఈ లోకంలో అతని సుఖదుఃఖాలు పంచుకునే ఏకైక ప్రాణి.

మబ్బులమధ్య తళుక్కున మెరిసి మాయమయ్యే తటిల్లతలా పార్వతి ముఖంలో ఆనందం మెరిసింది. రివ్వున వచ్చి అతని కౌగిలిలో వాలిపోయి ఛాతిపై తలపెట్టుకుని ఏడవసాగింది. అప్పుడు అతని కళ్ళలో పొంగిన కన్నీటికి భాష వస్తే అది కవితగా మారేదేమో.

★ ★ ★

నెపోలియన్ హిల్ రాసిన సైకాలజీ పుస్తకంలోని కొన్ని వాక్యాలు కార్తీక్ ఎప్పుడూ

జ్ఞప్తికి తెచ్చుకుంటాడు.

"చాలాకాలం కిందట ఒక గొప్పయోధు డికి రణరంగంలో గెలవడంపై నిర్ణయం తీసుకునే సమయంలో ఒక విషమ పరిస్థితి ఎదురైంది.

తన సైనికులకంటే ఎదుటిపక్షం సైని కులు రెట్టింపు వున్నారు.

అప్పుడా యోధుడు తమను అక్కడికి తెచ్చిన ఓడలను తగలపెట్టించాడు. ఆ తర్వాత ఇలా చెప్పాడు.

"చూడండి. మన ఓడలు కాలిపోయాయి. దాని అర్థం మనం వీళ్ళను గెలిస్తే తప్ప ప్రాణాలతో బయట పడలేం. ఇప్పుడు మనకు మరోమార్గంలేదు. విజయమో, వీర స్వర్గమో!"

ఆ యుద్ధంలో వాళ్ళు గెలిచారు.

అదేవిధంగా ఏ వ్యక్తి అయినా సరే తన రంగంలో విజయం సాధించాలంటే ముందుగా వెనుతిరిగే ప్రయత్నాలు వమ్ము చేసుకోవాలి. అలా చేసినప్పుడే అతడిలో పట్టుదల అతడిని విజయపథంవైపు నడిపి స్తుంది.

కార్తీక్ అదే నిర్ణయించుకున్నాడు. తన జీవితాశయం సాహితీస్వర్ణ సింహాసనాన్ని అధిరోహించడం. అది సాధించాలంటే ఆ రంగంలోనే కృషిచేయాలి. ఏ వస్తువైనా అది పారేసుకున్న చోటే వెతుక్కోవాలి.

ఆరోజునుండి అతను ఉద్యోగ ప్రయ త్నాలు మానేశాడు. చావో, రేవో ఈ రంగం లోనే తేల్చుకోవాలనుకున్నాడు. మొత్తం సమయమంతా కథలు రాయడంలోనూ, వాటిని పట్టుకుని పత్రికాఫీసుల చుట్టూ తిర గడంలోనూ గడిపేవాడు.

ఇంటిపనంతా పార్వతి చూసుకునేది. ఒక్కొక్కసారి భోజనానికి కూడా రాకుండా రాసుకుంటుంటే తనే కంచంలో అన్నం కలు పుకుని వచ్చి తినిపించేది. ఈ ఏడాదిలో దాదాపు యాభై కథలు ప్రచురించబడ్డాయి.

ఒక ప్రమాదకరమైన ఆపరేషన్ చేసే డాక్టర్‌లా, ఒక పవిత్రమైన యజ్ఞాన్ని చేస్తున్న ఋత్విక్కుడిలా అతడు తనపని తాను చేసుకుపోతున్నాడు.

మరోపక్క అతడు రాసిన సీరియల్‌కు పాఠకులలో గుర్తింపు లభించింది. అందు లోని భావుకత అందరినీ ఆకర్షించింది. ఏ ప్రేమికుడైనా ప్రేమలేఖ రాస్తే ఆ నవల లోని ఒక్క వాక్యమైనా ఖచ్చితంగా వుండేది.

ఆ తర్వాత మరో రెండు నవలలు రాశాడు.

వాటికి కూడా మంచి గుర్తింపు వచ్చింది.

సరిగ్గా ఆ సమయంలోనే అతను "తెలుగు" వారపత్రిక ఎడిటర్‌ని కలిశాడు. అలా ఆ ఎడిటర్‌ని కలవడమే కార్తీక్ జీవి తాన్ని గొప్ప మలుపు తిప్పింది.

"తెలుగు తేజం" వారపత్రికలలో అతి తక్కువ సర్క్యులేషన్ గల పత్రిక.

ఆ పత్రిక ఎడిటర్ రావుగారు ఎప్పుడూ ఏదో లోకంలో వున్నట్లు వుంటాడు. అత డిని కార్తీక్ శర్మ పెళ్ళి రిసెప్షన్‌లో కలవడం జరిగింది.

శర్మ చక్కటి హాస్యరచయిత. ఎంత చండాలపు మూడ్‌లో వున్నా సరే శర్మ కథ చదివితే పగలబడి నవ్వుకోవలసిందే. అయితే అతడితో సమస్యల్లా మరీ దారుణ మైన జోకులు పేలుస్తాడు. అవి మనపై కానంతవరకు బావుంటాయి. ఎవ్వరిపై జోక్ పేలితే వాడు ఏడుస్తూ నవ్వుకుం టాడు.

"హల్లో... హాస్యసామ్రాట్, కంగ్రాట్సులే షన్స్" చెప్పాడు కార్తీక్.

"ఏం గురూ? నీకు నేను బఫూన్‌లా కన బడుతున్నానా? "

"లేదు. కన్నీళ్ళు పెట్టుకున్నవాళ్ళను కూడా నవ్విస్తావని ప్రచారం కదా? అందు కని ఆ బిరుదిచ్చాను తప్పా? "

"లేదుకానీ, చిన్న అచ్చుతప్పు గురూ. కన్నీళ్ళు పెట్టుకున్నవాళ్ళు నవ్వడంకాదు. మన నవల పట్టుకున్నాకే వాళ్ళు కన్నీళ్ళు




పెట్టుకుంటారు"

ఇంతలో ఎవరో యువకుడు వాళ్ళ దగ్గరకు వచ్చి బొకే అందించాడు శర్మకు.

"సారీ శర్మా! పెళ్ళికి రాలేకపోయాను" చెప్పాడు.

"ఫర్వాలేదు గురూ! ఈసారి పెళ్ళి చేసుకున్నప్పుడు మాత్రం తప్పక రావాలి"

చుట్టూ వున్నవాళ్ళు గొల్లుమన్నారు. దటీజ్ శర్మ. జీవితాన్ని చాలా తేలికగా తీసుకోవడం అతని అలవాటు.

ఈలోగా "తెలుగు తేజం" ఎడిటర్ రావు గారు వాళ్ళ దగ్గరకు వచ్చాడు.

"ఇదిగో గురూ! ఈయనే ది గ్రేట్ 'తెలుగుతేజం' ఎడిటర్ రావుగారు. పొరపాటున సీరియల్ ఇస్తానంటావేమో? ఆ పత్రిక ఈయన, ఈయనగారి బంధుమిత్రులు తప్ప అన్యులు చదవరు" పరిచయం చేశాడు శర్మ.

రావుగారు ముసిముసినవ్వులు నవ్వుతూ కార్తీక్‌తో చేయి కలిపాడు.

"ఇంకో విషయం గురూ రావుకి ఎవ్వరినైనా నువ్వు అని పిలవడం అలవాటు. కంగారుపడకు" మరోవైపు వెడ్తూ చెప్పాడు శర్మ.

చుట్టూ గోలగోలగా వుంది. ఎవరి గొడవలో వాళ్ళున్నారు.

"నిజమైన స్నేహం ఏకవచనంలో పిలుచుకోవడంలోనే వుందని నా అభిప్రాయం కార్తీక్. అందుకే అందరినీ అలానే పిలుస్తాను. నన్ను కూడా అలాగే పిలవమని చెబుతాను" అన్నాడు రావు.

"ఎవరి అభిప్రాయాలు వాళ్ళవి. మీ అభిప్రాయం కూడా సరియైనదే కావచ్చు"

"అప్పుడే నీలో పైకి వచ్చే లక్షణాలు కనిపిస్తున్నాయి. కర్ర విరగకుండా పాముచావకుండా స్టేట్‌మెంట్స్ ఇస్తున్నావు. బైదివే నీ నవల 'చేతవెన్నముద్ద' చదివాను. చాలా బావుంది"

మొహమాటంగా నవ్వి ఊరుకున్నాడు కార్తీక్. ఆ తర్వాత వాళ్ళ చర్చ సాహిత్యం వైపు మళ్ళింది.

"నువ్వు ఎన్నైనా చెప్పు కార్తీక్. మన తెలుగు నవలలు నాకు సహించడంలేదు. ఎన్ని నవలలు చదివినా ఒకటే వరుస. హీరోమాట హీరోయిన్ వినకపోవడం, హీరోయిన్ చేష్టలు హీరోకు నచ్చకపోవడం ఇదే వరుస"

"మనుష్యుల మధ్య మనస్థత్వ విశ్లేషణ బావుంటుంది. కానీ థీమ్ మాత్రం ఒక్కటే అయినందువల్ల అలాగనిపిస్తుంది"

"అదే మార్చాలి. సైన్స్, హిస్టరీ సబ్జక్ట్స్ తీసుకుని రాస్తే నువ్వే సూపర్‌స్టార్‌వి"

"క్షమించాలి. తెలుగులోనూ సైన్స్‌పైనా, చరిత్రపైనా నవలలు వచ్చాయి. వాటిని బ్యాక్‌గ్రౌండ్‌గా తీసుకున్నంతమాత్రాన ఇప్పుడు ఒరిగేదేమీలేదు" చెప్పాడు కార్తీక్.

పేపర్ ప్లేటులో స్వీటు హాటు పెట్టుకొచ్చి ఇద్దరికీ ఇచ్చారెవరో. అవి తింటూ కాసేపు మౌనంగా వున్నాడు రావు. తర్వాత చెప్పాడు,

"అలాకాదు. పూర్వం ఎవడో రాక్షసుడు నేలపై సూదిగుచ్చి దానిపై పోకచెక్క పెట్టి దానిపై భవంతిని నిలబెట్టాడట. సరిగ్గా అలాగే జరగాలి. ఏ సబ్జక్ట్ తీసుకున్నా చదివేవాళ్లకు కళ్ళు తిరగాలి"

కార్తీక్ ఏమీ మాట్లాడలేదు. ఒక్కక్షణం మౌనంగా వున్న తర్వాత రావు చెప్పాడు.

"నా మనస్సులో మాట చెబుతున్నాను. విను. నీవు మా పత్రికకు ఒక సీరియల్ రాయాలి. ఏ సబ్జక్ట్ తీసుకుంటావో, ఎలా రాస్తావో నీ ఇష్టం. నీతి నియమాలు, ఆశయాలు, ఆదర్శాలు నేను అడగను కానీ, ఆ సీరియల్ హిట్టవ్వాలి. ఎంత హిట్టంటే అటువంటి నవల ఇంతకుముందుగానీ, ఇక ముందుగానీ రాలేదని చెప్పగలగాలి. ఆ దెబ్బకు నువ్వు నెంబర్‌వన్ స్థానానికి, మా పత్రిక లార్జెస్ట్ సర్క్యులేటెడ్ మాగ్జైన్ స్థానానికి చేరిపోవాలి" ఉద్రేకంగా చెప్పాడు రావు.



కార్తీక్ భావరహితంగా ఆయన ముఖం లోకి చూస్తున్నాడు. రావు మాటలు అతనిలో ఆలోచనల తేనెతుట్టెను కదపసాగాయి.

"నీవు సాధించగలవు కార్తీక్. నేను ఊరికే చెప్పడంలేదు. నీ కథలు, నవలలు చదివే ఈ నిర్ణయానికి వచ్చాను"

"మీరు చెప్పింది బానేవుంది. కాని అంతటి సెన్సేషన్ ఎలా సృష్టించడం? " మెల్లగా అన్నాడు కార్తీక్.

"అది పూర్తిగా నీ స్వంత వ్యవహారం. ఏం చేస్తావో, ఎలా చేస్తావో నాకు తెలీదు. కాని విజయం సాధించాలి. సాధించి తీరాలి"

కార్తీక్ ఆలోచనలో పడ్డాడు. అతని మదిలో ఓ చిన్న మొక్కకు రావు నీళ్ళు పోస్తున్నాడు. అటువంటి అవకాశం కోసమే అతను ఎదురు చూస్తున్నాడు కాని... మనసులో ఏదో సందేహం. నేషనల్ టీం తరుపున అంతర్జాతీయ రంగంలో తొలిసారి ఆడుతున్న ఆటగాడి పరిస్థితి అది. సెంచరీ చేస్తే జేజేలు. డక్ అవుట్ అయితే ఉద్వాసన.

అతని మౌనాన్ని రావు మరోలా అర్థంచేసుకున్నాడు.

"ఏం? రాయలేవా? అటువంటి మాస్టర్ పీస్‌ని సృష్టించలేవా? " అడిగాడు.

"చేస్తాను... రెండు రోజుల్లో మీ ఆఫీస్‌కు వస్తాను" చెప్పాడు కార్తీక్.

సాహితీ స్వర్ణసింహాసనాన్ని అధిష్టించాలన్న కోరిక కార్తీక్ మనస్సాగరంలో కల్లోలాన్ని సృష్టిస్తోంది. "భగవాన్! నాకు దారి చూపు. అసతోమా సద్గమయ..."

★ ★ ★

ఆ ఎత్తైన పెద్ద గేటు ముందు నిలబడి లోపలకు చూస్తోందా అమ్మాయి. లోపలకు వంకరటింకరగా దారి కనబడుతోంది. ఆ భవంతి ముందు భాగంలో వున్న చెట్లు జడలు విప్పుకుని నిలబడ్డ భూతాల్లా వున్నాయి. వాటిమధ్యనుండి వీస్తున్న గాలి ఆకలితో వున్న నక్కల ఏడుపుల్లా వికృతంగా వినిపిస్తోంది. ఆ భవంతి ఒకనాటి అద్భుతమైన అందగత్తె. కాలక్రమంలో వృద్ధాప్య భారంతో తోలుతిత్తి అయినట్లుగా అనిపిస్తోంది. ఆ భారీ ఇనుపగేటును మెల్లిగా చేత్తో గెంటిందామె.

ఆ మాత్రానికే ఆ గేటు కిర్రుమంటూ పెద్ద శబ్దం చేస్తూ తెరుచుకుంది. మరుక్షణంలోనే నిశ్శబ్దం, ఘనీభవించినట్లు అంతా ప్రశాంతమైపోయింది.

ఆ అమ్మాయి భయపడుతూ లోపలకు ప్రవేశించింది. ఎక్కడా ఎటువంటి అలికిడి లేదు. విచిత్రంగా ఆ నిశ్శబ్దమే ఆమెను భయపెడుతోంది.

భవంతి ముఖద్వారాన్ని సమీపించిందామె. అక్కడ వున్న పెద్దపెద్ద తలుపులు ఆమె అడుగు పడగానే వాటంతట అవే తెరుచుకున్నాయి. లోపలకు తొంగిచూసింది ఆమె.

ఎన్నాళ్ళనుండో మనుష్యులు నివసించనట్లు సాలెగూళ్లతో, చెత్తాచెదారంతో చాలా అసహ్యంగా వుంది. నేలపై అడుగు మందం దుమ్ము పేరుకుపోయింది.

భవంతి లోపలి భాగంలో ఒక పక్కగా మేడపైకి మెట్లు వున్నాయి. ఆ మెట్ల వెంబడే పైకి వెళ్ళిందాయువతి. కుడివైపు వున్న గది లైబ్రరీ గదిలా వుంది.

రకరకాల బీరువాలు, అనేకరకాల పుస్తకాలతో నిండి వున్నాయి. గది మధ్యగా ఒక రివాల్వింగ్ ఛైర్ వుంది. దాని వెనుక గోడకు ఒక హేంగర్ వుంది. దానికి ఒక నల్లటి కోటు వేలాడుతోంది. ఆ కోటుకు ఒక గులాబి పువ్వు పిన్ చెయ్యబడి వుంది. ఆ గులాబి మనిషి నెత్తురంత ఎర్రగా వుంది.

ఆమె లోపలకు నడిచి ఆ గులాబి




పువ్వును చేత్తో మృదువుగా తాకింది. ఆ క్షణంలోనే ఒక నల్లటి నీడ ఆమెను తాకుతూ గోడపైపడింది.

ఉలిక్కిపడి వెనక్కు తిరిగిందా యువతి. అక్కడ సన్నగా, పొడవుగా ఒక వ్యక్తి నిలబడి వున్నాడు. రక్తమే లేనట్లు తెల్లగా పాలిపోయి వున్న అతని ముఖంలో గుంటలుపడి ఎర్ర జీరలతో వున్న కళ్ళు ప్రత్యేకంగా కనిపిస్తున్నాయి.

ఆమెను చూడగానే ఆ కళ్ళలో కనీకనిపించని మెరుపేదో తళుక్కున మెరిసింది.

ఆమె తనవైపు చూడగానే ఏమాత్రం చప్పుడు కాకుండా నిశ్శబ్దంగా నవ్వాడతను. నవ్వినప్పుడు అతని పెదవులకిరువైపులా వున్న తెల్లని కోరపళ్ళు తళుక్కున మెరిశాయి.

భయం శరీరాన్ని నిలువెల్లా వణికింపచేస్తుండగా కెవ్వున అరిచిందామె.

చటుక్కున లేచి కూర్చున్నాడు కార్తీక్. తన ఇంట్లో తన మంచంపైనే వున్నాడు. అయితే అంతవరకు జరిగింది కలన్నమాట. ఎదురుగా పార్వతి కుర్చీలో కూర్చుని ఏదో రాసుకుంటోంది.

పార్టీనుండి ఇంటికిరాగానే పార్వతితో మొత్తం జరిగినదంతా చెప్పాడు. ఆమె శ్రద్ధగా విందిగాని ఏమీ మాట్లాడలేదు. కార్తీక్ కూడా పట్టించుకోలేదు. అతని ఆలోచనలనిండా ఒకటే నిండివుంది. సెన్సేషన్ కలిగించే నవల రాయాలి. మొత్తం నవలా ప్రపంచాన్ని కుదిపివేసే ఇతివృత్తం రావాలి.

రకరకాల ఆలోచనలతో పడుకున్నాడు. నిద్రలో ఈ పీడకల. అప్పటికే అర్ధరాత్రి దాటినట్లుంది. ఎందుకనో పార్వతి ఇంకా పడుకోలేదు.

"పార్వతీ" పిలిచాడు.

ఠక్కున అతనివైపు చూసి, రివ్వున వచ్చి మంచం ఎక్కేసింది.

"దొరికింది కార్తీ! మీ కోరిక నెరవేరేటందుకు ఉపయోగపడే ఇతివృత్తం దొరికింది" ఉద్రేకంగా చెప్పింది.

"ఏమిటి? " ఆశ్చర్యంగా అడిగాడు.

"జాగ్రత్తగా వినండి. ఇంగ్లీషు రైటర్స్ ఒక సబ్జక్ట్ తీసుకుని దాన్ని మథిస్తూ అందుకు అవసరమైన సమాచారాన్ని పోగుచేస్తూ నవల రాస్తారు. మనవాళ్ళలా రాత్రంతా మెలకువగా వుంటే తెల్లవారేసరికి నవల సిద్ధంకాదు"

పార్వతి ఏం చెప్పడానికి ప్రయత్నిస్తోందో అతనికి అర్థం కావడంలేదు. ఇంగ్లీషు నవల్స్‌తో తెలుగు నవల పోలిక అసమంజసంగా వుంటుంది.

"తీసుకున్న ఇతివృత్తంపై ఎందరితోనో ఇంటర్వ్యూలు, వాళ్ళతో ఫొటోలు, ఆయారంగాల్లోని పెద్దపెద్ద వారినుండి సమాచారం సేకరించడం మొదలైన పద్ధతులు మనవాళ్ళకు బాగా కొత్త. ఆ పద్ధతి ఇక్కడ పరిచయం చేద్దాం. తీసుకునే సబ్జక్ట్ కూడా అందుకు తగిందే అవ్వాలి. ఇంగ్లీషులో 'సైకోపాత్'లపై ఎన్నో నవలలు వచ్చాయి. ఒక వ్యక్తి కల్లోలిత మనస్థత్వాన్ని ఆధారంగా తీసుకుని అతనిచుట్టూ భయానక రసం ప్రధానంగా ఒక నవల రాస్తే? "

వింటున్నాడో లేదో అని కాబోలు అతని ముఖంలోనికి చూసింది. ఏం కనిపించిందో గానీ సంతృప్తిగా చెప్పసాగింది.

"పరిస్థితుల ప్రభావంవల్ల పిచ్చివాడైన ఒక వ్యక్తి చేసే హత్యలు, ఆ హత్యలతో వెర్రెత్తిపోయే సమాజం గూర్చి రాయొచ్చు ప్రతీ సంచికలోనూ తరువాత ఏమవుతుంది... అనే సస్పెన్స్ పోషించాలి. నరాలు తెగిపోయేంత ఉత్కంఠ ప్రతీ భాగంలోనూ వుండాలి. ఆంధ్రదేశంలో వున్న పిచ్చాస్పత్రులన్నీ తిరగండి. ఆ డాక్టర్స్‌ని ఇంటర్వ్యూ చెయ్యండి. ఒక్కొక్క పిచ్చివాడికి ఒక్కొక్క కథ వుంటుంది. అవన్నీ పాఠకులకు చెప్పండి. సైకలాజికల్ ఫీవర్స్ సైకాలజీ పుస్తకాలలో సంపాదించి రాయండి.

కార్తీక్ నిద్రమత్తు ఎప్పుడో ఎగిరిపోయింది. అయినా కూడా ఆమె చెప్పింది అతని మెదడులో ఇంకడానికి కాస్త సమయం పట్టింది. అప్పుడు అతనికి తనకు వచ్చిన కల గుర్తుకు వచ్చింది. కల భయంకరంగా వున్నా అందులోని సస్పెన్స్...

ఆ సస్పెన్సే పాఠకులను వారంనుండి వారం ఎదురు చూసేలా చేస్తుంది. భయానకరసంలో ఆ సస్పెన్స్‌ని పెంచి పోషించ వచ్చును. అవును... ఈ కోణం నుండి తను ఎప్పుడూ ఆలోచించలేదు. అయినా ఒక అనుమానం అతని మనస్సును కుమ్మరి పురుగులా తొలుస్తోంది.

"హాయిగా ఫాన్‌కింద కూర్చుని ప్రేమ నవలలు చదువుతూపోయే తెలుగు పాఠకుడికి సోషియోక్రైం పరిచయం చేస్తే ఫలితం ఎలా వుంటుంది? "

"ఖచ్చితంగా సక్సెస్ అవుతుంది. నీ కో విషయం చెప్పనా? పదిమంది నడిచే దారిన నడిస్తే నీవు కూడా వాళ్ళలో ఒకడివి అవుతావు. అలా కాక వేరే దారి ఏర్పరిచావనుకో, ఇంకో పదిమందికి మార్గదర్శకుడివి అవుతావు. తెలివైన వ్యాపారస్థుడెప్పుడూ పాత వస్తువులనే తయారు చేయాలనుకోడు. ఎందుకంటే అందులో పోటీ ఎక్కువ వుంటుంది. రిస్క్ తీసుకోవలసి వున్నా కొత్త వస్తువునే మార్కెట్‌కు పరిచయం చేద్దామనుకుంటాడు"

పార్వతిని దగ్గరకు తీసుకున్నాడు కార్తీక్.

అందరిలా వేళకు వంటచేసి, రాత్రి యాంత్రికంగా పక్కలో చేరిపోతూ, లేచిన దగ్గరనుండి రాత్రి పడుకునే వరకు సాధిస్తూ సంసారం చేసే ఇల్లాలు కాదీమె!

తన కష్టంలో ఓదార్పై, తన శోకంలో కన్నీటి బిందువై తన భయంలో ధైర్యమై, తన కోపంలో ఉపశమనమై, తన ఆనందంలో చిరునవ్వై, తన చిరునవ్వులో జీవమై, శృంగారంలో అనుభూతిగా మారే అర్ధాంగి ఈమె! పెళ్ళనేది లాటరీ అయితే అందులో తనకు బంపర్ బహుమతిగా దొరికిందీమె!

నిద్రలేక ఎర్రబారిన పార్వతి కళ్లపై ముద్దుపెట్టి చెప్పాడు. "అలాగే చేస్తాను పారూ, థ్యాంక్యూ"

"ఇంకో విషయం కార్తీ, ముగింపు వెరైటీగా వుండాలి. పుస్తకం ముయ్యగానే మరిచిపోయేది కాకుండా ఆలోచింపజేసేదిగా వుండాలి. గుర్తుంచుకో"

★ ★ ★

ఆ తర్వాత "తెలుగు తేజం" కార్యాలయానికి వెళ్ళాడు కార్తీక్. రావుగారు అతడిని చూడగానే చిరునవ్వుతో స్వాగతం చెప్పాడు.

"ఏమిటి? ఏదైనా సబ్జక్ట్ దొరికిందా? "

"ఆ! అర్ధరాత్రి అయిడియా పరుగెట్టుకొచ్చింది" అంటూ రాత్రి జరిగిన చర్చ వివరించాడు.

"భార్య అంటే అలా వుండాలి. నా పెళ్ళామూ వుంది ఎందుకు? ఆ చీరె తేలేదు. ఈ సినిమాకు తీసుకువెళ్ళలేదు అని గొడవపెట్టడం తప్ప నా ఉద్యోగం గురించి ఒక్క విషయం అడగదు. పొరపాటున చెప్పినా విసుక్కుంటుంది"

కార్తీక్ చిన్నగా నవ్వాడు. లోకంలో తొంభైశాతం భర్తలు తమ భార్యలపై చేసే ఫిర్యాదే అది.

"కాని మన పాఠకులు కొత్త కథల్ని రిసీవ్ చేసుకుంటారంటావా? డిటెక్టివ్ నవలగా తీసిపారేస్తారేమో? " సందేహంగా అన్నారు రావుగారు.

ఆ అనుమానం కార్తీక్‌కూ వుంది. అందుకే ఏమి మాట్లాడలేక పోయాడు.

"ఒక పని చేద్దాం. దీనికి సంబంధించి ముందు మన పత్రికలో ప్రకటన ఇద్దాం. దానికి సంబంధించిన మ్యాటర్ రాయి. అలాగే టైటిల్ ఎనౌన్స్ చేద్దాం. ఆ ప్రకటనకు వచ్చిన రెస్పాన్స్ బట్టి సీరియల్ ఎన్ని




వారాలనేది నిర్ణయిద్దాం. నవల కూడా ఒకే సారి రాయకు. ప్రతీవారం రాద్దువుగాని. నవల సక్సెస్‌నుబట్టి దాన్ని పొడిగిద్దాం. నువ్వు ప్రకటన సిద్ధంచెయ్యి. నేను మా బాస్‌తో ఈ ప్రయోగం గురించి మాట్లాడ తాను" అతనికి ఒక నోట్ బుక్ ఇస్తూ చెప్పాడు రావు.

కార్తీక్ ఆ పుస్తకం ముందుపెట్టుకుని కాసేపు ఆలోచించాడు. నిజంగానే ప్రయోగం చెయ్యబోతున్నాడు. సక్సెస్ అయితే ఫర్వాలేదు. ఫెయిలయితే మాత్రం అందరిలోనూ మరోసారి హేళనకు గురవు తాడు.

అతని భావాలతో సంబంధంలేనట్లు రావుగారు ఫోన్‌లో ఎవరితోనో అదే పనిగా మాట్లాడుతున్నాడు.

రెండు క్షణాలు కళ్ళు మూసుకున్నాడు. కార్తీక్ మూసిన కనురెప్పలపై పార్వతి నిల బడింది. ఎక్కడలేని ఉత్సాహం మనస్సు లోపలి పొరలనుండి పైకి ఉబికి వచ్చింది. గబగబా రాయసాగాడు.

"తెలుగు తేజం" పాఠకులకు మాత్రమే దక్కిన అపూర్వ అవకాశం. మీ అభిమాన రచయిత ఆంధ్రదేశమంతా తిరిగి సేకరిం చిన అద్భుతాల సమ్మేళనం. త్వరలో మీ ముందుకు ఒక సీరియల్ రాబోతోంది"

తర్వాత మరో కాగితంపై మరోపేరా రాసాడు.

"మీ అభిమాన రచయితపై హత్యాప్ర యత్నం. అరచెయ్యి అడ్డంపెట్టి సూర్యుడ్ని ఆపాలనుకునే కొందరు మూర్ఖుల పిచ్చిప నిలా తోస్తోంది. తన ప్రాణాలకంటే పాఠకు లకు నిజాలు తెలియడమే ముఖ్యమంటు న్నాడు మీ రచయిత"

"పి.యస్. నిజాలు తట్టుకోలేని పిరికి వాళ్ళు ఈ సీరియల్ చదవకండి. ఎందు కంటే ఇది వంటింట్లో కూర్చుని "హల్లో డార్లింగ్" అంటూ రాసిన సీరియల్ కాదు. పచ్చి నిజాలు. ప్రాణాలకు తెగించి బయ టకు లాగిన ఇన్వెస్టిగేటివ్ థ్రిల్లర్"

తలపైకెత్తి రావుగార్ని చూశాడు. అప్ప టికే ఫోన్ పెట్టేసి దీక్షగా అతని ముఖంలో నికి చూస్తున్నాడాయన.

"ఒక విచారకరమైన విషయం కార్తీక్"

"ఏమిటది? " ఆతృతగా అడిగాడు కార్తీక్.

"ఇది ప్రయోగం కాబట్టి నీకు రెమ్యూనరే షన్ ఏమీ ఇవ్వరట. ఈ విషయంలో ఎంతో నచ్చచెప్పడానికి ప్రయత్నించాను. వినడంలేదు"

ఏం చెప్పాలో కార్తీక్‌కు తెలియలేదు. టేబుల్‌పైని పేపర్ వెయిట్‌ని గుండ్రంగా తిప్పుతూ ఆలోచిస్తున్నాడు.

"నీవు సేకరించే సమాచారానికి, తిరిగే ఊళ్ళకు మాత్రం ఖర్చులు పత్రిక భరి స్తుంది. ఏమంటావు? "

తేలిగ్గా ఊపిరి పీల్చుకుని చెప్పాడు. "నేను ఈ సీరియల్ కొరకు నిజంగా కష్టప డదలిచాను. ఖర్చులు నేనే పెట్టుకోగలిగే పరిస్థితిలో లేను. అవి మీరు భరిస్తే చాలు. ఇక నాకు రావలసిన డబ్బంటారా? నా నుదుటన గీత బావుంటే అదే వస్తుంది''

"సారీ కార్తీక్! ఒక రచయితను ఇలా దోచుకోవడం నాకు ఇష్టం లేదు. కానీ నేను పూర్తిగా స్వతంత్రుడను కాను. నీకు తెలుసు కదా" బాధగా చెప్పాడు రావు.

"ఇట్సాల్‌రైట్. ఇది చదవండి" పుస్తకం అతని చేతికిచ్చాడు.

అది పూర్తిగా చదివి "ఇందులో సీరి యల్ ఏ సబ్జెక్టుపైనో చెప్పలేదే" అన్నాడా యన.

"అక్కర్లేదు. పాఠకులను సస్పెన్స్ లో పెట్టడం ఇప్పటినుండే ప్రారంభం..." కుర్చీ లోనుండి లేస్తూ చెప్పాడు కార్తీక్.

అతనిప్పుడు కురుక్షేత్రంలో మొదటి బాణం సంధిస్తున్న అర్జునిడిలా వున్నాడు.

వారం రోజులు కూర్చున్నచోటునుండి కదలకుండా రాశాడు కార్తీక్. రాసింది పది

పేజీలే. మొదటి భాగం కనుక చాలా జాగ్రత్తగా రాయవలసి వచ్చింది. ఈ పది పేజీలే లక్షలాది పాఠకులను తనవెంట తీసుకురావాలి. అందుకే దాదాపు ఇరవై సార్లు తిప్పితిప్పి రాశాడు. ఒకసారి పార్వతికి నచ్చకపోతే, ఒకసారి తనకు నచ్చేది కాదు.

ఆరోజు పత్రికాఫీసుకు వెళ్ళేసరికి రావు గారు చాలా ఆనందంగా వున్నాడు.

వెళ్ళి అతని ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు కార్తీక్.

"మన ప్రకటనలకు మంచి రెస్పాన్స్ వచ్చింది. చాలామంది ఉత్తరాలు రాశారు"

"ఇంకో రెండు ప్రకటనలు ఇద్దామా?" అడిగాడు కార్తీక్.

"వద్దు ఇప్పటికే రెండు వారాలయ్యింది. ఇంక సీరియల్ మొదలు పెట్టేద్దాం. రాసుకొచ్చేయ్"

తన చేతిలోని కాగితాలు అతనికి అందించాడు. వాటిని తీసుకుని ఆతృతగా చదవడం మొదలుపెట్టాడు రావు. కార్తీక్ కుర్చీలో వెనక్కు జారబడి రిలాక్సింగ్‌గా కూర్చున్నాడు. అది రావుకి నచ్చుతుందనే అతనికి నమ్మకముంది.

అంతా చదివాక సంతృప్తిగా తలవూపాడు రావు.

"నాకు తెలుసు. ఇది ఖచ్చితంగా హిట్ అవుతుంది. అయితే అప్పుడే సీరియల్ మొదలుపెట్టేయవద్దు. నీవు చెప్పినట్లు ఇంకో రెండుమూడు ప్రకటనలిచ్చి అప్పుడు మొదలుపెడదాం. ఇతర పత్రికల్లో కూడా ఒక ఎడ్వర్‌టైజ్‌మెంట్ వచ్చేలా మన బాస్‌తో మాట్లాడతాను"

వెంటనే రెండు ప్రకటనలు అక్కడే రాసేశాడు కార్తీక్. ఇప్పుడిప్పుడే కళ్ళాలు తన చేతికి వస్తున్నాయి. జాగ్రత్తగా మేనేజ్ చెయ్యాలి.

ఇంక అక్కడినుండి అతని పాట్లు మొదలయ్యాయి. రాష్ట్రంలో ప్రతీ పేరున్న మానసిక చికిత్సాలయానికి వెళ్ళి అక్కడి డాక్టర్లను కలిసేవాడు. చికిత్స పొందుతున్న మానసిక రోగులను చూసేవాడు. రకరకాల జబ్బుల గుర్చి డాక్టర్లను అడిగేవాడు. పేరున్న ప్రతీ సైకాలజిస్టు రాసిన ప్రతీ పుస్తకాన్ని చదివాడు.

పార్వతి కూడా ఖాళీగా ఉండేది కాదు. పత్రికలలో, ఇంగ్లీషు మంత్లీలలో ఈ సబ్జక్ట్‌పై వచ్చిన రకరకాల విషయాలను కట్ చేసి దాచేది. అతను ఎక్కడ తిరిగినా, ఏం చేస్తున్నా తను మాత్రం సీరియల్‌లో స్టోరీ గురించే ఆలోచించేది. రాగానే అతనికి కథలో ఆసక్తికరమైన మలుపుల గుర్చి వివరించేది. అతను సేకరించిన విషయాలన్నీ ఒక ఫైల్లోనూ, రాసిన సీరియల్ భాగాలు మరొక ఫైల్లోనూ జాగ్రత్త చేసేది.

సరిగ్గా నెల రోజుల తర్వాత ప్రారంభమయ్యింది కార్తీక్ సీరియల్ 'మనసు'.

మొదటి పది భాగాలలోనే 'మనసు' ఒక సూపర్‌హిట్ సీరియల్ అయికూర్చుంది. 'తెలుగుతేజ' సర్క్యులేషన్ వరద గోదావరి నీటిమట్టంలా పెరిగిపోసాగింది. ఐదో భాగంనుండి కార్తీక్ ఇంటర్వ్యూ చేసిన వాళ్ళ ఫొటోలు, కథనాలు ప్రచురించడం కూడా మొదలుపెట్టాడు. ఇక అక్కడినుండి కార్తీక్ పబ్లిక్ ఫిగర్ అయిపోయాడు.

అతనికి అర్థమయ్యింది. తన జీవితంలో తీతువుపిట్టల వికటాట్టహాసాలకు, గబ్బిలాల రోదనలకు, నల్లటి మబ్బులకు కాలం చెల్లింది. ఇకముందు అన్నీ జాజిపందిళ్ళు, గులాబి పాన్పులు, మల్లెల సౌరభాలు, వెన్నెల రేయిలకీ అవకాశం వుంది.

అతను ఎక్కడికి వెళ్ళినా ఎవరో ఒకరు గుర్తింపుగా మాట్లాడుతున్నారు. పెద్దపెద్ద వాళ్ళు కూడా అభిమానంగా ఉంటున్నారు.

అతని సీరియల్‌లో హీరోయిన్ పేరు శిరీష. ఆ పేరుగల వాళ్ళకైతే ఆనందానికి అవధే వుండేది కాదు.




అతనికి పరిశోధనల్లో రకరకాల వ్యక్తుల గూర్చి తెలిసేది. ప్రేమించి పిచ్చివాళ్ళయిన వాళ్ళగూర్చి, ప్రేమ రాహిత్యంతో పిచ్చివాళ్ళ యిన వాళ్ళ గూర్చి, లాటరీ పిచ్చివాళ్ళు, డబ్బు పిచ్చివాళ్ళు, ఆడవాళ్ళ పిచ్చి వున్న వాళ్ళు ఇలా ఎంతోమందిని గూర్చి తన సీరియల్‌లో చర్చించేవాడు. అయితే ఈ విషయాలన్నీ పూలదండలో దారంలా కథతో పాటే నడిచేవి తప్ప బయటకు కనిపించేవి కావు.

రావుగారు కార్తీక్‌కు చాలా రకాలుగా మద్దతు ఇచ్చేవాడు. అతను ఊళ్ళు వెళ్ళనప్పుడు కూడా వెళ్ళినట్లు రాసి డబ్బు తీసుకోమనేవాడు. కాని కార్తీక్ తిరస్కరించేవాడు. ఇప్పుడు ఎవ్వరినీ మోసం చెయ్యవలసిన అవసరంలేదు. తన డబ్బు అణాపైసలతోసహా ఎలా రాబట్టుకోవాలో తనకు బాగా తెలుసు.

'మనసు' సీరియల్ నడుస్తుండగానే మరో రెండు పత్రికల ఎడిటర్లు అతడిని సీరియల్స్ అడిగారు. ఒప్పుకున్నాడు.

క్రమంగా కార్తీక్ పేరు పత్రికలలో కనబడితే చాలు చదివేసే పరిస్థితి వచ్చేసింది. అతని చుట్టూ పబ్లిషర్ల లైను మొదలయ్యింది. ముఖ్యంగా 'మనసు' సీరియల్‌ని నవలగా వేయడానికి ఎంతైనా ఇవ్వడానికి సిద్ధపడుతున్నారు.

'మనసు'కంటే వెనక మొదలుపెట్టిన రెండు సీరియల్స్ అయిపోయి నవలలుగా వచ్చేసాయి. వెంటనే మరో రెండు సీరియల్స్ మొదలుపెట్టాడు.

ఒక డైరక్ట్ నవల రిలీజ్ చేశాడు.

అన్నీ హిట్టే. నథింగ్ ఈజ్ సక్సెస్ దేన్ సక్సెస్, అతని విషయంలో అదే జరుగుతోంది.

కార్తీక్ రచనలలో శైలి విలక్షణంగా వుండేది. ముగింపు వెరైటీగా వుండి పాఠకులకు విపరీతంగా నచ్చేది.

అతని రచనలలో ముఖ్యంగా పాఠకులను ఆకట్టుకునేది మానసిక విశ్లేషణ. మనుషులలో అంతర్లీనంగా వుండే సైకలాజికల్ ఫీవర్స్ గురించి వివరించడం అతని రచనలలో అదనపు ఆకర్షణ.

'మనసు' నవల సక్సెస్ కావడానికి ముఖ్యమైన కారణాలు ఇవే. ఈ నవల కొరకు అతను సేకరించిన సమాచారం అందరినీ బాగా ఆకర్షించింది. దీనికొరకు అతడు చాలాచోట్లు తిరిగాడు. ఇప్పుడు అతని పేరు అతనికంటే ముందు నడుస్తోంది. ఎంత పెద్ద సైకాలజిస్టునైనా ఇప్పుడు అతను కలవడం చాలా తేలిక.

సైకాలజీకి చదివేకొద్దీ చదివించే సామర్థ్యం వుంది. మనిషి అంతరాంతరాలలో దాగివుండే మరో మనిషి గూర్చి చెప్పడంవల్ల అది చాలా ఇంటరెస్టింగ్ సబ్జెక్ట్ అని చెప్పవచ్చు.

కొంతమంది వ్యక్తుల గురించి తెలుసుకుంటుంటే చాలా ఆశ్చర్యంగా వుంటుంది.

ఒక పెద్దమనిషి ఆడవాళ్ళు స్నానం చేస్తుండగా చూసేవాడు. తను చేస్తున్నది తప్పని అతనికి తెలుసు. కాని ఎంత నిగ్రహించుకుందామన్నా అతనివల్ల అయ్యేది కాదు. చివరకు తన భార్య స్నానం చేస్తున్నా అలాగే దొంగతనంగా చూసి ఆనందించేవాడు.

ఇంకోవ్యక్తి అర్ధరాత్రి వీధులవెంబడి తిరిగి గోడలపై బొగ్గుతో, సుద్దతో అశ్లీలకరమైన మాటలు రాసేవాడు. పగలు వాటిని చూసి పదిమందిలో కలిగే భావాలు ఆనందంగా గమనించేవాడు. అతడేమీ చిత్తుకాగితాలు ఏరుకునేవాడు కాదు. గౌరవప్రదమైన ఉద్యోగంలో ఉన్నవాడే.

ఒకామెకు ఎప్పుడూ చనిపోతానేమోననే ఆలోచనే. షాపింగ్‌కు, బజారుకు వెళ్ళినప్పుడు ఏ లారీకిందో పడిపోదామని, ఇంట్లో ఉన్నప్పుడు ఎలక్ట్రిక్ ప్లగ్‌లో వేళ్ళు పెడదామని అనిపించేది. ఎక్కడైనా ఎప్పుడైనా చావు గురించే ఆమె ఆలోచనలు.

ఆమె సంగతి అలా వుంటే ఇంకొక వ్యక్తికి ఎప్పుడూ ఎదుటి వాళ్ళను చంపేద్దామనిపిం చేది. అతను తన ఊహల్లో కనిపించిన మనిషినల్లా చంపేసేవాడు. అయితే మామూలుగా బొద్దింకను కూడా చంపే ధైర్యం అతనికి లేదు.

సమాజంలో దాదాపు ప్రతీమనిషి ఏదో ఒక మానసిక సమస్యతో వేధింపబడతాడు. ఈ మానసిక సమస్యలలో తీవ్రమైనవి కొన్ని వుంటాయి. వీటికి ఖచ్చితంగా వైద్య సహాయం అందకపోతే ఆ మనిషి సమా జాన్ని ఇబ్బందిపెట్టే శక్తిగా మారతాడు.

కొన్ని చిన్న సమస్యలకు విశ్లేషణే వైద్యం. ఒకతను ఇంటి తలుపులు లేదా బీరువా తాళమైనా సరిగ్గానే వేస్తాడు. అయినా వెయ్యలేదేమోననే అనుమానం అతడిని వేధిస్తుంది. ఫలితంగా సగం దూరం వెళ్ళిన మనిషి వెనక్కు వచ్చి ఆ తాళం మళ్ళీ లాగి చూస్తాడు.

ఇటువంటి సమస్యలను సరైన దృక్కో ణంలో విశ్లేషించి అవగాహన చేసుకోగలిగితే దానినుండి బయటపడ్డట్టే. ఇంకొక విచిత్ర మేమిటంటే చాలామందిని ఒకే రకమైన సమస్య బాధించవచ్చును.

కాని మానసిక వైద్యుడు అందరికి ఒకే పరిష్కారం ఇవ్వడు. కారణం ఆ సమస్య ఉత్పన్నమైన తీరు ఒక్కొక్కరికి ఒక్కోలా వుంటుంది.

కార్తీక్ తన రచనల్లో వీటన్నింటిని విశ్లేషి స్తున్నాడు.

'మనసు' సీరియల్ మాత్రం ఎంత కాల మైనా పూర్తవ్వడం లేదు. దానిని ముగిం చడం రావుగారికి ఏమాత్రం ఇష్టంలేదు. ఎందుకంటే మొన్నటిదాకా అన్ని పత్రికల కంటే అడుగున ఉండే తెలుగుతేజ సర్క్యు లేషన్ ఇప్పుడు వాటన్నిటికంటే ఎక్కువ. ఆ స్థాయి కేవలం ఈ సీరియల్ వల్లే వచ్చింద న్నది పచ్చినిజం. కనుక ఆ సీరియల్‌ని





మరి కొంతకాలం పొడిగించమని పార్వతి కూడా సలహా ఇవ్వడంతో అలాగే చేస్తు న్నాడు.

ఇప్పుడు పార్వతి అతని సెక్రటరీగా కూడా చేస్తోంది. రోజూ కార్తీక్‌కు కుప్పలు తెప్పలుగా ఉత్తరాలు వచ్చేవి. ముఖ్యంగా టీనేజ్ ఆడపిల్లలనుండి కన్నీళ్ళ ఉత్తరాలు వచ్చేవి.

"బాప్‌రే కార్తీ! ఈ అమ్మాయి ఎవరో మిమ్మల్ని పెళ్ళిచేసుకోవాలనుకుంటోందట. లేకపోతే చచ్చిపోతుందట" ఒక ఉత్తరం చదివి చెప్పింది పార్వతి.

"మరింకేం? రిజిస్టర్డ్ మ్యారేజ్‌కి ఏర్పాట్లు చెయ్యి"

"ఏం? వేళాకోళంగా వుందా?"

"ఇందులో తప్పేం వుంది పార్వతీ. సుమతి తన భర్తను తలపై తట్టలో పెట్టు కుని వేశ్య దగ్గరకు తీసుకువెళ్ళలేదా?"

"ఇలా ఉత్తరం రాయగానే పెళ్ళి చేసె య్యడం మొదలుపెడితే నీకు పదహారువేల మందిని చెయ్యాలి"

"భలేగా వుంటుంది కదూ? గోపాలకృష్ణు డిలా నేను వేణువు ఊదుతూ నిల్చుంటే మీరంతా చుట్టూచేరి డాన్స్ చేయచ్చు"

"మిమ్మల్ని జైల్లో పారేయించవచ్చు" చేతిలో తలగడ అతనిమీదకు విసిరి ఉక్రో షంగా అంది పార్వతి.

కొన్ని ఉత్తరాలు చాలా నవ్వు తెప్పించేవి. ఒక అమ్మాయి, రేపు నా పరీక్ష. ఆ సమ యానికి మీరొచ్చి బెస్టాఫ్‌లక్ చెప్పాలి. లేక పోతే పరీక్షకు హాజరు కానని రాసింది.

చాలా ఉత్తరాలు ఇలాగే ఉండేవికానీ ఎక్కువభాగం ప్రేమ, పెళ్ళి మరొకటని సాగేవి. కొన్నిమాత్రం అతని రచనలపై మంచిచెడ్డలు చర్చించేవి. అయితే వీటి శాతం బాగా తక్కువ. ఈ సంవత్సరంలో అతనికి అయిదారు వేలకు తక్కువ కాకుండా ఉత్తరాలు వస్తే అందులో ఇరవై మాత్రం ఫైల్లో దాచాడు.

అన్నిరకాల ఉత్తరాలకు పార్వతే జవా

బులు రాసేది. అతను సంతకాలు పెట్టేవాడు. ఇప్పుడు వాళ్ళు రేకుల షెడ్డునుండి మంచి ఇంట్లోకి మారారు.

పార్వతికి మంచిమంచి చీరలు కొన్నాడు. కొద్దిగా నగలు చేయించాడు. ఆమె ఎప్పుడూ సంతోషంగా వుండాలని అనుక్షణం తాపత్రయపడేవాడు.



హత్యలు, దోపిడీలు, క్రైం థ్రిల్లర్స్ వచ్చేశాయి. కార్తీక్ నవలలను అనుకరిస్తూ కొందరు రాయసాగారు. కానీ అతని విలువ అతనిదిగానే వుంది.

ఓ పత్రికాఫీసులో కలిశాడు త్రిమూర్తులు. అతనిప్పుడు సామాజిక స్పృహ కలిగిన నాటకాల రచయితకాదు. వేడివేడి శృంగార వర్ణనలు చేసే కమర్షియల్ రచయిత. ప్రతీ సీరియల్‌లోనూ విపరీతమైన సెక్స్ రాస్తున్నాడు. అందుకోసమే చదివే పాఠకులు అతనికి వున్నారు. అందువల్ల అతని రచనలు బానే అమ్ముడుపోయేవి.

కార్తీక్ కొత్త సీరియల్ ఒకటి నత్తనడక నడుస్తోంది. దాన్ని గూర్చి మాట్లాడుతూ ఇదే సబ్జక్ట్‌పై ఇంగ్లీషులో వచ్చిన ఓ నవల హిట్టయ్యిందని చెప్పాడు కార్తీక్.

అంతే! మరుసటివారమే ఒక వారపత్రికలో కార్తీక్ సీరియల్ ఒక ఇంగ్లీషు నవలకు కాపీ అని అన్యాపదేశంగా రాశాడతను.

నిజం చీరకట్టేలోగా అబద్ధం ఊరంతా చుట్టివస్తుందన్నట్లు కార్తీక్ ఇంగ్లీషు నవలలు కాపీ చేస్తున్నాడని విమర్శకులు గోల పెట్టసాగారు.

కార్తీక్ ఈ విషయంపై ఎటువంటి కామెంట్ చెయ్యలేదు. ఎందుకంటే ఈ విమర్శకులలో ఎక్కువశాతం ఏ పుస్తకాలూ చదవనివాళ్ళే. అయితే విచిత్రంగా ఈ అబద్ధపు ప్రచారం సాగిన దగ్గరనుండి యావరేజ్ అనుకున్న సీరియల్ సక్సెస్ లిస్ట్‌లో చేరిపోయింది.

అలా ఎందుకు జరిగిందో అతనికి అర్థం కాలేదు. కానీ ఏదో మాస్ సైకాలజీ వుందనిపించింది.

అక్కడినుండి ప్రతి నవలకు ముందుమాటలో సంబంధం లేకపోయినా ఏదో ఒక ఇంగ్లీషు నవలలో ఘట్టం వాడుకున్నానని రాసేవాడు.

ఈ పద్ధతి పార్వతికి నచ్చేదికాదు. కాపీ రచయితగా పేరు పడుతున్నారని బాధపడేది. కానీ ప్రొఫెషనల్ రచయితగా స్థిరపడాలంటే కొన్ని కమర్షియల్ టెక్నిక్ గిమ్మిక్స్‌గా వాడాల్సిందే!

త్రిమూర్తులు చేసిన పని చెప్పినప్పుడు పార్వతి నవ్వి ఊరుకుంది. కార్తీక్‌మాత్రం ఆ విషయం మరిచిపోలేకపోతున్నాడు. పార్వతికున్నంత సహనం అతనికిలేదు. తనను కాపీ రచయితగా ఎవ్వరూ రుజువు చెయ్యలేరు. కానీ త్రిమూర్తుల్ని మాత్రం ఫక్తు కాపీరచయితగా ఋజువుచేసి తీరాలి.

కార్తీక్ సమయం కొరకు ఎదురు చూస్తున్నాడు.



త్రాచుపాముతో కలిసి ఒకే ఇంట్లో బతకవచ్చు. వందలకొద్దీ గొంగళిపురుగులను వంటిపై పాకించుకుంటూ నవ్వుతూ తిరగ

వచ్చు. కానీ మనం అణువణువునా అసహ్యించుకునే మనిషిని ఆప్యాయంగా పలకరించడం అసాధ్యం.

కార్తీక్ జీవితంలో అటువంటి అనుభవం ఆరోజు ఎదురైంది. ఆరోజు అతను ఇంటికి వచ్చేసరికి పార్వతి ఎవరితోనో మాట్లాడుతోంది. ఎవరా అనుకుంటూ లోపలకు వెళ్తే అక్కడ సరోజ మంచంపై పడుకుని పార్వతితో మాట్లాడుతోంది.

కార్తీక్ బిగిసిపోయాడు.

ఎవరిమాటలు ఈటెలపోటులై తన హృదయాన్ని ఛిద్రం చేశాయో, ఎవరిపేరు కూడా స్మరించుకోవడానికి అసహ్యించుకుంటున్నాడో ఆ మనిషి ఇప్పుడు తన ఇంటికి వచ్చి తన మంచంపై పడుకుని దర్జాగా మాట్లాడుతోంది.

మెడపట్టి బైటకు గెంటేద్దామా అన్నంత ఉద్రేకం కలిగిందతనికి. ఇప్పుడు తనకు శత్రువులు ఇద్దరే. ఒకరు సరోజ, మరొకరు నరేష్ మావగారు.

శత్రువుని కూడా ప్రేమించడానికి తను దేవుడు కాదు. పార్వతి అసలే కాదు. తను కార్తీక్. పార్వతికున్నంత ఓర్పు, క్షమాగుణం తనకు లేవు.

"హలో ఫ్రెండ్! మీ కొరకే ఎదురు చూస్తున్నాను" నవ్వుతూ పలకరించింది సరోజ.

ఎంత ప్రయత్నించినా కార్తీక్‌కు నవ్వురాలేదు. అతని ముఖం వజ్రం కంటే కఠినంగావుంది.

"బావున్నావా? " మర్యాద కొరకు పలకరించాడు.

"మీ దయవల్ల బానే వున్నాను. మీ పెళ్ళికి రాలేకపోయినందుకు సారీ చెప్పుకుందామని వచ్చాను"

కార్తీక్‌కు చాలా ఆశ్చర్యంగా వుంది. మనుష్యులు ఎంతగా ఆత్మవంచన చేసుకుంటారో అతనికి ఇప్పుడిప్పుడే అర్థమవుతోంది. లేకుంటే తమ పెళ్ళయిన నాలుగేళ్ళకు ఈవిడగారు క్షమాపణ చెప్పుకుందామని రావడం ఎంత నీచం.

"ఏమిటి చాలా ముక్తసరిగా మాట్లాడుతున్నారు. పెద్ద రచయితనన్న ఫోజా? " ఓరగా చూస్తూ అంది సరోజ.

ఒకప్పుడైతే ఆ చూపుకు వంగి సలాం చేసేవాడు కార్తీక్. కానీ ఇప్పుడు ఎంత సరిపెట్టుకుందామన్నా అసహ్యమే కలుగుతోంది.

పార్వతికి అతని పరిస్థితి అర్థమయ్యింది. వెంటనే లేచి నిలబడి చెప్పింది.

"మీరు వెళ్ళి స్నానం చేసి రండి. మేమిద్దరం డ్రాయింగ్ రూంలో కూర్చుని మాట్లాడుకుంటాం"

తేలికగా ఊపిరి పీల్చుకుని బాత్‌రూమ్ వైపు కదిలాడు కార్తీక్.

సరోజ అసంతృప్తిగా పార్వతివెంట వెళ్ళడం అతనికి తెలుస్తూనే వుంది.

చల్లనినీళ్ళు శరీరంపై పడుతుంటే అతనిలోని కోపం, అసహనం ఆ నీళ్ళ ధారల వెంట కిందకు జారిపోసాగాయి.

అప్పుడు వచ్చిందొక ఆలోచన. సరోజ తనకు చేసిన అవమానానికి బదులు తీర్చుకోవాలంటే తనతో స్నేహం చెయ్యడం ఒక్కటే మార్గం. ఒకప్పుడు తనను ఏమీ చేతకానివాడిగా, ఏమీలేని అనామకుడిగా తీసిపారేసింది. ఈసారి తనవంతు. ఇప్పుడు తను అంతకు రెట్టింపు అవమానం చేస్తాడు.

సరోజ విడాకులు తీసుకున్న యువతి. సరోజ బావ ఆమెతో కాపురం చెయ్యలేకపోయాడు. ఇప్పుడు ఆమె ఒంటరి. అందువల్లనే తనకు వల విసరడానికి ప్రయత్నిస్తోంది. దానిని ఆసరాగా తీసుకుని బదులు తీర్చుకోవాలి. పార్వతికి తెలియకుండా చెయ్యాలి. అప్పుడే ఒక నిర్ణయానికి వచ్చే




శాడు కార్తీక్.

★ ★ ★

'తెలుగుతేజం'లో కార్తీక్ సీరియల్ అయి పోవచ్చింది. మరో రెండువారాలలో 'మనసు' ముగుస్తుందనగా రావుగారు రమ్మని కబురుచేశారు.

"కార్తీ! మన మాస్టర్ పీస్ ఇక ముగిం పుకు వచ్చేసింది"

"అఫ్‌కోర్స్. నేచురల్లీ రావూజీ! మొదలు పెట్టిన ఏ పనికైనా ముగింపు వుంటుంది" వేదాంత ధోరణిలో అన్నాడు కార్తీక్.

"బాస్ నిన్ను మరో సీరియల్ మొదలు పెట్టమంటున్నారు"

"నేనూ అదే అనుకుంటున్నాను. అయితే కొత్త సబ్జక్టకాదు 'మనసు'లో కథనే కంటిన్యూ చేస్తూ రెండో భాగంలా కొత్తన వల రాస్తాను"

"ఎలా? " ఆతృతగా అడిగాడు రావుగారు.

"వివరాలకు వచ్చే సంచిక చూడండి. సీరి యల్ చదవండి అని ప్రకటన ఇస్తాం. ఇలాగే మిగిలిన ప్రకటనలు వుంటాయి. చూస్తుండండి ఖచ్చితంగా ఇది బ్రహ్మాండ మైన సక్సెస్ సాధిస్తుంది. 'మనసు' సీరియ ల్‌ని మించిపోతుంది" ఆనందంగా ఒప్పుకు న్నాడు రావుగారు.

"ఇక రెమ్యునరేషన్ విషయానికి వస్తే ప్రస్తుతం నీవు ఎంత డిమాండ్ చేస్తున్నావో అంత ఇస్తామన్నారు? "

"సారీ రావూజీ! నేను ఎంత డిమాండ్ చేస్తున్నానో అంతకాదు. అంతకు రెట్టింపు ఇవ్వాలి. కాదంటే చెప్పండి. ఈ సీరియల్ నేను అడిగినంత ఇచ్చి వేసుకునే పత్రికలు చాలా వున్నాయి. కాబట్టి ఏ సంగతి త్వరగా తేల్చి చెప్పండి"

రావు పెదవులపైకి చిరునవ్వు తన్నుకువ చ్చింది. టేబుల్‌పైన ఫోన్ దగ్గరకు లాక్కుని నెంబర్ డయల్ చేయసాగాడు.

కార్తీక్ ధీమాగా కుర్చీలో జారబడి టేబు ల్‌పైన పేపర్ వెయిట్‌ని గుండ్రంగా తిప్ప సాగాడు. ఫలితం ఎలా వుంటుందో అతనికి బాగా తెలుసు.

పది నిముషాలు మాట్లాడాక రిసీవర్ హుక్‌పైపెట్టి చెప్పాడు రావు.

"కంగ్రాట్స్ కార్తీక్. యువర్ డీల్ ఈజ్ యాక్సెప్టెడ్"

★ ★ ★

ఆ రెస్టారెంట్ అంతా చీకటిగా వుంది. ప్రతి టేబుల్‌పై రెండు కొవ్వొత్తులు అమర్చి వున్నాయి. కరంట్ లేకపోవడంతో ఏర్పడిన చీకటి కాదది. కావాలనే అలా ఏర్పాటు చేయబడింది. అది అక్కడి పద్ధతి.

ఆ రెస్టారెంట్‌లో తినేవాళ్ళు తింటూ, తాగేవాళ్ళు తాగుతూ హుషారుగా వున్నారు. వాళ్ళు సమాజంలో ఎంత పెద్ద పెద్ద హోదాల్లో వున్నా, పెద్దమనుషులైనా, ఇక్కడమాత్రం చిన్న మనుషుల్లానే ప్రవర్తి స్తారు. వాళ్ళకది తప్పదు. పగలంతా బిజి నెస్‌లో ఏర్పడిన టెన్షన్‌కి ఆమాత్రం రిలాక్సే షన్ కనుక లేకపోతే వాళ్ళకు 'హార్ట్ ఎటాక్ చాలా త్వరగా వచ్చేస్తుంది. ఇంకో విషయం ఏమిటంటే వాళ్ళ బిజినెస్ లావాదేవీల్లో తొంభైశాతం ఇక్కడే సెటిలవుతుంటాయి.

ఒకమూలగావున్న టేబుల్ దగ్గర కూర్చు న్నాడు కార్తీక్. అతనికి ఎదురుగా వున్న ప్లేటులో పుల్కాలు వెజిటబుల్ కర్రీతో నోరూరిస్తున్నాయి. కానీ అతని మనస్సు మాత్రం పక్క టేబుల్‌పై వుంది. అక్కడ ఒక యువతి, ఒక యువకుడు కూర్చుని వున్నారు.

ఆ యువకుడు సూపర్‌స్టార్ రైటర్ అని తనే చెప్పుకునే త్రిమూర్తులు. ఆ అమ్మాయి పేరు రేణుక. చాలా అందమైనది. నీరెం డలో నిగనిగా మెరిసే త్రాచుపామంత అందమైనది.

"నేను చెప్పినపని ఏం చేశారు? " రేణుక అడుగుతోంది.

"నీవు ఇచ్చిన నవల అంతా చదివాను.

మా పబ్లిషర్‌కు చూపించాను. బావుందని అన్నాడు. రేపే ఎగ్రిమెంట్ చేసుకుందాం. డబ్బు కూడా రేపే ఇచ్చేస్తాడు"

"నో సార్" అంది రేణుక. "ఆ నవల నా పేరున వస్తే మా ఆయన నన్ను చంపేస్తాడు. నాకు కేవలం డబ్బు ఇవ్వండి చాలు. అదయినా సర్జరీ చేయించాల్సిన నా బిడ్డను బతికించుకోవడం కోసమే అడుగుతున్నాను"

"కానీ నీ రచన నా పేరుపై ప్రచురించుకోవడం ఏం న్యాయం? "

"అదే మీరు నాకు చేసే గొప్ప న్యాయం. ఈ సంగతి నేను ఎక్కడా చెప్పను. మీరు కూడా చెప్పకండి. ఇది తెలిస్తే మా ఆయన నన్ను నాడబ్బుతోనే తాగొచ్చి చంపేస్తాడు"

దాదాపు ఏడుస్తూ చెప్పింది రేణుక.

"రేణుకా! ప్లీజ్ ఇది పబ్లిక్ ప్లేస్. మీకు కావల్సిన డబ్బు రేపే ఇస్తాను. ఈ నవల మీరు రాసినట్లు ఎక్కడా తెలియనివ్వను సరేనా? " అనునయంగా చెప్పాడు.

అతనికి మనస్సులో చాలా ఆనందంగా వుండి ఉంటుంది, బేవార్స్‌గా ఓ మంచి నవల దొరికినందుకు. శెభాష్! పులి ఎర కోసం వచ్చింది. అంటే బోనులో పడబోతున్నదన్నమాట. ఏదిఏమైనా రేణుక మంచి నటీమణి.

కాస్సేపటికి వాళ్లు కార్తీక్ ముందునుండే వెళ్లారు. త్రిమూర్తులు వెళ్లినప్పుడు అతను తన తల చీకట్లో వుండేలా చూసుకున్నాడు. అయినా డోసుమీద ఉన్న అతనికి అంత గ్రహింపులేదు. ఎటూ చూడకుండా సాగిపోయాడు.

రేణుక మాత్రం కార్తీక్‌ను గుర్తించింది. గుమ్మందాకా వెళ్లాక త్రిమూర్తులు చూడకుండా అచ్చు ఇంగ్లీషు పిక్చర్ స్టైల్లో ఒక ఫ్లయింగ్ కిస్ విసిరింది.

కార్తీక్ చిరునవ్వుతో రిసీవ్ చేసుకున్నాడు.

★ ★ ★

మరో నెల రోజుల తర్వాత త్రిమూర్తులు నవల 'రక్తఛాయ' రిలీజయ్యింది. దానికి ముందుమాట మరో రచయిత కమ్ అసోసియేట్ ఎడిటర్ రాశాడు.

దాని సారాంశమేమిటంటే ఆ నవలని త్రిమూర్తులు తన సొంత మెదడే ఉపయోగించి రాస్తాడనీ కొంతమందిలా ఇంగ్లీషు నవలలు కాపి చేయడనీను!

కార్తీక్‌కు చాలా ఆనందం కల్గింది. అతను అనుకున్న దానికంటే డ్రామా చాలా బాగా జరుగుతోంది.

రేణుక అతని అభిమాని. ఎంత అభిమానమంటే అతని కొరకు రెండు మూత్రపిండాలూ ఇచ్చెయ్యమన్నా మాట్లాడకుండా ఇచ్చేస్తుంది. అతని కోసం ఏమైనా చెయ్యడానికి సిద్ధం. అతనే ఆ రక్తఛాయ నవల రాసి దానిని రేణుకద్వారా త్రిమూర్తులుకు ఇప్పించాడు. ఇక ఆ నవలకు ముందుమాట రాసిన రచయిత కూడా కార్తీక్ చేతిలో మనిషే. అతను రాయమన్నట్లే రాశాడు.

ఆ వారమే 'తెలుగు తేజం' వారపత్రికలో ఒక కొత్త శీర్షిక మొదలయ్యింది. దాని పేరు 'నవల వెనుక నవల'

ఏదైనా నవల కాపి అయితే తగిన ఆధారాలతో దానిని ఆ శీర్షికలో ప్రచురిస్తారు. ఆ రచయిత సమాధానం కూడా ప్రచురిస్తారు. దీని కొరకు రావుగార్ని ఒప్పించడానికి కొంత సమయం పట్టినా పెద్ద కష్టం కాలేదు.

మొదటి వారం కార్తీక్ నవల తరంగంపై విమర్శ రాశారు. ఆ నవల రాబిన్ కుక్ ఫలానా నవలకు కాపీ అని రాశారు.

దానికిందే అతని సమాధానం వుంది.

పూర్వాశ్రమంలో తను రాబిన్‌కుక్ నవల చదివినప్పుడు ఆ థీమ్ మనసులో వుండిపోయిందనీ, దానిని ఆ తర్వాత నవలగా రాశాననీ నవల ముందు పేజీల్లో దీనిని తను

# ఏరిన ముత్యాలు

★ ఈ జీవితం హ్రస్వమైనది. ప్రపంచం యొక్క ఆడంబరాలు క్షణభంగురాలు. అయితే ఇతరులకోసం జీవించేవారే బతికి వున్నవారు. మిగిలిన వారంతా జీవచ్ఛవాలే.

—వివేకానంద

★ ఒక చిన్నారి బాలుని మేధ తోటవంటిది. అక్కడ నీవు నాటిన విత్తనాలు కలుపుమొక్కలుగానో, పుష్పాలుగానో పెరుగుతాయి.. కానీ తప్పితీసేందుకు రెండూ కఠినతరమైనవే.

— పెక్

★ ధనదాహంవలెనే జ్ఞానపిపాస కూడా. ఎంతవున్నా ఇంకా పొందాలనే అభిలాష వుంటుంది.

—స్టెర్న్

★ ప్రపంచంలో విజయం సాధించాలంటే ఎవరు తెలివిగలవాడో కనుగొనటంకంటే ఎవడు మూఢుడో గ్రహించగలిగే సూక్ష్మబుద్ధి గలిగి వుండటం అత్యంత ఆవశ్యకం.

—టాలీరాండ్

★ ఒకళ్లనొకళ్లు చూసుకోవటంకాదు. ఇద్దరూ కలిసి ఏకోన్ముఖంగా చూడటమే 'ప్రేమ' అనిపించుకుంటుంది.

—ఎక్స్‌ఫరీ

★ నిజాయితీపరుడైన వ్యక్తి తన అంతరాత్మ అంగీకరించని పనిని ఎన్నటికీ చేయలేడు.

—హోమ్

★ మాతృహృదయమే బిడ్డకు పాఠశాల గది.

—బీచర్

★ క్రమమైన జ్ఞానం అనే బహుమానమే ప్రపంచంలోని ఉన్నతోన్నతమైన బహుమతి.

—రోజ్‌పాల్

★ ధనార్జనకోసం సద్గుణాన్ని విక్రయించవద్దు. అధికారంకోసం స్వేచ్ఛను అమ్ముకోవద్దు.

—ఫ్రాంక్లిన్

★ సత్యాన్వేషి ధూళికంటే వినయంగా వుండాలి. ప్రపంచం తన పాదాలకింద ధూళిని తొక్కుతుంది. అటువంటి ధూళి కూడా తనను తొక్కేందుకు సత్యాన్వేషి వినమ్రతతో సిద్ధంకావాలి.

—మహాత్మాగాంధీ

సేకరణ: పట్నం శేషంశెట్టి

వివరించాననీ అయితే ఆ ఇంగ్లీషు నవలకు తన రచనకు ఏ సన్నివేశంలోనూ పోలిక లేదనీ, కేవలం థీమ్ మాత్రం సేమ్ అనీ రాశాడు కార్తీక్. దాంతో మరి చర్చలేకుండా పోయింది.

ఆ తర్వాతి వారం త్రిమూర్తులు నవల 'రక్తఛాయ'పై దాడి మొదలయ్యింది. ఒక వైపు రక్తఛాయ కథంతా బ్రీఫ్‌గా వేసి మరో పక్క ఓ ఇంగ్లీషు నవల సారాంశమంతా రాశారు. మక్కికి మక్కి కాపీగా వున్న ఇటువంటి నవలలు రాసే త్రిమూర్తులు తెలుగు సాహిత్యం పరువు తీస్తున్నాడని రాశారు. ఇదంతా ఒక ఉత్తరాల రచయిత పేరుతో జరిగింది. ఈ ఆరోపణకు రచయిత సమాధానం చెప్పలేదని సంపాదకులు రాశారు.

అంతే! ఆ దెబ్బకు త్రిమూర్తులు ఎక్కడా తలెత్తి మాట్లాడలేని పరిస్థితి వచ్చేసింది. కాపీ రచయితగా శాశ్వతంగా అతని ముఖంపై ఒక ముద్రపడిపోయింది. జరిగినదంతా కార్తిక్ పార్వతికి చెప్పాడు. ఆమె ముభావంగా ఉండిపోయింది.

"పారూ! నేను చేసింది తప్పంటావా? "

"తప్పని కాదండీ! మనిషిగా మీకు కోపతాపాలుండటం సహజం. కాని రచయితగా మీరు ఒక రుషి కావాలి. మీ మేధస్సు వక్ర మార్గంలో ఉపయోగించడం మొదలు పెడితే అది వినాశనానికే దారితీస్తుంది"

"అంటే...? " తనేం చెప్పబోతోందో తెలిసి కూడా అడిగాడు.

"అగ్గిపుల్లతో మనకు చాలా ఉపయోగాలున్నాయి. కాని అదే అగ్గిపుల్లతో ఒళ్లు కూడా కాల్చుకోవచ్చు. అవునా? ఇంతవరకు మీరు డాక్టర్ జకిల్. ఇక ఇక్కడినుండి మీలోని మిస్టర్ హైడ్ బయటకు వస్తున్నాడేమో అని భయంగా వుంది. మనం దేవతలం కాకపోయినా ఫర్వాలేదండి. రాక్షసులం కాకుంటే చాలు"

ఒక్క క్షణం మౌనంగా ఉండిపోయాడు.

పార్వతి చెప్పింది నిజం. పచ్చినిజం. తనలోని మిస్టర్ హైడ్ బయటకు వచ్చేస్తున్నాడు. కొద్దికొద్దిగా బయటకు వచ్చేస్తున్నాడు. అది తనకీ తెలుస్తోంది. ఎవ్వరూ చెప్పనక్కరలేదు. వీడిని ఇప్పుడే ఇక్కడే పీక నొక్కేయాలి.

"నీవు చెప్పింది నిజం పార్వతీ. ఇక నుండి ఇటువంటి పనులు చెయ్యను" మన స్ఫూర్తిగా చెప్పాడు.

★ ★ ★

సరోజతో స్నేహం రోజురోజుకు బలపడ సాగింది. సినిమాలు, షికార్లు జోరుగా సాగిపోతున్నాయి. కాని ఆమె పట్ల కార్తిక్ తన కసిని, ద్వేషాన్ని మర్చిపోలేదు. ఆమెను చూడగానే ఆమె అన్నమాటలే గుర్తుకు వస్తున్నాయి. తనకు చేసిన అవమానానికి తగిన శిక్ష సరోజ అనుభవించి తీరాలి. అందుకు తగిన సమయం కొరకు ఎదురు చూస్తున్నాడు కార్తిక్.

ఒకసారి ఒక నవల కొరకు గోవిందంగారి ఊరు వెళ్లవలసి వచ్చింది. కార్తిక్‌కు చాలా ఆనందంగా అనిపించింది. చాలా సంవత్సరాల తర్వాత గోవిందంగారిని, రేఖను కలవబోతున్నాడు.

ఆ ఊరికి ప్రయాణం పూర్వంలానే సాగింది. ముందు రైలు ప్రయాణం తర్వాత బస్సు. అక్కడినుండి జట్కా ఎక్కాలి.

కాని దిగిన తర్వాత అటువంటివి ఏమీ కనిపించలేదు. నడవాలంటే కనీసం పది మైళ్లు నడవాలి. చేతిలో లగేజి ప్రాణం తీస్తోంది. విసుక్కుంటూ నడవసాగాడు. అతనికి చాలా అలసటగా వుంది.

కొంతదూరం వెళ్లాక ఒక చోట గుర్రపు బండి కనబడింది. ఆతృతగా అటువైపు నడిచాడు. బండిలో ఎవ్వరూ లేరు. ఖాళీగా వుంది. చుట్టూ చూశాడు. కాస్త దూరంలో ఒక చిన్న తాటాకు పాకలో ఒక హోటల్ వుంది. బహుశా జట్కాతోలే మనిషి




అందులో వుండి వుండాలి. అటువైపు నడిచాడు.

లోపల ఒక మూలగా ఒక లావుపాటి వ్యక్తి కూర్చుని వున్నాడు. ఎర్రచొక్కా, ఖాకీ రంగు నిక్కరు వేసుకున్నాడు. తన ముందున్న సాంబారు ఇడ్లీని ఆబగా తింటున్నాడు. బహుశా అతనే జట్కా మనిషై వుండాలి.

కౌంటర్‌లో ఒక ముసలివాడు కూర్చుని వున్నాడు. కార్తీక్‌ను చూడగానే లేచి వచ్చాడు.

"రండిసార్ రండి! వేడివేడిగా ఇడ్లీ సాంబారు వున్నాయి. తినండి" చెప్పాడు.

వెళ్లి ఒక బల్లపై కూర్చున్నాడు కార్తీక్. ఇడ్లీ సాంబారు వచ్చాయి. కడుపులో ఆకలి విజృంభించింది. తను వచ్చిన పని మర్చిపోయి తినడంలో పడ్డాడు.

"ఏ ఊరు వెళ్లాలండి? " జట్కా బండ తను అడిగాడు.

తింటూనే ఎక్కడికి వెళ్లాలో చెప్పాడు కార్తీక్.

"గోవిందంగారింటికా? మీరు వాళ్లను చూసి ఎంతకాలమైంది? "

"దాదాపు నాలుగేళ్లు. అప్పుడు వాళ్లింట్లో కొంతకాలం వున్నాను. చాలా మంచి మనుష్యులు"

"అవును. మంచి వాళ్లంటేనే దేవుడికి చాలా ఇష్టం" చెప్పాడతను.

"ఆ తండ్రీ కూతుళ్లు చనిపోయి రెండు సంవత్సరాలయ్యింది"

"ఏం చెబుతున్నావు? " దిగ్భ్రాంతిగా అన్నాడు కార్తీక్.

"నిజమా" మళ్లీ అడిగాడు.

"అవును... నలుగురు కుర్రాళ్లు ఒక అర్ధరాత్రి వాళ్ల హోటల్ తగుల బెట్టారు. ఆ మంటలలో తండ్రీకూతుళ్లు చనిపోయారు"

"కిరాతకం" గొణుక్కున్నాడు కార్తీక్.

"గంజాయి తీసుకున్న వాళ్లకు ఎటువంటి జాలి, దయ ఉండవు" ముసలతను చెప్పాడు.

తింటున్న టిఫిన్ చేదుగా అనిపించింది. వదిలేసి చెయ్యి కడుక్కున్నాడు. ఇక అక్కడి నుండి వెనక్కు వచ్చేశాడు.

గోవిందంగారి మరణం కార్తీక్‌కు మింగుడు పడలేదు. మాదక ద్రవ్యాలపై పూర్తి పరిశోధన చేశాడు. అతని పరిశోధనలో చాలా విషయాలు తెలిశాయి.

పదేళ్ల కిందట ఈ దేశంలో సాధువులు, సన్యాసులు మాత్రమే గంజాయి, నల్లమందు వాడేవారు. మిగిలిన వాళ్లు వాటి మాట ఎత్తడమే అనాగరికంగా భావించేవారు. కాని ప్రస్తుతం బ్రౌన్ షుగర్ కాలేజి స్టూడెంట్స్ ఒక ఫ్యాషన్‌గా వాడుతున్నారు.

ఈ అలవాటు చాలా సాధారణంగా మొదలవుతుంది. సరదాగా మొదలైన ఇది అలవాటుగా మారి ఆ తర్వాత అవసరంగా మారుతుంది.

జీవితంలో ఏదో ఒక సాహసకృత్యం చెయ్యాలని టీనేజ్ పిల్లలలో ఒక బలీయమైన కోరిక వుంటుంది. సరియైన గైడెన్స్ వున్న పిల్లలు ఒక సచిన్ టెండూల్కర్ లానో, ఒక ఉషలానో మారతారు. గైడెన్స్ లేని పిల్లలు ఏదో సాహసం చేస్తున్నామనుకుని ఇలా మత్తు పదార్థాలకో, రౌడీయిజానికో, వ్యభిచారానికో బలయిపోతారు.

ఇప్పుడు డ్రగ్స్ అందరికీ అందుబాటులో వుంటున్నాయి. పొడి రూపంలోగాని, పేస్ట్ రూపంలోగాని, ఇంజక్షన్ రూపంలోగాని ఏదో ఒక రూపంలో పిల్లలకు అందుతున్నాయి.

ఇవి తీసుకున్నప్పుడు ఒక అనిర్వచనీయమైన ఆనందం కలుగుతుంది. మనసు ఏదో లోకాలలో సంతోషంగా విహరిస్తుంది. ఆ మత్తునుండి బయటకు వచ్చాక విపరీతమైన నిస్త్రాణ కలుగుతుంది. నరాలు మాట వినవంటాయి. ఆ మత్తు కొరకు ఏ పనైనా చెయ్యమంటాయి. సమయానికి డ్రగ్స్ దొరకకపోతే మనిషి ఉుంగలు చుట్టుకుపో

తాడు. అప్పుడు వాళ్లతో ఏ పనైనా చేయించవచ్చును.

మగవాళ్లు చిటికెడు హెరాయిన్ కొరకు హత్యలు, దోపిడీలు చేసేస్తారు. ఆడపిల్లలు తేలికగా బట్టలు విప్పేస్తారు.

వీటన్నింటిని బేస్ చేసుకుని ఒక నవల రాశాడు కార్తీక్. మొదట్లో మంచి ఉద్దేశ్యంతోనే మొదలు పెట్టాడుగానీ మామూలుగా మషాలాలు కూరేసరికి ఆ నవల స్వరూపమే మారిపోయింది.

మాదక ద్రవ్యాల వాడకంవల్ల ఎన్ని అనర్థాలు ఉన్నాయో చెబుదామని మొదలుపెట్టిన నవల పూర్తయ్యేసరికి డ్రగ్స్ వాడితే ఎంత బావుంటుందో అనే అర్థం వచ్చేలా తయారైంది.

ఈ రంగంలో వుంటూ మంచి చెడ్డలు బేరీజు వేసుకోవడం అనవసరమని కార్తీక్ అభిప్రాయం. అందుకే అతడు తన మంచి చెడ్డలు మాత్రమే చూసుకున్నాడు.

ఆ నవలపై పెద్ద దుమారం లేచింది. పిల్లలు ఈ నవల చదివి మత్తు పదార్థాలకు అలవాటు పడిపోతున్నారని ఈ నవల బాన్ చెయ్యాలని చాలామంది కోరారు.

కార్తీక్ తన పద్ధతిలో జవాబు చెప్పాడు. విమర్శకులపై అతనికి గొప్ప అభిప్రాయం వుంది. వాళ్లలో చాలామంది తన నవల చదవకుండానే విమర్శిస్తారని అతని ఉద్దేశ్యం. కాకపోతే ఆ విమర్శకులు లేకుండా పొద్దు గడవనంతగా వాళ్లకు అలవాటు పడిపోయాడు.



ఇందిర తన ముందు కూర్చున్న యువతిని ఆసక్తిగా చూసింది.

ఆమెకు ఇరవై మూడు ఇరవై నాలుగేళ్లు వుండవచ్చును. సాధారణంగా వుండే ఆడవాళ్లకంటే ఓ గుప్పెడు పొడవుంది. ఆ పొడుగు ఆమెకు చెప్పలేనంత హుందాతనాన్ని ఇచ్చింది. చెవులకు పెట్టిన లోలకులు ఆమె తలవూపినప్పుడల్లా కదిలి ఆమెకు చిత్రమైన అందాన్ని తెచ్చిపెడుతున్నాయి. గెడ్డంపై పుట్టుమచ్చ బహుశా పెట్టుడిదై వుండవచ్చు. ఆమె సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేస్తోంది. దాదాపు పది వేల రూపాయల విలువ చేసే ఆమె చీర వెనుకగల అవయవాల పొందిక ఎదుటివారి గుండెలను అదరగొడుతుంది.

"డాక్టర్! నాదో చిత్రమైన సమస్య. బహుశా మెడికల్ చరిత్రలోనే అపూర్వమైనది అయి వుంటుంది"

ఇందిర తల వూపింది. సైకలాజికల్ ప్రాబ్లమ్స్‌లో ఇది మామూలే. తమకు వచ్చిన సమస్య వేరెవ్వరికీ రాలేదనుకుంటారు. తామొక్కరమే ఇటువంటి సమస్యతో బాధపడుతున్నామని అనుకుంటారు.

"చెప్పండి! మీ సమస్య విన్న తర్వాత నాకు చేతనైనంత సహాయం చేస్తాను"

"మా నాన్నగారికి ముగ్గురం ఆడపిల్లలం. నేను ఆఖరిదాన్ని. ముగ్గురులోనూ నేనే అందమైన దాన్ని కూడా. పైటవేసిన దగ్గర నుండి మగపిల్లల చూపులు నాపైనే తచ్చాడుతుంటే చాలా గర్వంగా వుండేది. ఒక పెద్ద ఆఫీసర్ పైసా కూడా కట్నం తీసుకోకుండా నన్ను పెళ్లి చేసుకున్నారు. పెళ్లయిన మొదటి సంవత్సరం బాగానే జరిగింది"

హేండ్ బ్యాగ్‌లోనుండి కర్చీఫ్ తీసి నుదుటిపై చెమట బిందువులు సుతారంగా అద్దుకుంది. ఎర్రటి బుల్లిపెదవులను నాలుకతో తడుపుకుని తర్వాత చెప్పింది.

"ఒకనాడు ఆయన యాక్సిడెంట్‌లో చనిపోయారు. నాకు ఒక పాప. దాన్ని అపురూపంగా పెంచుకుంటున్నాను"

ఇందిర ఉలిక్కిపడింది. ఆమె కళ్ళలో విచారానికి కారణం అర్థమయ్యింది. పెళ్ళయిన కొత్తలోనే భర్త చనిపోయిన స్త్రీలు తీవ్రమైన డిప్రెషన్‌కు గురవుతారు. బహుశా ఈమె సమస్య అదే కావచ్చు




టేబుల్ పై వున్న మెడికల్ షీట్‌లో ఆమె పేరు చూసింది.

నమ్రత

ఆమె తిరిగి చెప్పసాగింది.

"నాకు తెలుసు నేను అందగత్తెనని. ఇక ముందు ఈ అందం అడవిగాచిన వెన్నెలకాబోతోందని కూడా తెలుసు. అందుకే మనసు రాయిచేసుకుని పాపపైనే ప్రాణం పెట్టుకుని బతకసాగాను. పెద్ద అక్క వాళ్ళ ఆయన్ని తీసుకువచ్చేదాకా అలాగే వున్నాను"

ఇందిరకు ఆమె సమస్య అర్థంకాసాగింది. జీవితాన్ని జీవించనూ లేక, జీవించకుండా ఉండనూలేక పడే బాధ అది.

"బావ నన్ను ఇష్టపడేవాడు. మెల్లగా నేను కూడా బావవైపు మొగ్గుచూపాను. అక్కకు తెలియకుండా చాలాసేపు మాట్లాడుకునేవాళ్ళం"

నమ్రత చేతిరుమాలుతో ముఖం తుడుచుకుంది. భుజం పైనుండి బయటకు వచ్చిన బ్రా స్ట్రాప్ జాకట్టు లోపలకు సర్దుకుంది. చేతితో నుదుటిపై పడే జుట్టు వెనక్కు తోసుకుంది.

"అయితే మీరు మీ బావగారికి శారీరకంగా లొంగిపోయారా? " ఇందిర సూటిగా అడిగింది.

"లేదు" తల అడ్డంగా తిప్పింది నమ్రత.

ఆమె ముఖం తెల్లగా పాలిపోయింది. ఏదో భయంకర దృశ్యం గుర్తొచ్చినట్లు ఆమె పెదవులు వంకర్లు పోయాయి.

"ఒకరోజు నేను, బావ అలా మాట్లాడుకుంటూ కూర్చున్నాము. హఠాత్తుగా బావ నన్ను దగ్గరకు తీసుకున్నాడు. నేను వద్దంటూనే వున్నాను. కాని తను వినలేదు. నన్ను చుట్టుకుపోతున్నాడు. నేను బావకు అన్నివిధాల లొంగిపోతున్న దశలో జరిగిందది"

ఆమె ఒక్క క్షణం ఆగింది. పైట సరిచేసుకుని బల్లపై వున్న గ్లాసులోని మంచినీళ్ళు గటగటా తాగింది.

"నాకు ఎదురుగా వున్న బట్టలస్టాండు పై వున్న చీర పక్కకు తప్పుకుంది. ఆ ఖాళీలో నా భర్త ముఖం కనిపించింది. ఔను, నిజంగా ఆయనే. నన్ను కోపంగా చూస్తున్నారు. ఆయన కళ్ళనుండి నిప్పులు రాలుతున్నాయి. నేను కెవ్వున అరిచి స్పృహ తప్పాను. ఆ తర్వాత చాలాసార్లు ఆయన నాకు కనిపించారు"

"ఎప్పుడు కనిపించేవారు? " ఇందిర అడిగింది.

"బావ చనువు తీసుకున్న ప్రతీసారి నా భర్త నాకు కనిపించేవారు. నేను భయంతో కేకలు వేసేదాన్ని"

"అంటే కేవలం మీరు పరపురుషుడితో శృంగారంలో పాల్గొనబోయినప్పుడే మీ భర్త ఆత్మ మీకు కనిపించేదన్నమాట"

నమ్రత ఔనన్నట్లు తల వూపింది.

"ఆ సమయంలో మీ భర్త ఇంకెవరికైనా కనబడేవారా? ఐమీన్ మీ బావ ఆ సమయంలో మీతోనే వుండేవారు కదా? మరి ఆయన మీ బావకు కనబడలేదా? "

"లేదు... కేవలం నాకు మాత్రమే కనబడేవారు. ఎంత భయంకరంగా చూసేవారనీ! నాకు వెన్నులో నుండి వణుకుపుట్టేది. ఆ చూపు తల్చుకుంటే నాకు ఇప్పటికీ చెమట పడుతుంది"

ఇందిర కుర్చీలో వెనుకకు జార్లబడి కూర్చుంది. ఒక్క నిముషం కళ్ళు మూసుకుని ఆలోచించింది. ఆ తర్వాత అడిగింది.

"ఇప్పుడు నానుండి మీకు ఏ సహాయం కావాలి? "

"నిజంగా ఆయన దెయ్యం అయ్యారా? నన్ను చంపేస్తారా? " భయంగా అడిగింది.

"దెయ్యాలు లేవు నమ్రతగారూ! అది మీ భ్రమమాత్రమే. ముందుగా మనం ఈ సమస్యలో రెండు ముఖ్యమైన విషయాలు గమనిద్దాం. అందులో మొదటిది మీకు మీ భర్తంటే చాలా ప్రేమ. మీవంటి మధ్యతర

గతి అమ్మాయిని ఏరికోరి చేసుకున్న అంద గాడాయన. అందువలన ఆయనపై కృతజ్ఞ తాభావం మీ నరనరాల్లోనూ నిండివుంది. దాని మూలంగానే ఆయన చనిపోగానే మీరు తీవ్రమైన డిప్రెషన్‌కు గురయ్యారు"

ఒక్కక్షణం మౌనంగా ఆమెనే చూస్తూ కూర్చుంది ఇందిర. ఇక ఇప్పుడు అసలు విషయంలోనికి రావాలి. నమ్రత ఏమాత్రం బాధ పడకుండా చెప్పాలి. జాగ్రత్తగా ఆమె ఫీలింగ్స్ గమనిస్తూ చెప్పసాగింది.

"రెండవ విషయం మీకు మీరంటే చాలా ఆరాధన. దీనిని సైకాలజీ పరిభాషలో నార్సిజం అంటారు. మీ అందాన్ని అందరూ గుర్తించాలనే తాపత్రయం మీ ప్రతీచర్యలోనూ కనబడుతుంది. ఉదాహర ణకు నా ఎదురుగా కూర్చుని మీరు ఇప్ప టికి నాలుగుసార్లు జుట్టు సరిచేసుకున్నారు. ఆరుసార్లు పైట సర్దుకున్నారు. రెండుసార్లు భుజం దగ్గర పైకి కనబడుతున్న బ్రా స్ట్రాప్‌ని లోపలకు నెట్టుకున్నారు"

నమ్రత ఉలిక్కిపడి ఏదో అనబోయింది. ఇందిర ఆమెను వారించి తిరిగి చెప్పసా గింది.

"నిజం ఎప్పుడూ చేదుగా వుంటుంది. కాని తప్పదు కదా? ప్రధాన మంత్రయినా డాక్టర్ దగ్గరకు వెడితే చొక్కా విప్పవలసిం దేకదా? "

ఆ మాటలకు నమ్రత మెత్తబడింది. డాక్టర్ చెప్పిన దానికి తల వూపింది.

"మీ భర్త చనిపోయాడనేసరికి మీకు మీమీద జాలి ఎక్కువైపోయింది. మీ అందం అంతా వృధా అనే బెంగపట్టు కుంది. ధానిని తీర్చుకోవడానికి మీకు అందుబాటులో మీ పెదబావ దొరికారు. నిజంగానే తెగించబోయారు"

నమ్రత తల వంచుకుని కూర్చుంది. ఆమెకు సిగ్గనిపిస్తోంది.

"కాని మీలో వున్న మీ ఆడ మనస్సు మీకు సహకరించడంలేదు. అది మిమ్మల్ని మీ భర్త రూపంలో హెచ్చరిస్తోంది. లేదా మరోరకంగా కూడా చెప్పవచ్చును. మీ భర్తపై మీకుగల కృతజ్ఞతాభావం మిమ్మల్ని కట్టేసింది. నిజంగా ఏమీ జరగనందుకు మీరు సంతోషించాలి. ఏమైనా జరిగితే మిమ్మల్ని మీరు క్షమించుకోలేక ఆత్మహత్య చేసుకుందురు. జరిగినదంతా పీడకలలా మర్చిపొండి. పాపకోసమే బతకండి. మీ బావగారికి దూరంగా వుండండి. భవిష్య త్తులో మీ భర్తను మర్చిపోగలిగితే మరో పెళ్ళి చేసుకోండి. అక్రమ సంబంధాలు పెట్టు కోవడానికి మీ మనస్సు సిద్ధంగా లేదు"

నమ్రత ముఖంలో అంతవరకు వున్న దిగులు చేత్తో తీసేసినట్లు పోయింది.

"మీరు చెప్పినట్లే వింటాను డాక్టర్" మన స్ఫూర్తిగా చెప్పింది.

"డిప్రెషన్ తగ్గడానికి మందులు రాస్తు న్నాను. క్రమం తప్పకుండా వాడండి"

"నేను మళ్ళీ రావాలా డాక్టర్? "

"పదిహేను రోజుల తర్వాతరండి. చాలా చిన్న వ్యాధి. తొందరగానే తగ్గిపోతుంది. మందులపై కంటే మీపై మీరు ఎక్కువ ఆధారపడండి. ఎటువంటి ప్రలోభాలకు లొంగవద్దు. అది తాత్కాలికంగా మీకు ఉప శమనం ఇచ్చినా లాంగ్‌రన్‌లో కీడు చేస్తుంది. ఎందుకంటే...? " ఆగి నవ్వి చెప్పింది. "మీరు ఒక మంచి అమ్మాయి గనుక"

నమ్రత కూడా నవ్వేసింది.

ఆమె అక్కడినుండి బయటకు వెళ్ళిపో యింది.

'ఒకరకంగా ఈమె అదృష్టవంతురాలు. డాక్టర్ దగ్గరకు కాక ఏ భూతవైద్యుడి దగ్గ రకో వెళ్ళి వుంటే ఆమె మానసిక స్థితిని వాళ్ళు మరింత దిగజార్చేవారు' అనుకుంది డాక్టర్ ఇందిర.

తలుపు తెరుచుకోవడంతో తన ఆలోచన లనుండి బయటకు వచ్చేసింది ఇందిర. మరో పేషెంట్ లోపలకు వస్తున్నారన్న




మాట.

కుర్చీలో సర్దుకుని కూర్చుంది.

శైలజ లోపలకు వచ్చింది.

"హాయ్ శైలు! ఎలా వున్నావ్?"

"బాగానే వున్నాను డాక్టర్" హీన స్వరంతో చెప్పింది శైలజ.

"ఏం? రాత్రి మళ్ళీ ఏమైనా...?"

ఔనన్నట్లు తల వూపింది శైలజ. ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"రాత్రి నా బెడ్‌రూంలోనికి ఎవరో వచ్చారు డాక్టర్. ఎప్పటిలాగానే నన్ను అను కరిస్తూ నేను ఏం చేస్తే అది చేస్తున్నారు డాక్టర్. అచ్చు కార్తీక్ నవల 'మృత్యుక్రీడ'లో జరిగినట్లే జరుగుతోంది.

"శైలూ! నీదంతా అనుమానం. లేదా వట్టి భ్రమ. మన కంటికి కనిపించేదాన్ని మాత్రమే నమ్మాలి. రచయితలు రాసిన దంతా నిజం కాదు. మరణం తర్వాత జీవితం లేదు. దెయ్యాలు, ఆత్మలు అంతా ట్రాష్"

శైలజ మాట్లాడకుండా కూర్చుంది. తన మాటలు ఆమెకు రుచించడంలేదని అర్థమ వుతూనే వుంది. వెంటనే టాపిక్ మార్చింది.

"ఈరోజు కార్తీక్‌కు సన్మానం తెలుసా?"

"తెలుసు డాక్టర్. దానికి ముఖ్యఅతిథి మీరేనట కదా?" ఆనందంగా అంది శైలజ.

ఆమెకు కార్తీక్‌పై వల్లమాలిన అభి మానం. అతని పుస్తకాలన్నీ వదలకుండా చదువుతుంది. వాటిలో రాసినదంతా నిజ మని నమ్మి భ్రమలలో మునిగి తేలు తుంది.

ఇందిరకు బాధగా అనిపించింది. యువ తరాన్ని తప్పుదోవ పట్టించే పుస్తకాలు రాసే రచయితల్లో ఒకరు తన చిన్ననాటి స్నేహి తుడు. నిజానికి ఇందిర కూడా కార్తీక్‌ను వ్యక్తిగా అభిమానిస్తుంది. అటువంటి టాలెంటున్న రచయితలు అరుదని ఆమె నమ్మకం. కాని ఏం లాభం?

కార్తీక్ దారి తప్పిన మేధావి. దాశరథి గేయం గుర్తుకు వచ్చింది.

"తిరిగే భూగోళాన్ని ఆపేయండి. దిగిపో తాన్నేను.

మానవత వసించవలసినచోట దానవత సహించలేను.

మేధావులనబడేవారి వక్ర భాష్యాలు బాధలన్నింటినీ సృష్టించే విషబీజాలు. సవ్యంగా ఆలోచించేవాడు లేనినాడు సవ్య సాచులవల్ల ఈ లోకానికి కీడు"



సభ అనుకున్న సమయానికే ప్రారంభ మయింది. ముందుగా కార్తీక్ నవల 'మన సు'లోని సైకియాట్రిస్ట్ పాత్ర పరిచయం ప్రోగ్రాం జరిగింది.

కార్తీక్ అన్యమనస్కంగా వున్నాడు. అతని పక్కన కూర్చుని దాదాపు అతనిపై వాలిపోతూ ఏదేదో మాట్లాడుతోంది సరోజ.

"హల్లో బావున్నారా?" ఎవరో పలకరిస్తే అటు చూశాడు కార్తీక్.

ఎదురుగా ఇందిర నిలబడి వుంది. ఆమె వెనుక ఒక పోలీస్ ఆఫీసర్ నిలబడి వున్నాడు.

"రండి కూర్చోండి" పక్కనున్న కుర్చీలు చూపిస్తూ చెప్పాడు.

ఇందిరపై ఎంత ఆపేక్ష వున్నా బయట పడే పరిస్థితిలో లేడు తను. తన పొజిషన్ ఇందిరకు చూపించాలనేదే అతని కోరిక. ఆ విషయం ఇందిరకు కూడా అర్థమవుతోంది.

పండువెన్నెలను, పసిపాప నవ్వును చూసి పరవశించేవాడు ఒకనాటి కార్తీక్. వెన్నెలైనా, నవ్వులైనా తన కొరకే విరియాల నుకుంటున్నాడు ఈనాటి కార్తీక్...

"యువార్ గ్రేట్ కార్తీ! జీవితంలో కష్ట పడి పైకొచ్చి భావితరాల వారికి ఆదర్శంగా నిలబడ్డావు" అతని ఇగో తృప్తిపడేలా అంది ఇందిర.

కార్తీక్ ముఖంలో ఆనందం తొణికిసలా డింది.

"చెల్లాయ్! ఇది అన్యాయం. నన్ను పరి చయం చేస్తానని తీసుకొచ్చి..." ఇందిర పక్కనున్న పోలీస్ ఆఫీసర్ అన్నాడు.

"కార్తీ! మీట్ మై కజిన్ వినోద్. ఇక్కడే పనిచేస్తున్నాడు"

"గుడీవినింగ్ సార్. నా పేరు మా చెల్లాయి చెప్పింది కదా? వినోద్. సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌ని. ఈమధ్యే ఈ ఊరు ట్రాన్స్ ఫరై వచ్చాను. ఇంకా పెళ్ళికాలేదు. బ్రహ్మ చారిని" గలగలా మాట్లాడాడు వినోద్.

"విజయవాడనుండి చాలా ఉత్తరాలు రాసారు కదా?"

"అవును సార్. నేను మీ వీరాభిమానిని. మీ నవలల్లో హీరోల్లా గొప్ప పేరు తెచ్చుకో వాలన్నది నా ఆశ"

కార్తీక్ శరీరంలో అదోరకమైన పులక రింత కలిగింది. తన పాత్రల్లో రవితేజ పాత్ర చాలా పేరు గడించింది అని తెలుసు. కాని ఓ పోలీస్ ఆఫీసర్ తాను రవితేజను కావాలని కలలుకనేంత పేరు సంపాదించిందనుకోలేదు.

నవమాసాలు మోసి పురిటినొప్పులు భరించి కన్నబిడ్డ ఎంతో అందంగా వుందని పదిమంది మెచ్చుకుంటే ఆ తల్లికి గర్వంగా వుండదా?

కార్తీక్ కూడా అలాగే గర్వపడుతున్నాడు. మనసులో తనకు తానే చెప్పుకుంటు న్నాడు.

"ఐ యామ్ గ్రేట్. కార్తీక్ ది గ్రేట్"

"కార్తీ! ఈవిడ నీకు తెలుసా?" సరోజ అడిగింది.

"షి ఈజ్ మై ఫ్రెండ్" చెప్పాడు కార్తీక్.

తామిద్దరి అనుబంధాన్ని మాటలలో ఎలా చెప్పాలి? చెబితేమాత్రం ఎవరికి అర్థ మవుతుంది. అతని కళ్ళలో అభిమానం తొణికిసలాడింది. అది ఇందిర మనస్సును కుదిపేసింది.

"మీ మిసెస్ ఏంచదివారు?" సరోజను ఉద్దేశించి అడిగింది ఇందిర.

"సారీ, ఈమె నా భార్యకాదు. నా అభి మాని" చెప్పాడు కార్తీక్.

"మీ మిసెస్ పేరేమిటి?"

"పార్వతి. డిగ్రీవరకు చదివింది. నేను ఇంతవాడిని కావడానికి ఆవిడే నా వెనుక వున్న శక్తి" చెప్పాడు.

ఈ మాటలు అతని హృదయంలోనుండే వచ్చాయి. కానీ అవి సరోజను బాధపె ట్టాయి. ఆమె ముభావంగా కూర్చుండిపో యింది. కార్తీక్ ఆమెను పట్టించుకోలేదు.

వినోద్ ఏదో అడుగుతుంటే సమాధా నాలు చెబుతూ వుండిపోయాడు.

"మీ కథలు చాలా బావుంటాయి సార్. కానీ ఈమధ్య మీరు కథలు రాయడం మానేశారు"

"నవలా ప్రక్రియ వచ్చాక కథల ప్రాముఖ్యం కొంత తగ్గింది. అయినా మావంటి వాళ్ళం రాస్తూనే వున్నాం కదండి. పైగా పత్రికలు నానుండి ఎక్కు వగా నవలలే ఆశిస్తాయి"

నిజానికది చాలా ఆందోళన కలిగించే సమస్య. నవలలు వచ్చాక కథ తన వాడిని,




వేడిని కోల్పోయింది. నవలలు రాయడం ప్రారంభించకముందు కార్తీక్ రాసిన కథలు పుస్తకంగా ప్రచురిస్తే అది ఒకటికి రెండు సార్లు ప్రచురింపబడింది. కొన్ని ఇతర భాష లలోకి అనువదింపబడి ప్రశంసలు పొందాయి.

ఆ తర్వాత కార్తీక్ కథలు రాయడం మానేశాడు. ఒక థీమ్‌ని పదిపేజీల కథగా రాయడం కంటే మూడువందల పేజీల నవ లగా రాస్తే ఆర్థికంగా లాభం!

ఆమధ్య ఒక వారపత్రిక ఉగాది సంద ర్భంగా ప్రముఖ రచయితలందరినుండి ఒక్కో కథ అడిగితెచ్చి ప్రచురించింది. కార్తీక్ కూడా ఒకటి ఇచ్చాడు. తర్వాత చూసుకుంటే మిగిలిన కథలకంటే తన కథ పరమ బేవార్సుగా తోచింది. దానినిబట్టి అతనికి అర్థమైంది తాను కథాప్రక్రియపట్ల ఎంత నిర్లక్ష్యంగా వున్నాడో. ఆ తర్వాత అతను కథలు రాయలేదు.

నిర్వాహకులు కార్తీక్‌ను, ఇందిరను వేదిక పైకి ఆహ్వానించారు. ఆ తర్వాత వక్తలు మాట్లాడటం మొదలుపెట్టారు. ప్రతీ ఒక్కరు కార్తీక్‌ను గొప్ప రచయితగాను, ఇందిరను గొప్ప డాక్టర్‌గానూ పొగడటమే పనిగా పెట్టుకున్నారు.

కార్తీక్‌కు ఇదేమీ నచ్చడంలేదు. కుర్చీలో అసహనంగా కదిలాడు. చుట్టూ పదిమందీ చేరడం మొదలుపెట్టాక అతనికి ఎవరిమా టలు వినబుద్ధికావడంలేదు. అందరూ తను చెప్పేది మాత్రమే వినాలనిపిస్తోంది. తన లోని లోపం తనకి కూడా తెలుస్తోంది. కానీ బయటపడడానికి మాత్రం ప్రయత్నిం చడంలేదు.

తర్వాత ఇందిరను మాట్లాడమని ఆహ్వా నించారు.

అప్రయత్నంగా కార్తీక్ సర్దుకు కూర్చు న్నాడు.

ఇందిర ఇప్పుడు ఒక గొప్ప డాక్టర్. ఆమె తన రంగంలో దేశంలోనే ప్రముఖుల్లో ఒకత్తె!

ఇందిర మెరుపుతీగలా లేచింది. ఆమె మైకు దగ్గరకు రాగానే అంతా నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దంలో ఆమె కోకిల కంఠం అలలు అల లుగా వ్యాపిస్తోంది.

"రచయిత కార్తీక్‌గారంటే నాకు చాలా ఇష్టం. అయితే 'మనసు' ఆ తర్వాతి నవ లలు రాసిన కార్తీక్ కాదు. అంతకుముందు కథలు, నవలలు రాసిన కార్తీక్ అంటే నాకు చాలా ఇష్టం. దురదృష్టవశాత్తు సస్పెన్స్, థ్రిల్లర్స్ రాసే ఈ కార్తీక్ మాత్రమే మనకు మిగిలారు. తెలుగు నవలకు అంతర్జాతీయ కీర్తిని తీసుకురాగలిగే ఆ కార్తీక్‌ను ఈ కమ ర్షియల్ ట్రెండ్ హత్యచేసింది"

నిశ్శబ్దంగా వున్న సభలో ఒక్కసారిగా కలకలం మొదలయ్యింది. కార్తీక్ పెదవులు కోపంతో బిగుసుకున్నాయి. అయితే అందరూ తననే చూస్తున్నారని గమనిం చాక పెదవులపైకి చిరునవ్వు తెచ్చుకు న్నాడు.

తను ఈనాడు తెలుగునాట ప్రముఖ రచ యితలలో ఒకడు. ఈ స్థాయికి చేరుకు న్నాక ఎదుటివాడిపై కడుపులో ఎంత ద్వేషం రగులుతున్నా పైకి చిరునవ్వుతో మాట్లాడడం అలవాటు చేసుకోవాలి. అందుకే ముఖంలో ఏమాత్రం మార్పు రాకుండా జాగ్రత్తపడ్డాడు.

"మీ అభిమాన రచయితను విమర్శిస్తు న్నానని మీకు బాధ కలుగవచ్చు కానీ అలా విమర్శించే హక్కు నాకుంది. అదే మంటే కార్తీక్ నా బాల్యమిత్రుడు. స్నేహి తులు తప్పుదారిలో పడితే సరిదిద్ద వలసిన బాధ్యత మనపై వుంటుందికదా? పైగా ఇవి నేను కొత్తగా చేస్తున్న ఆరోపణలు కావు. అందరూ అంటున్నవే. మెదడుమే డకు తెరిచిన వెలుగుల కిటికీ పుస్తకం. మనసుపిట్టకు తొడిగిన అంజనాల రెక్కలు పుస్తకాలు. ఆలోచన ప్రకృతి ఇచ్చింది. అక్షరం మనిషి నేర్చింది. ఈ రెంటినీ చేర్చితే పుస్తకం. ఘనీభవించిన గతాలను




తప్పు తీసుకోవడానికి పుస్తకం కంటే మంచి సాధనం వుందా?

"అటువంటి పుస్తకం ఎలా వుండాలి? శర్వాణీదేవి ధరించిన మల్లికాహారంలా వుండాలి. వాగ్దేవి పాదాలముందరి మరా ళంలా వుండాలి.

"కానీ నేటి పుస్తకాలు ఎలా వుంటు న్నాయి? సముద్రం ఘోషిస్తుంది. వెన్నెల జల్లుజల్లులుగా తడుపుతుంది. గాలి మృదు వుగా తాకి హాయి గొలుపుతుంది.

ఆ సముద్రం ప్రళయభీకర భీభత్సకారిణి అయితే,

ఆ వెన్నెల కాల్చేస్తుంటే,

ఆ గాలి ప్రళయ ప్రభంజనంలా మారితే భరించగలమా?"

ఒక్కక్షణం ఆగింది. జనం ఎవ్వరూ మాట్లాడలేదు. మౌనంగా ఆమె చెప్పేది వింటున్నారు. అందరూ తను చెప్పేది వింటుండటం గమనించాక తిరిగి చెప్పసా గింది. "మొన్నీమధ్య చదివిన ఓ కథలో ఒక రచయిత రాశారుగదా... 'బామ్మగారు పట్టుచీరలు కడితే, కూతురు పూలచీరలు కడుతుంది. మనవరాలు జీన్స్‌వేస్తుంది. కాలానుగుణంగా మార్పు తప్పదు' అన్నారు.

ఆలోచించండి. సమాజం మారుతుంది. నిజమే... కానీ నైతిక విలువలలో ఏమైనా మార్పు వుందా?

ఎందుకని రామాయణాన్ని, బైబిల్‌ని, ఖురాన్‌ని అంత పవిత్రంగా చూస్తున్నాం? రామాయణాన్ని ఒక సైన్స్‌ఫిక్షన్‌గానూ, బైబిల్‌ను ఒక సాంఘిక నవలగానూ, ఖురా న్‌ను మరొక రకంగానూ ఎందుకు చదవలే కపోతున్నాం?

ఎందుకంటే మన బాహ్యస్వరూపాలు మారాయిగానీ అంతర్‌చేతనలు మారలేదు.

సరస్వతీదేవికి స్లీవ్‌లెస్ జాకట్టు తొడిగి, విస్కీగ్లాసు చేతికి ఇచ్చేస్థాయికి మనం దిగ జారలేదు"

మొత్తం హాలంతా సూది కిందపడితే వినిపించేంత నిశ్శబ్దంగా వుంది. నన్ను పరులకు అమ్మేస్తావా అంటూ పోతన్నను ప్రశ్నించే వాగ్దేవిలా కనబడుతోంది ఇందిర. కార్తీక్‌కు అరచేతులు సైతం చెమటలు పట్టాయి.

"కార్తీక్‌గారి పాత రచనలు చదవండి. మీరు ఎంత కష్టంలోవున్నా సరే మీ మనస్సు రెక్కలు వచ్చిన విహంగంలా ఎంత హాయిగా ఎగురుతుందో గమనిం చండి. అదే ఇప్పుడు వస్తున్న సీరియల్ చదవండి. తేడా నేను చెప్పక్కర్లేదు, మీకే తెలుస్తుంది. కార్తీక్‌గారిపై అసూయతోనో కక్షతోనో నేను ఈ మాటలు చెప్పడంలేదు. ఆయనలో ఒక అద్భుతమైన రచయిత వున్నాడు. ఈ కమర్షియల్ అవుట్‌లుక్ పక్కన పెడితే దేశంమొత్తంపైన తెలుగు వాళ్ళు గర్వంగా తలెత్తుకునే రచనలు చేయ గలరు. అందుకే ఈ రకమైన మేలుకొలుపు పాడుతున్నాను. ఈ అవకాశం ఇచ్చిన మీకు నా కృతజ్ఞతలు తెలియచేసుకుంటున్నాను"

ఇందిర వచ్చి కూర్చుంది. ఆ ప్రదేశ మంతా గుసగుసలతో నిండిపోయింది.

కార్తీక్ మనస్సంతా ఆమె మాటలు ఎలా తిప్పికొట్టడం అనేదానిపైనే వుంది. అతని నుదుటిపై స్వేదబిందువులు ముత్యాలరా సుల్లా పేరుకున్నాయి. పక్కకు చూశాడు. సరోజ చేతివేళ్ళకున్న గోళ్లరంగును పరీక్షగా చూసుకుంటోంది.

కార్తీక్‌కు తనపైన తనకే కోపం వచ్చింది. ఈ యాభైఎనిమిది కిలోల అందమైన మాంసంముద్దకు బదులుగా పార్వతిని తీసుకువస్తే ఈ సమయంలో చక్కని సల హాలు ఇచ్చేది. ఈ బుద్ధి ముందే వుండా ల్సింది. ఇప్పుడనుకుని ఏంలాభం?

లేచి నిలబడ్డాడు కార్తీక్. వెంటనే చప్ప ట్లతో ఆ ప్రదేశం దద్దరిల్లిపోయింది. మైక్ ముందుకు నడిచి గొంతు సవరించుకు న్నాడు.

మరుక్షణం ఆ ప్రదేశం నిశ్శబ్దమైపో యింది.

"సభకు నమస్కారం. నాముందు చాలా మంది ప్రసంగించారు. కొందరు నన్ను ప్రశంసించారు. కొందరు విమర్శించారు. అందరికీ నా ధన్యవాదాలు. లోకంలో మంచి, చెడు అనేవి వేరుగా లేవనీ, మన ఆలోచనా విధానాన్ని బట్టే అవి రూపుదిద్దు కుంటాయని నా అభిప్రాయం. నేను హత్య లెలా చెయ్యాలో చెప్పడంలేదు. హంతకు డిని ఎలా ఎదుర్కోవాలో చెబుతున్నాను. డ్రగ్స్ వాడమని చెప్పడంలేదు. అవి వాడితే ఏమవుతుందో చెబుతున్నాను. చూసేవాళ్ళ దృష్టిని బట్టి ఒక వస్తువుయొక్క స్వరూప స్వభావాలు మార్పు చెందుతాయి. దానికి నేనేం చెయ్యగలను? ఒక్కటిమాత్రం నిజం. సమాజానికి ఉపయోగపడే రచనలు మాత్రమే నేను చేస్తున్నాను"

తనెంత చీప్‌గా మాట్లాడాడో అతనికి తెలుస్తోంది. అయినా ఆ పరిస్థితిలో అత నికి అంతకంటే గత్యంతరంలేదు. మిగిలిన కార్యక్రమం అంతటా కార్తీక్ అన్యమనస్కం గానే వున్నాడు.

ఇందిర కూడా అలాగే వుంది.

కార్యక్రమం ముగిశాక బైట పోర్టికోలో కార్తీక్ కారు ఎక్కబోతుండగా వచ్చింది ఇందిర.

కొద్ది నిముషాల క్రితం ఆమెపై ఆగ్ర హంతో మండిపడ్డాడు. ఇప్పుడు ఆమెను చూస్తే ఆనందమే కలిగిందతనికి.

"కార్తీ! నీతో ఏకాంతంగా మాట్లాడాలి. వీలవుతుందా? "

కార్తీక్ తలతిప్పి సరోజవైపు చూశాడు. అప్పటికే ఆమె కపోలాలు ఎర్రబడ్డాయి. కాలితో నేలను గట్టిగా తన్ని అక్కడినుండి వెళ్ళిపోయింది.

కార్తీక్ ఆమెను లెక్కచెయ్యలేదు. కారు తాళం చెవులు ఇందిరకు ఇచ్చేసాడు. ఆమె పక్కనే మౌనంగా కూర్చున్నాడు.

ఇందిర నిదానంగా కారు నడుపుతోంది. మనిషి వ్యక్తిత్వం తెలియచేసే అంశాలలో డ్రైవింగ్ ఒకటి. ఇప్పుడు ఇందిర కారు నడి పేతీరు ఆమె నిర్భీతికి, ఎన్ని సమస్యలొ చ్చినా తొణకని ఆమె మనో నిబ్బరానికి ప్రతీక.

★ ★ ★

కారు వెంకటేశ్వరస్వామి ఆలయందాకా వచ్చింది. కార్తీక్‌కు ఆశ్చర్యంగావుంది. ఆమె తనను ఇంటికి తీసుకువెడుతుందనుకు న్నాడు. ఇలా గుడికి తెస్తుందనుకోలేదు.

అతని ఆలోచనలు గమనించినట్లు చెప్పింది.

"దేవుడి సన్నిధిలో నీతో మాట్లాడవలసి నవి వున్నాయి కార్తీ! ఆ తర్వాత మా ఇంటికి వెడదాం"

అప్పుడే చీకట్లు ముసురుకుంటున్నాయి. దేవాలయమంతా ఖాళీగా వుంది. ఆ ఆల యంలో ఒక మూలకు వెళ్ళి కూర్చున్నారు ఇద్దరూ. ఆ ప్రదేశమంతా ఓ ప్రత్యేకమైన అస్థిత్వంతో అలరారుతోంది.

నెమ్మదిగా వీచేగాలి, ఆ గాలి తెచ్చే సాంబ్రాణి సువాసన, ఎదురుగా కనిపించే గరుడవాహనం, అప్పుడప్పుడు మ్రోగే చిరు గంటలు.

హఠాత్తుగా తాను దేవుడిని తల్చుకుని చాలాకాలం అయిందన్న విషయం గుర్తొ చ్చింది కార్తీక్‌కు. అంతకుముందు అతను దారిద్ర్యంలో వున్నప్పుడు రోజూ గుడికి వచ్చేవాడు. ఇప్పుడు అసలా దేవుడే గుర్తుకు రావడంలేదు.

"ఎలా వున్నావు? " అడిగాడు.

ఇందిర నవ్వింది. "చూస్తూనే వున్నా వుగా. జీవితంలో తరగని కీర్తిప్రతిష్ఠలు సంపాదించాలన్న కాంక్ష నీకెంతవుందో నాకూ అంతే వుంది. అందుకే అందరి ఆడ వాళ్ళలా పెళ్ళి, పిల్లలు అనకుండా నా రంగంలో నేను కృషి చేస్తున్నాను"

"దేనికైనా పూర్వజన్మ సుకృతం కావాలి.




ఇందూ! నా వృత్తిలో నాకు నా భార్య, పబ్లిషర్స్ సహాయపడతారనే వాదన వుంది. నీవు మాత్రం వన్‌మాన్ ఆర్మీ వంటిదానివి కదా? "

"ఇతరులు సాయం చేసినంత మాత్రాన నీవు ఇప్పుడు వున్న స్థానం చేరడం ఎవ్వరికీ సాధ్యంకాదు కార్తీ. దానికి చాలా దీక్ష, పట్టుదల కావాలి"

గుళ్లో నుండి ఎవరో మ్రోగించిన గంట లయబద్ధంగా వినిపిస్తోంది. వాళ్లిద్దరిమధ్య కాసేపు మౌనం చోటుచేసుకుంది. చిత్రమేమిటంటే ఆ మౌనం కూడా కార్తీక్‌కు ఆనందాన్నే ఇస్తోంది.

"కార్తీ! విష్ణుమూర్తి అంతటివాడికే ఆయన గొప్పతనమంతా ఆలుబిడ్డలవల్ల వచ్చింది అనే అపవాదువుంది. తెలుసా? "

కార్తిక్ నవ్వాడు.

"ఇంకా చిన్నప్పటి మామిడి పండులానే మాట్లాడుతున్నావు" చెప్పాడు.

నవ్వింది ఇందిర. సన్నజాజుల పరిమళంలా, తొలకరి జల్లులా, పసిపాప కేరింతలా, మనస్సుకు హఠాత్తుగాతోచే ఆనందంలా ఇందిర నవ్వు చాలా హాయిగా వుంది. ఓ పద్యం నెమ్మదిగా చదివింది.

కోయిలకు కమ్మని కంఠం, చిలుకకు అందమైన శరీరం, లేడికి చూడ చక్కని కన్నులు ఉన్నాయి. ఆడదానికి వీటితోబాటు అందంగా సిగ్గుపడటం కూడా ఉంది.

"కార్తీ! నీకు గుర్తుందా చాలాకాలం కిందట ఇటువంటి దేవాలయంలోనే నిన్ను కార్యోన్ముఖుడిని చేశాను. అప్పటికి నేను చాలా చిన్నదాన్ని. అందువల్ల సరిగ్గా చెప్పలేకపోయాను. అదే ఇప్పుడైతే నీవు సరియైన మార్గంలోనే పైకి రావాలని చెప్పేదాన్ని"

కార్తీక్ ఏదో చెప్పబోయాడు. ఆమె వారించింది.

"నీ దారి మంచిదన్న అభిప్రాయం నీలో బలపడిపోయింది. నేను నిన్ను ఆ దారి నుండి బయటకు రమ్మని అడగను. నీ బాల్య స్నేహితురాలిగా ఒక్క వరం అడుగుతాను. ఇస్తావా? "

మౌనంగా తల వూపాడు కార్తీక్. ఆమె కళ్లలో తనపట్ల ఆపేక్ష స్పష్టంగా కనిపిస్తోంది. అది బిడ్డను తొలిసారి చూసుకున్న తల్లి ముఖంలో కనబడే ఆప్యాయతకంటె ఎన్నోరెట్లు ఎక్కువగా వుంది. ఆ అనుభూతి అతనికి వెన్నెలలోలా చల్లగా, అమ్మ ఒడిలోలా వెచ్చగా వుంది.

"ఇందూ! నీవు అడిగేముందు నేను ఒక మాట చెబుతాను విను. ఇంతకుముందు నీవు చదివిన పద్యం రాసినాయనదే వేరొక పద్యం వుంది. పద్యం నాకు గుర్తులేదు. భావం మాత్రం గుర్తుంది. అది ఏమిటంటే దేవుడన్న వాడు గుడిలో భక్తుల పూజలందుకుంటూ ఆర్తుల కోర్కెలు తీరుస్తూ, అవసరమైననాడు ఆశ్రితులకు నిదర్శనాలు చూపిస్తూ వుండాలట. ఆలయం శిథిలమై, ధూప దీపనైవేద్యాలు లేకపోతే ఆ దేవుడిని గూర్చి లోకులు తక్కువచేసి మాట్లాడతారు. మరి దేవుడికే ఇటువంటి ప్రచారం కావల్సి వచ్చినప్పుడు ఆఫ్ట్రాల్ ఒక రచయితను నేను నా రంగంలో నిలద్రొక్కుకోవడానికి కొన్ని టెక్నిక్స్ ఉపయోగిస్తే తప్పేమిటి? "

వాళ్లిద్దరకూ మధ్య మళ్లీ మౌనం వచ్చేసింది. సంధ్యాకాంతి జిలుగు వెలుగులతో రాత్రికి స్వాగతం చెబుతోంది. గాలి చల్లగా వీస్తోంది. ఎక్కడో ఒక పక్షికూన తల్లి రెక్కల మధ్య ఒదిగి ఆనందంగా అరుస్తోంది.

గుడిలోకి సగం సగం పడుతున్న వెలుగులో ఇందిర శాపవశాత్తు దివినుండి భువికి దిగివచ్చిన దేవకన్యలా వుంది.

"కార్తీ! ఒక్క మంచి, గొప్ప రచన కావాలి. ఒకే ఒక్కటి నిన్ను మహామహుల సరసన నిలబెట్టే రచనగా రావాలి. ఆ తర్వాత నువ్వేం రాసినా ఫర్వాలేదు. అలా నాకు మాటివ్వు"



లేత తమలపాకులా వున్న ఆమె అరచేతిలో చెయ్యివేసాడు, కార్తీక్!

ఇద్దరూ లేచి బయటకు వచ్చేసారు. ఆఖరి క్షణంలో అడిగింది ఇందిర.

"కార్తీ! నీతోపాటు తిరుగుతుందే ఆ అమ్మాయి ఎవరు? "

ఫక్కున నవ్వాడు కార్తీక్. ఇంతసేపూ ఇన్ని నీతులు చెప్పిన మేధావి సడన్‌గా మామూలు ఆడపిల్లగా మారిపోయింది. ఇందిరకు అతని భావం అర్థమయినట్లు అతని నవ్వుతో శృతి కలిపింది.

★ ★ ★

రెండు రోజుల తర్వాత కార్తీక్ తిరిగి ఇంటికి వచ్చేసరికి పార్వతి అతని కొరకు ఎదురు చూస్తోంది.

వెళ్ళి పక్కన కూర్చున్నాడు. బూట్లు విప్పుకుంటుంటే పార్వతి చెప్పింది.

"సరోజ ఇప్పుడే వచ్చి వెళ్ళింది"

కార్తీక్ మాట్లాడకుండా తన పని తాను చేసుకుంటున్నాడు.

"మీరు సన్మానం అయిపోయాక ఎవరినో వెంటబెట్టుకుని లాడ్జికి వెళ్లారటకదా? మీ ఆయన్ని జాగ్రత్తగా చూసుకోమని చెప్పింది"

కార్తీక్‌కు వెన్ను వెంబడి ఏదో పాము జరజరా పాకుతూ పోతున్నట్లు ఒళ్లు జలదరించింది.

అసూయ ఇంత పని చేయించిందన్న మాట. పార్వతివైపు చూశాడు. ఆమె కళ్లు ఎప్పటిలానే నిర్మలంగా నవ్వుతున్నాయి. ఏదో చెప్పబోయాడు.

"స్టాప్" అతని నోటిని అరచేతితో మూస్తూ చెప్పింది. "మీరు నాకేమీ సంజాయిషీ ఇవ్వనవసరం లేదు. మీరు ఏ తప్పూ చేయరని నాకు తెలుసు. నా అంచనా తప్పుకాకుంటే ఆమె మీ ఫ్రెండ్ ఇందిర అయివుంటుంది. తనను వదిలి ఇందిరతో వెళ్లారని సరోజకు కోపం వచ్చి వుంటుంది.

అందుకే నాతో ఏవేవో కల్పించి చెప్పి ఉంటుంది అవునా? "

కార్తీక్ ఔనన్నట్లు తల వూపాడు.

అతనికి తెలుసు. తన భార్య అద్భుతమైన అందగత్తె కాకపోవచ్చు కాని అసాధారణమైన తెలివి తేటలు కలది.

"ఏం మాట్లాడుకున్నారు? " ఉత్సాహంగా అడిగింది పార్వతి.

అతనికి ఇందిర గుడినుండి బయటకు వచ్చేముందు అడిగిన ప్రశ్న గుర్తుకు వచ్చింది. అప్రయత్నంగా పెదవులపైకి నవ్వు తన్నుకు వచ్చింది.

ఆ నవ్వు చూడగానే పార్వతికి కోపం వచ్చేసింది.

దూరంగా జరిగి కూర్చుంది. ఈసారి పెద్దగానే నవ్వాడు కార్తిక్.

"నేనేం అసూయతో అడగలేదు. చిన్ననాటి స్నేహితులుకదా? ఏం మాట్లాడుకున్నారో తెలుసుకుందామని అడిగాను. చెబితే చెప్పండి లేకపోతే లేదు" ఉక్రోషంగా అంది.

"ఏమీ మాట్లాడుకోలేదు" ఆమె ముక్కు పట్టుకుని ఆడిస్తూ చెప్పాడు.

"పోట్లాడుకున్నాం.. నన్ను నవలలు రాయడం మానేయమంది. నేను ఒప్పుకోలేదు. కనీసం ఒక మంచి రచన చేస్తానని మాట ఇవ్వమంది"

"ఇచ్చారా? " ఆతృతగా అడిగింది.

"మా ఆవిడను అడిగి చెబుతానన్నాను"

అతని మాట పూర్తి కాకుండానే అతని చేతిపై గట్టిగా గిల్లింది. పూసగుచ్చినట్లు జరిగినదంతా వివరంగా చెప్పాడు.

"అయితే రాయడం మొదలుపెట్టండి. మీరు మీ తాతగారికి తగిన మనవడనిపించుకోవాలి"

★ ★ ★

ఆకాశం నుండి ఏకధారగా పడుతోంది వర్షం. ఉండి ఉండి తళుక్కున మెరుస్తున్నాయి మెరుపులు. వాటి వెనుకే పెద్ద శబ్దంతో ఉరుములు.

ఆ భీభత్స వాతావరణంలో కార్తీక్ మెల్లగా నడిచి వెడుతున్నాడు. అతనికి కాస్త




ముందు మరో మనిషి నడిచి వెడుతు న్నాడు.

ఆ వ్యక్తి పేరు జయదేవ్. కార్తీక్ గతంలో పనిచేసిన ఎరువుల కొట్టు యజ మాని కొడుకు. ఒక రోజు ఒక పార్టీలో అతను కార్తీక్‌ను దొంగగా నిందించాడు. చాలా మంది నమ్మలేదు. కొందరు వచ్చి కార్తీక్‌నే అడిగారు.

కార్తీక్‌లో అంత కాలంగా నిద్రపోతున్న అగ్ని పర్వతం బద్దలైంది. పగలనే మంట లను, ప్రతీకారమనే లావాను ఎగజిమ్మడం ఆరంభించింది.

జయదేవ్ గురించి పూర్తిగా వాకబు చేశాడు. జయదేవ్‌కు ప్రత్యేకమైన పని లేదు. తండ్రి సంపాదించినదాన్ని ఖర్చు చేయడమే అతని పని. ఈమధ్యే కొత్తగా జ్యోతి అనే అమ్మాయితో చాటుమాటు వ్యవహారం మొదలుపెట్టాడు.

కార్తీక్‌కు అదిచాలు. జయదేవ్‌ని మంచి భంగిమలలో వుండగా ఫొటోలు తీసి అవి పరిచయస్థులందరికి పంచాలి. అప్పుడు జయదేవ్ తనముందు ఎలా కుప్పిగంతులు వేస్తాడో చూడాలి.

కార్తీక్ తన భుజానికి వున్న సంచిని ఆప్యాయంగా తడిమాడు. దానిలో చాలా ఖరీదైన ఇంపోర్టెడ్ కెమేరా వుంది. సంచి వాటర్ ప్రూఫ్ కాబట్టి కెమేరా తడుస్తుం దన్న బాధలేదు. కాళ్లకు చప్పుడు కాకుండా రబ్బరు బూట్లు వేసుకున్నాడు.

వర్షం ఎక్కువైంది. కార్తీక్ తలపై వున్న రెయిన్‌టోపీని ముందుకు లాక్కున్నాడు. కోటు కూడా సరిచేసుకున్నాడు. మధ్యమధ్య మెరుపులు. అతడిని చికాకు పెడుతు న్నాయి. ఆ మెరుపుల వెలుగులో జయదేవ్ తనను గమనిస్తాడేమోనన్న భయం అత డిని వెంటాడింది. అందుకే జాగ్రత్తగా నడు స్తున్నాడు.

కాని జయదేవ్‌కు ఆ స్పృహలేదు. తిన్నగా జ్యోతి ఇంటికి చేరాడు.

చిన్నసైజు డాబా ఇల్లది. చుట్టూ ప్రహరీ గోడవుంది. జయదేవ్ లోపలకు వెడుతూ బయటగేటు వేసేశాడు.

కార్తీక్ కాస్సేపు అలాగే ఆగి ఆ తర్వాత గోడదూకి లోపలకు వెళ్ళాడు. చుట్టుపక్కల ఇళ్ళు తక్కువ. అందువల్ల తనను ఎవరో గమనిస్తారన్న భయం అతనికి లేదు.

తళుక్కున ఒక మెరుపు మెరిసింది. కటి కచీకటిగా వున్న ఆ ప్రదేశం ఒక్కసారిగా పట్టపగలుగా మారిపోయింది.

చటుక్కున కింద కూర్చున్నాడు కార్తీక్.

సరిగ్గా ఆరోజే వాతావరణం అలా వున్నం దుకు అతనికి చికాకుగా వుంది. అయినా పెద్ద డిటెక్టివ్‌లా బయలుదేరినందుకు తప్పదు!

డాబా చుట్టూ తిరిగాడు. ఎడమవైపు ఒక కిటికీ వుంది. దాని కర్టన్ పక్కకు లాగి లోపలకు చూశాడు.

అది బెడ్‌రూమ్.

తంతే బూరెల బుట్టలో పడటం అంటే ఇదే. ఆ ఇంటికి సరిగ్గా బెడ్‌రూంకి కిటికీ వుంది.

లోపల ఎవ్వరూ లేరు.

బహుశా డైనింగ్‌టేబుల్ దగ్గర వుండి వుంటారు.

కార్తీక్ తన సంచిలోనుండి కెమేరా తీసి ఫ్లాష్ బిగించాడు. పొజిషన్ చూసుకుని నిలబడ్డాడు.

బోను సిద్ధంగా వుంది. ఇక చిట్టెలుక వచ్చి పడడమే ఆలస్యం.

చాలాసేపు వేచి వున్నాక జ్యోతి గదిలోకి వచ్చింది. సన్నగా వుందా అమ్మాయి. వంటిపై పలుచని నైటీ ఉంది. దానిలోనుండి ఆమె శరీరంలోని సహజ వనరులు బయటకు కనిపిస్తున్నాయి.

గదంతా ఒకసారి కలయతిరిగింది. మంచంపై దుప్పటి సర్దింది. తర్వాత తిన్నగా కిటికీ దగ్గరకు వచ్చింది.

కార్తీక్ గుండె దడదడలాడింది. పక్కకు

తప్పుకున్నాడు. ఇప్పుడు ఆ అమ్మాయి తనను చూసి కేకలు వేసిందంటే జయదేవ్ సంగతి ఎలా వున్నా తను దొంగగా ముద్ర పడిపోతాడు. పేపర్లన్నీ మొదటి పేజీలో ఈ విషయం ప్రచురిస్తాయి.

జ్యోతి కిటికీ కర్టెన్ సరిచేసి లోపలకు వెళ్ళిపోయింది. కార్తీక్ కదలకుండా అలాగే కూర్చున్నాడు.

లోపలినుండి ఒక మగ గొంతు వినబడుతోంది. బహుశా జయదేవ్ వచ్చి వుండాలి. కాస్సేపు ఆగి కర్టెన్ ఓ మూల కొద్దిగా పక్కకు జరిపి చూశాడు. లోపల వాళ్ళిద్దరూ పోట్లాడుకుంటున్నారు. జ్యోతి ఏడుస్తోంది. జయదేవ్ కోపంగా ఏదో అంటున్నాడు. అతడు తాగి వున్నాడు. కార్తీక్‌కు ఒళ్ళు మండిపోయింది. ఈమాత్రం తతంగానికా తాను ఇంతసేపూ ఇంత కష్టపడింది. తల గోడకేసి కొట్టుకోవాలనిపించింది.

సరిగ్గా అప్పుడే అతను ఊహించనిది జరిగింది.

జయదేవ్ ఆవేశం హద్దులు దాటింది. పైగా తాగి వున్నాడు. పక్కనేవున్న పళ్ళు కోసుకునే చాకు తీసుకుని జ్యోతి పొట్టలో పొడిచాడు. చివ్వున అతని ముఖంనిండా నెత్తురు చిమ్మింది.

కార్తీక్ అప్రయత్నంగా ఫొటో తీశాడు.

జయదేవ్ కత్తిలాగి మళ్ళీ పొడిచాడు.

జ్యోతి కెవ్వున అరవబోయింది. ఒక చేత్తో ఆమె మెడ నొక్కిపట్టి మళ్ళీ పొడిచాడు. ఆమె మెలికలు తిరుగుతూ మంచంపై పడిపోయింది.

కార్తీక్ మళ్ళీ ఫొటో తీశాడు.

అంతకుముందువరకు అతను తిట్టుకున్న ఉరుములు మెరుపులు ఆ క్షణంలో అతనికి లాభించాయి. ఆ మెరుపుల వెలుగులో కెమేరా ఫ్లాష్ కలిసిపోయింది.

చకచకా మరో రెండు స్నాప్స్ తీశాడు. ఆ తర్వాత నిశ్శబ్దంగా అక్కడినుండి బయటకు వచ్చేశాడు.

★ ★ ★

రెండురోజులు గడిచిపోయాయి. జ్యోతి శవం పోలీసులకు దొరికింది. ఆ కేసు ఎస్సై వినోద్ పరిశోధిస్తున్నాడు. జ్యోతిని ఎవరు చంపారో అతనికి అర్థంకావటం లేదు.

మూడోరోజు కార్తీక్ వినోద్ ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళాడు. బ్రహ్మచారి ఇల్లు ఎలా వుంటుందో అలాగే వుందక్కడ. గదిలో మూలన పేరుకుపోయిన సిగరెట్ పీకలతో, మంచంపైనా, కుర్చీలలోనూ చిందరవందరగా పడేసిన బట్టలతోనూ గందరగోళంగా వుంది. మంచంపై పడుకుని మాగజైన్ చదువుకుంటున్నాడు వినోద్. కార్తీక్‌ను చూడగానే లేచి కూర్చున్నాడు.

గబగబా తన చుట్టూ వున్న సామాను సర్దడం మొదలుపెట్టాడు.

"ఇలా వచ్చి కూర్చో వినోద్. ఈ గదిని శుభ్రపరచడం మనవల్లకాదు. కనీసం ఇరవై మంది పనివాళ్ళు మూడు రోజులు శ్రమపడాలి" అన్నాడు కార్తీక్.

"ఏంచెయ్యను గురూ? బ్రహ్మచారిని. ఎప్పుడు ఇంటికి వస్తానో నాకే తెలియనివాడిని"

"మంచి పిల్లను చూసి పెళ్ళిచేసుకో. నీవు ఎంత అలసి వచ్చినా ఓదార్చడానికి ఇంటిదగ్గర ఒక ప్రాణి వుంటుంది. అసలు నీకొరకు ఆమె ఎదురు చూస్తుందన్న ఊహకే పనిభారం మర్చిపోతావు. ఇల్లు కూడా ఇలా గోడౌన్‌లా వుండదు" చెప్పాడు కార్తీక్.

"మా చెల్లాయి మంచిది కాబట్టి మీకు లోకమంతా మంచిగా కనబడుతోంది. నాకు ఓ గయ్యాళిభామ పెళ్ళాంగా వచ్చి ప్రొద్దుట వంటచేసి స్టేషన్‌కు వెళ్ళమంటే..." కాస్త ఆగి చెప్పాడు "బాప్‌రే బాప్. తల్చుకోవడానికే భయంవేస్తుంది"

కార్తీక్ ఫక్కున నవ్వాడు.

"ఉండండి గురూజీ. టీ కలుపుకువస్తాను" వంటగదివైపు నడిచాడు వినోద్.




కార్తీక్ అతడిని ఆపలేదు. తను కూడా వంటగదిలోకి వెళ్ళాడు.

ముందు గదికంటే గలీజుగా వుంది, వంటగది.

"వినోద్! నీకు ఈరోజు ఓ కథ చెబుతాను"

"చెప్పండి" ఉత్సాహంగా అడిగాడు వినోద్.

"ఈ కథ కల్పితంకాదు. ఇందులో పాత్రలన్నీ ప్రాణమున్నవే"

"అయితే కాసేపు వుండండి గురూజీ. టీ తయారైనాక ముందు గదిలోనికి వెడదాం. అక్కడ తీరికగా చెబుదురుగాని"

కాస్సేపటికి పొగలుగక్కే టీకప్పు కార్తీక్ చేతికి ఇచ్చి ఎదురుగా కూర్చున్నాడు వినోద్.

"ఇక ఇప్పుడు చెప్పండి"

కార్తీక్ తన కథ చెప్పడం మొదలుపెట్టాడు. నిశ్చలంగా వున్న చెరువులో రాయి పడితే కలకలం వ్యాపించినట్లు అతనికి తెలియకుండానే మాటలు రాసాగాయి.

తన తాతగారు చనిపోవడం, దిక్కులేని వాడిలా బంధువులపై ఆధారపడి బతకడం, అన్నీ వివరంగా చెప్పాడు. నరేష్ మావగారి దుర్మార్గం, జయదేవ్ వెక్కిరింత... జీవితమనే పుస్తకంలో పేజీలు గబగబా తిప్పసాగాడు.

ఏ మనిషి కూడా తనకు గతంలో తగిలిన గాయాలు మర్చిపోలేడు. ఒకవేళ మర్చిపోయినా జీవితం మొత్తంలో ఎక్కడో ఒక చోట అవి తిరిగి గుర్తుకు వస్తాయి. సరిగ్గా గమనిస్తే ఏ జీవితంలోనైనా ఇటువంటివి కోకొల్లలు.

రోడ్డుపై సరదాగా నడిచి వెడుతున్న మనిషి హఠాత్తుగా ముఖం ముడుచుకుంటాడు. ఏడాదికిందట పక్కింటాయనతో జరిగిన తగాదా ఇప్పుడు గుర్తొచ్చి వుండొచ్చు

మనవరాలితో సర్దాగా నవ్వుతున్న బామ్మగారు అకస్మాత్తుగా సీరియస్‌గా మారిపోతారు. అదే వయస్సులో తనూ అలాగే నవ్వుతుంటే అమ్మ తిట్టిన తిట్లు జ్ఞాపకం వచ్చివుండొచ్చు

"వాళ్ళకు బుద్ధి చెప్పాలి గురూజీ. ఎంత డబ్బున్నా ఇంత అహంకారమా? ఆ ముసలాడికి మన దెబ్బ రుచి చూపించాలి" చెప్పాడు వినోద్.

"కూల్‌డౌన్ వినోద్. ముసలాయనను తర్వాత చూద్దాం. ముందు జయదేవ్ పని పట్టాలి"

"ఏంచెయ్యమంటారు గురూజీ? మీరు ఎలా చెబితే అలా చేస్తాను" సిన్సియర్‌గా చెప్పాడు వినోద్.

అతని కళ్ళలో తనపట్ల అభిమానం కనిపించింది కార్తీక్‌కు. తనకు న్యాయం చెయ్యాలన్న తపన అగుపించింది.

తను జయదేవ్‌ను అనుసరించడం దగ్గర నుండి జ్యోతి హత్యవరకు మొత్తం చెప్పి తను తీసిన ఫొటోలు అతని చేతిలో పెట్టాడు కార్తీక్.

"చాలు గురూజీ. ఇక వాడి జీవితం ఏడు ఊచల వెనుకనే గడిచిపోతుంది" సంభ్రమాశ్చర్యాలతో ఆ ఫొటోలు చూస్తూ చెప్పాడు వినోద్.

ఆ తర్వాత కథంతా చకచకా నడిచింది. జయదేవ్ అరెస్టయ్యాడు. హంతకుడిగా గుర్తింపబడ్డాడు.

కత్తిపై వేలిముద్రలు అతని వేలిముద్రలతో సరిపోయాయి. అతనికి జైలు శిక్ష పడింది. ఇదంతా ఎవరు చేయించారో అతనికి బహుశా జీవితాంతం తెలియకపోవచ్చును. కాని ఎవరో చేయించారని మాత్రం తెలుస్తూనేఉంది.

కార్తీక్‌కు చాలా సంతృప్తిగా వుంది. తనను దొంగ అన్న మనిషిని హంతకుడిగా రుజువుచేశాడు.

కార్తీక్‌లోని మిస్టర్ హైడ్ గర్వంగా నవ్వుకున్నాడు. అతని క్రోధం శాంతించింది.



★ ★ ★

వీరభద్రం అంటే కార్తీక్‌కు చాలా గౌరవం. ఒకప్పుడు అతను కార్తీక్‌కు చాలా సహాయం చేశాడు. ప్రస్తుతం వున్న రచయితలలో నిజంగా సమాజం కొరకు రాసేది అతనే అనడంలో సందేహంలేదు.

వీరభద్రం రచనలు నాటకాలు కానివ్వండి, కథలు కానివ్వండి, నవలలు కానివ్వండి ఏవైనా పేదవాళ్ళ జీవితాలకూ, మధ్యతరగతి మిధ్యా విలువలకూ దర్పణం పట్టేవిగా వుంటాయి.

ఈమధ్య కొంతకాలంగా ఒక దినపత్రిక ఆదివారం అనుబంధంలో 'మన ప్రముఖులు' అనే శీర్షికలో కొన్ని వ్యాసాలు రాస్తున్నాడు వీరభద్రం.

ఒకవారం ఆ కాలమ్‌లోకి కార్తీక్ వచ్చాడు.

అది కార్తీక్‌కు గర్వకారణమే అయినా వీరభద్రం రాసిన తీరు అతనికి మింగుడు పడలేదు.

ఈ దశాబ్దంలోనే కార్తీక్ వంటి రచయిత పుట్టలేదన్నాడు వీరభ్రదం. కళ్ళకు కట్టినట్లు రాయడంలోనూ, మనస్సుకు హత్తుకునే సందేశం ఇవ్వడంలోనూ కార్తీక్‌కు అపూర్వమైన శక్తి వుందనీ, కాని అతను దానిని దుర్వినియోగం చేస్తున్నాడనీ రాసాడు.

మత్తుమందుల మాఫియా గాంగుల గురించీ, మనిషిని దిగజార్చే వివిధ రకాల పద్ధతుల గురించీ, మనసు పేరుతో మానసిక వికారాల గురించీ రాస్తూ యువతరాన్ని పాడుచేస్తున్నాడని రాశాడు.

అది చదవగానే కార్తీక్‌లోని క్రోధం జూలు విదిలిస్తూ లేచింది. తనెంతో అభిమానిస్తూ గురుతుల్యుడిగా గౌరవిస్తూ వచ్చిన వీరభద్రం కూడా ప్రస్తుతం తనున్న పరిస్థితి చూసి అసూయపడుతున్నాడన్న మాట.

తను నాలుగేళ్ళలో చేరిన స్థానాన్ని అతడు పది సంవత్సరాలుగా ఇదే వృత్తిలో వున్నా సాధించలేకపోయాడు.

ఆ పరిస్థితిలో ఎవరు వున్నా కడుపు మండటం సహజం. ఆ కడుపు మంట వీరభద్రం ఇలా తీర్చుకున్నాడా? తన మీదపడి ఇలా ఎందుకు ఏడుస్తున్నారందరూ. వీళ్ళలో చాలామంది చేతకాకనే రాయడం లేదు. వీరభద్రం వంటి వాళ్లు ఏవో ఆదర్శాలకు కట్టుబడి రాయడంలేదు. అది వాళ్ళ సొంత వ్యవహారం. తనకు దమ్ముంది గనుక రాస్తున్నాడు.

అంతమాత్రంచేత తను సాహిత్యాన్ని పాడుచేయడానికి పుట్టినట్లా? వీళ్ళు రాయడంలేదు కాబట్టి సాహిత్యాన్ని ఉద్ధరించేస్తున్నారా? వాళ్ళు వీళ్ళు అన్న మాటలకు తను ఏనాడూ బాధపడలేదు. కాని వీరభద్రం ఇలా అనడం...? పోనీ స్నేహితుడిగా తన దగ్గరకు వచ్చి చెప్పడం వేరు. కాని ఇలా పేపర్లో రాయడం ఏంన్యాయం? రేపటినుండి ప్రతీవాడూ తన్ను గురించి ఇలానే రాస్తాడు.

వీరభద్రం రాసిన వ్యాసం చదివేకొద్దీ కార్తీక్‌కు కోపం పెరిగిపోతోంది. అయినా కూడా మళ్ళీ మళ్ళీ చదివాడు.

ప్రతీవాడూ తను అదృష్టం కలిసివచ్చే ఈ స్థితికి ఎదిగాననుకుంటాడు. కానీ ఇందులో తను పడ్డ కష్టం, చేసిన ప్రయత్నం ఎవరికీ తెలీదు. తెలుసుకునే ప్రయత్నం కూడా చెయ్యడు. అసలు దేనిమీదనైనా బలీయమైన కోరిక వున్నప్పుడే అది సాధించగలిగేది.

ఆ కోరిక కూడా వుండి వుండి కలగడం కాదు. అదొక రగిలే జ్వాలలా మనస్సుని దహించివేయాలి. అటువంటి స్థితిని తను ఊహ తెలిసిన దగ్గరనుండి అనుభవిస్తున్నాడు. ఆశయసిద్ధి కొరకు తన సర్వస్వం పణంగా పెట్టాడు.

కార్తీక్ మాత్రమేకాదు. ఎవ్వరైనా అలాగే వుండాలి. అప్పుడు... అప్పుడు మాత్రమే విజయం ఇంటి తలుపు తడుతుంది.





ఉదాహరణకు డబ్బు విలువ తెలిసే వయస్సు వచ్చేసరికి ప్రతి వ్యక్తీ తాను కూడా డబ్బు సంపాదించాలని కలలు కంటాడు. చాలామందిలో ఆ కోరిక అలానే వుండిపోతుంది.

కొద్దిమందిలో మాత్రమే ఆ కోరిక వటవృక్షంలా విస్తరించి, అదే సర్వస్వం అయిపోయి, దానిని సాధించేందుకు నిర్దిష్టమైన కొన్ని పద్ధతులతో, విధానాలతో, సుశిక్షిత సైనికుల్లా దృఢ దీక్షతో శ్రమించేలా చేస్తుంది.

అదిగో... అటువంటి వాళ్ళవద్దకు సరిగ్గా అటువంటి వాళ్ళవద్దకే... సంపద వచ్చి చేరుతుంది.

ఆ పద్ధతిలోనే ఎంగిలి ఆకుల్లో అన్నం తిన్నవ్యక్తి ప్రపంచ ప్రసిద్ధ చిత్రకారుడిగా మారి వుండవచ్చు. వీధుల్లో బిచ్చమెత్తుకున్న అనాథ బాలిక సోఫియా లారెన్స్ అంతటి ప్రఖ్యాత నటీమణిగా మారి వుండవచ్చు.

ఓడలలో మూటలు మోసిన వ్యక్తి అటువంటి పది ఓడలు సొంతంగా కలిగిన ధనవంతుడవవచ్చు.

ఒక అలెగ్జాండర్ ఒనాసిస్, ఒక పికాసో, ఒక సచిన్ టెండూల్కర్.

వీళ్ళెవరికీ పేరు ప్రతిష్టలు అనాయాసంగా రాలేదు. డబ్బు ఊరికే వచ్చి చేరలేదు.

ఒక మామూలు సంసారి తన భార్యతో సినిమా చూస్తున్నవేళ ఇటువంటి వ్యక్తులు తమ తమ రంగాలలో తలమునకలుగా కృషి చేస్తుంటారు.

ఏ రంగంలోనైనా గొప్ప వాళ్ళ పరిస్థితి అదే. శ్రమ... నిరంతర శ్రమ. అలుపెరుగని కృషి. దానివెనుక కొండలనైనా పిండి కొట్టగల ఓపిక, సామర్థ్యం, సాగరాలను పుక్కిట పట్టేయాలనే పట్టుదల వీళ్ళందరికీ వుండే సామాన్య లక్షణాలు.

అదనపు అర్హతగా కాస్తంత అదృష్టం కలిసివస్తే చాలు... వస్తుంది కూడా. ఎందుకంటే ప్రతిభావంతుడెవరైనా సరే అదృష్టాన్ని జుట్టుపట్టుకు లాక్కువచ్చి తన గుమ్మంలో నిలబెట్టుకుంటాడు.

రచయితగా తాను ఈ స్థాయికి రావడం కూడా అలానే జరిగింది. ప్రపంచంలో అందరూ సుష్టుగా తిని హాయిగా నిద్రపోయేవేళ తను సరైన తిండితిప్పలు లేకుండా వేళ్ళు నొప్పులు పుట్టేలా రాసుకునేవాడు. ఆహ్లాదంగా గడపవలసిన సాయంత్రాలు గ్రంథాలయాలలో చదువుకుంటూ గడిపేవాడు.

ఆ కష్టం ఎవరికీ అక్కరలేదు. అలా కష్టపడదామన్న యోచన కూడా వుండదు. కేవలం తనపై నాలుగురాళ్ళు వేసి పైకి వచ్చేద్దామనుకుంటారు.

అవకాశం రాకగానీ వస్తే ఈ వీరభద్రం మాత్రం ఈ రకం నవలలు రాయడా? సరిగ్గా అక్కడికి వచ్చేసరికి కార్తీక్ ఆలోచనలు ఆగిపోయాయి.

ఆ సమయంలో కార్తీక్ 'వెన్నెల' అనే పత్రికకు గౌరవ సంపాదకునిగా వ్యవహరిస్తున్నాడు. ఆ పత్రిక సర్క్యులేషన్ పెరగడంలో కార్తీక్ పాత్ర చాలా వుంది. అందువల్ల ఆ పత్రికలో మార్పులు చేర్పులకు అతనికి పూర్తి స్వేచ్ఛ వుంది.

దాన్ని ఆసరాగా చేసుకుని వీరభద్రంపై దాడికి సిద్ధపడ్డాడు.

వీరభద్రానికి ఒకర్తే ఆడపిల్ల. అతను తన ప్రాణాలన్నీ కూతురుపైనే పెట్టుకుని బతుకుతున్నాడు. అతని అల్లుడు వెన్నెల పత్రికలోనే పనిచేస్తున్నాడు.

అతడిని పిలిపించి మాట్లాడాడు కార్తీక్. మొదట తటపటాయించినా కార్తీక్ చూపించిన పారితోషికం మొత్తాన్ని చూశాక ఒప్పుకున్నాడు.

రెండురోజుల తర్వాత ప్రపోజల్ ఓ.కే. అంటూ వచ్చాడతను.

వెన్నెల పత్రికలో ఓ కమర్షియల్ సీరి



యల్ మొదలైంది. మరికొద్ది కాలానికే ఒక ప్రైవేట్ టి.వి. ఛానల్‌లో అదేరకం సీరియల్ మొదలైంది. రెండూ వీరభద్రం కలంనుండి వచ్చినవే. 'అనుబంధం', 'రగులుతున్న మనుషులు' వంటి రచనలు చేసిన వీరభద్రం తను కఠినంగా విమర్శించిన కథల్నే రాస్తున్నాడు.

కార్తీక్ గర్వంగా నవ్వుకున్నాడు.

తన స్థానానికి ముప్పు వస్తే అది మొత్తం ప్రపంచానికి చుట్టుకోవాలి. తన కాళ్ళకింద భూమి కదిలితే మొత్తం భూమండలమే ముక్కలు కావాలి. దటీజ్ కార్తీక్. అతన్లోని మిస్టర్ హైడ్ మరోమారు గెలిచాడు.



గొర్రెపిల్లను మింగి కదలలేక పడున్న కొండచిలవలా వుంది తారురోడ్డు. ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. మంచుతో తడిసిన రోడ్డు కారు హెడ్‌లైట్లకాంతిలో తళతళా మెరుస్తోంది.

కార్తీక్ మెల్లిగా డ్రైవింగ్ చేస్తున్నాడు. ఆ కారులో అతనితోపాటు పార్వతి కూడా వుంది.

"మీలో శాడిజం రోజురోజుకు ఎక్కువైపోతోంది కార్తీ" హఠాత్తుగా అంది పార్వతి.

కార్తీక్ ఏమీ మాట్లాడలేదు. అతని దృష్టి అంతా డ్రైవింగ్ పైనే వుంది. పార్వతి మాటలు విననట్లు నటించాడు.

కార్తీక్‌కు వాళ్ళ ఊరు వెళ్ళే అవకాశం వచ్చింది. అతని పెదనాన్న తన కూతురి పెళ్ళికి శుభలేఖ పంపాడు. ముందు వెళ్ళకూడదనుకున్నాడు. కానీ ఆ ఊరు ఒక్కసారి చూడాలనిపించింది. ఆ ఊరివారికి తన గొప్పతనం చూపించాలి. అందుకే తను కొత్తగా కొన్న కారు తీసుకుని పార్వతితో బయలుదేరాడు.

గలగలా పారే గోదావరి, వీరప్పుడి బల్లకట్టు, ఊళ్ళో అడుగు పెట్టగానే కనిపించే గుడిగోపురం, శివాలయంలో చెట్లు అన్నీ చూడాలని ఆమె కోరిక.

కార్తీక్ నోటివెంట విన్న వాటిని ప్రత్యక్షంగా చూడాలని అతని వెంట బయలుదేరింది.

కానీ పల్లె ఆమె ఊహించినట్లు లేదు. ప్రకృతి కాంత పచ్చని చీరకట్టినట్లు వుండవలసిన చేలు చాలావరకు ఇళ్ళస్థలాలుగా మారిపోయాయి. పల్లె పెద్దదయింది. దారులన్నీ తిన్ననైనాయి. ప్రతీ ఒక్కరికీ వాహన సౌకర్యం, ప్రతీ ఇంటికి టి.వి., ఆఖరికి శివాలయం కూడా మారిపోయింది. లోపల పాలరాతితో గచ్చు వేశారు. ఫ్యాన్లు వున్నాయి. ఆవరణలో ఒక్క చెట్టు కూడా లేదు.

కాలం అన్నింటిని సుఖమయం చేసేసింది. పల్లెను, ప్రజలను, చివరకు దేవుడి గుడిని కూడా...

పెళ్ళి బాగా జరిగింది. కార్తీక్ బయలుదేరే ముందు అతని పెదనాన్న తన రెండో కూతురి పెళ్ళికి ఆర్థిక సహాయం చేయమని అర్థించాడు.

"నా పరిస్థితి కూడా బాగాలేదండి. మీకు తెలియందేముంది? నగరాలలో బతికే వాళ్ళం. మా దగ్గర డబ్బు నిలవ వుండదు. మాకు కూడా కష్టంగానే వుంటోంది"

చెప్పాడు కార్తీక్.

ఆయన ముఖం చిన్నబోయింది.

"ముసలాయన వయస్సులో మనకంటే పెద్దవాడు. సహాయం చెయ్యమని అడి గితే..." ఒక్కక్షణం ఆగి తనలోతనే మాట్లా డుకుంటున్నట్లు అంది పార్వతి. "మీకు ఇష్టంలేదనుకోండి. కాస్త మృదువుగా చెప్ప వచ్చుకదా? అంత కటువుగా చెప్పవలసిన అవసరం ఏముంది? "

కార్తీక్ ముఖం సీరియస్‌గా మారిపో యింది. అవసరం ఏముందో తనకు తెలుసు. ఇంట్లోనుండి బయటకు వచ్చేశాక ఇరానీ హోటల్లో టీ తాగుతూ ఎదురుకు ర్చీలో కూర్చున్న మనిషి తింటున్న పుల్కా రుచిని కూడా టీలోనే ఊహించుకుని తాగుతూ, భోజనం చేస్తే వున్న డబ్బులు అయిపోతాయని రోజుకు రెండు ఇడ్లీలు మాత్రమే తిని డబ్బులు దాచుకుంటూ, చలికి కప్పుకునే దుప్పటిలేక కాళ్ళు కడుపు లోకి ముడుచుకుని పడుకుంటూ... ఇదంతా ఎవరివల్ల? బంధువులనబడే ఈ రాబందువలవల్ల కాదా? ఈరోజు తను సంపాదించిన దానిలో వాళ్ళకు వాటాలు పంచాలా?

పార్వతి అతని మనస్సులో భావాలు చది వింది. అతని భుజంపై తలవాల్చింది.

"కార్తీ! నిజానికి మీకెవ్వరూ శత్రువులు లేరు. మీకు మీరే శత్రువు. మీరు డబ్బు అనే వారంటుతో అరెస్టయ్యి, పేరు ప్రతిష్ట లనే జైలులో గడుపుతున్నారు. అక్కడి నుండి బయటపడండి. లోకమంతా అందంగా, ఆనందంగా కనబడుతుంది"

అప్పటికి పూర్తిగా తెల్లవారింది. నీలంగా వున్న ఆకాశంనుండి ఏడురంగుల్లో భూమి పైకి వచ్చిన వెలుతురు మనుష్యుల మన స్సులో దూరి తెల్లగా మారాలని ప్రయ త్నిస్తూ చిత్రంగా నల్లగా మారిపోతోంది.

దారిలో అన్నీ పల్లెటూర్లే కావడంతో పెద్దగా ట్రాఫిక్ బెడదలేదు. దారిలో ఒక కాలువగట్టుపైన ఆపమంది పార్వతి. బ్యాగ్‌లో నుండి బ్రెష్‌లు తీసింది.

"పారూ! ఒక గంటలో మన ఇంట్లో వుంటాం. అక్కడ ముఖం కడుక్కోవచ్చు కదా? " అన్నాడు కార్తీక్.

"చెబుతాను. ముందు దంతధావనం కానిచ్చి ఆ తర్వాత ఇక్కడికి దగ్గరలో హోటల్ ఏదైనా వుంటే టిఫెన్ చేద్దాం"

"ఇక్కడి హోటల్స్ బాగోవు పార్వతీ. చాలా మురికిగా వుంటాయి"

పార్వతి అతనివైపు చూసి నవ్వింది.

"ఇప్పుడే చెప్పాను కార్తీ. మీకు డబ్బు, కీర్తి వచ్చేకొద్దీ గుండెల్లో తడి ఆరిపోతోంది. ఇక్కడకు కాస్తదూరంలో ఒక హోటల్ ఉందనీ, మీరు అంతదూరంనుంచి వచ్చి ఈ హోటల్‌లో పెసరట్టు తినేవారనీ, మన పెళ్ళయిన కొత్తలో చెప్పారు గుర్తుందా? "

"ఆరోజులు వేరు పార్వతీ. ఇప్పుడు ఆ కాకా హోటల్లో టిఫిన్ ఎలా తింటాం? " చిరాగ్గా అన్నాడు.

పార్వతి కారు దిగి బ్రష్ నోట్లో పెట్టు కుంది. ఇక కార్తీక్‌కు తప్పలేదు. ఆ చుట్టు పక్కల మనుష్య సంచారంలేదు. అడపాద డపా ఒక లారీ వేగంగా దూసుకుపోతోంది.

ఈసారి కారు ఆ హోటల్ ముందు ఆపాడు. ఆ హోటల్ కూడా రష్‌గానే వుంది. కూలిపనికి పోయే జనం అక్కడ ఆగి టిఫెన్ తింటున్నారు.

కారు ఆగగానే హోటల్ ఓనరు పరుగున వచ్చాడు. ఆర్డరు చేసిన పదార్థాలు అక్కడికే పంపుతానన్నాడు.

పార్వతి ఒప్పుకోలేదు. లోపలకు వస్తా నంది. కార్తీక్‌కు ఒళ్ళు మండిపోయింది. ఇవేం రకం సరదాలో అర్థంకావు. ఆ చిన్న హోటల్లో కూర్చుని తినడం, అదీ ఆ కూలి వాళ్ళమధ్యన... అతనికి ఇష్టంలేదు. కానీ అతడు ఆమెను నిరాశపర్చలేడు. ఆమె ఏం అడిగినా తను కాదనలేడు. అదే తన వీక్ నెస్. అనుక్షణం పార్వతి పెదవులపై చిరు



నవ్వుకై వెంపర్లాడతాడు.

ఎవరో రాజకుటుంబీకులు వచ్చినంత హడావిడి చేశాడు ఆహోటల్ ఓనర్. ఒక బెంచి దులిపి దానిపై కూర్చోమన్నాడు. రెండు ప్లేట్లు శుభ్రంగా కడిగి అందులో ఇడ్లీలు తీసుకురమ్మని కుర్రాడిని గట్టిగా కేకలు వేసి చెప్పాడు.

"రెండు పెసరట్లు కూడా చెప్పండి" చెప్పింది పార్వతి.

"ఒరే పెద్దయ్యా. రెండు స్పెషల్ పెసర" మళ్ళీ గట్టిగా అరిచాడు ఓనర్.

కార్తీక్‌కు చచ్చేంత సిగ్గుగా ఉంది.

ఈమధ్యకాలంలో ఖరీదైన పెద్ద హోటల్స్‌కే తప్ప మామూలు వాటికి వెళ్ళడం లేదు. అటువంటిది ఈ కాకా హోటల్‌లో టిఫిన్ తినడం...?

"కార్తీ, మీకు ఇబ్బందిగా వుంటే వెళ్ళిపోదాం" అతనిలో మార్పు గమనించి అంది పార్వతి.

"అబ్బెబ్బె అదేంలేదు పారూ! టిఫిన్ చేసి వెళ్దాం. సరేనా? " గబగబా చెప్పాడు.

పార్వతి చిన్నబుచ్చుకోవడం అతనికి ఇష్టంలేదు.

"కార్తీ, పెళ్లిలో అందరూ మీ గురించి చెప్పుకునేవాళ్లే. నన్ను చాలా ప్రత్యేకంగా చూశారు తెలుసా. నిజంగా మీ భార్యనైనందుకు నాకు చాలా గర్వంగా వుంది"

ఇంతలో ఒక కుర్రాడు వాళ్ల ఎదురుగా బల్లపైన ఇడ్లీ ప్లేట్లు పెట్టాడు. తినడం మొదలుపెట్టాడు. అతనికి ఎవరైనా పొగుడుతుంటే చాలా ఆనందంగా వుంటుంది. అందులో పార్వతి నోటివెంట ఆ పలుకులు ఇంకా బావుంటాయి.

"కార్తీ! మీ తాతగారు అచ్చు నీలానే వుండే వారట కదా? పెళ్లిలో అందరు అనడమే. మీకు మీ తాతగారి పోలిక వచ్చిందని, ఆయనలానే పెద్ద పండితుడివి అయ్యావని" చెప్పింది పార్వతి.

అసలు చిక్కంతా ఇక్కడే వస్తుంది. అతని చిన్నతనం నుండి ఇదే సమస్య. అతను సాధించిన దానిని తాతగారి పేరుతో ముడిపెడతారు. తాతగారు తనకు స్ఫూర్తి అంతే. ఆయన పేరు తాను ఎక్కడా ఉపయోగించుకోలేదు.

"అన్నయ్యా" ఎవరో పిలిచారు.

ఆశ్చర్యంగా చూశాడు. అతనికి ఎదురుగా రేఖ నిలబడి వుంది.

గోవిందంగారి అమ్మాయి రేఖ. తను చనిపోయిందనుకున్న రేఖ.

"రేఖా నీవు ఇక్కడా...? " ఆ అమ్మాయి బదులు చెప్పకుండా ఏడవడం మొదలుపెట్టింది. హోటల్ ఓనర్ వాళ్ల దగ్గరకువచ్చాడు.

"ఈ అమ్మాయి మీకు తెలుసా బాబు? " అడిగాడు.

తల వూపాడు కార్తీక్.

"వీళ్ల నాన్న గోవిందం నా స్నేహితుడండి. ఒక అర్ధరాత్రి ఈమె పారిపోయి ఇక్కడకు వచ్చింది. ఆ పని ఈ పని చేసుకుంటూ ఇక్కడే బతుకుతోంది" చెప్పాడతను.

రేఖ వాళ్ల పక్కనే కూర్చుంది. ఆమె ఇదివరకటిలాలేదు. చాలా దీనంగా వుంది. తైల సంస్కారంలేని జుట్టుతో, మాసిన బట్టలతో అదో రకంగా వుంది.

"నీవు, మీ నాన్నగారు మంటల్లో చనిపోయారని విన్నానే? " రేఖను అడిగాడు కార్తీక్.

"నీకు తెలుసు కదా అన్నయ్యా! మా ఊళ్లో రకరకాలుగా గంజాయి పదార్థాలు అమ్మేవాళ్లు. కొంతమంది కుర్రాళ్లు గంజాయి మత్తులో మా హోటల్‌కి వచ్చి గొడవ చేస్తే నాన్న చితగ్గొట్టి పంపారు. ఒక అర్ధరాత్రి నాకు మెలుకువ వచ్చింది. బయట ఎవరో మాట్లాడుకుంటున్నారు.

చూద్దామని పెరటివైపునుండి బయటకు వచ్చాను. నేను బయటకు రావడమే ఇల్లు తగలబడిపోయింది. మంటలు చాలా




వేగంగా అలుముకున్నాయి. నాన్నగారిని బయటకు పిలిచాను. పిచ్చిపట్టిన దానిలా కేకలు వేశాను. లాభం లేకపోయింది. ఇంతలో ఇల్లు అంటించినవాళ్లు నన్ను పట్టుకుని మంటల్లో పడేద్దామని చూశారు. పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నాను. నాన్నగారు ఎప్పుడో ఈయన గురించి చెప్పారు. అది గుర్తొచ్చి ఇక్కడకు వచ్చి పని చేసుకుంటూ బతుకుతున్నాను. ఈ రోజు ఎవరో కొత్తవాళ్లు, పెద్దవాళ్లు వచ్చారని వంటతను చెబితే చూద్దామని బయటకు వచ్చాను. నీవు కనిపించావు" అంది రేఖ.

కార్తీక్‌కు ఏం మాట్లాడాలో అర్థంకాలేదు. పార్వతివైపు చూశాడు. ఇటువంటి సందర్భాలలో మగవారికంటే ఆడవాళ్లు బాగా తెలివిగా మసులుతారు.

"రేఖా మా కూడా వస్తావా? " పార్వతి అడిగింది. రేఖ తల వూపింది.

వెళ్లి నీ సామాను ఏమైనా వుంటే తెచ్చుకో. మా ఇంటికి వచ్చి మాతోనే వుందువుగాని"

రేఖ సంతోషంగా లోపలికి పరిగెత్తింది. వాళ్లు టిఫిన్ చేసి బిల్లు చెల్లించే సమయానికి తిరిగి వచ్చింది. ఆమెతో ఒక చిన్న మూట మాత్రమే వుంది.

రేఖను తీసుకుని బయలుదేరారు. కార్తీక్‌కు చాలా విచిత్రంగా అనిపించింది. ఎప్పుడూ ఎక్కడికీ వెళ్లని పార్వతి తనతో పెళ్లికి రావడం ఏమిటి? దార్లో ఈ హోటల్ దగ్గర ఆగడం ఏమిటి? ఈ హోటల్లోనే రేఖ ఉండటం ఏమిటి? అసలు జీవితమే పెద్ద విచిత్రం.

పార్వతి కార్లోని టేప్‌రికార్డర్ ఆన్ చేసింది.

అతనికోసమే అన్నట్లు వచ్చిందా పాట.

"ఎవరికెవరు ఈ లోకంలో ఎవరికి ఎరుక ఏదారెటుపోతుందో ఎవరినీ అడుగక"



"చాలా కష్టమైన పని" చెప్పింది రేణుక. ఇది మా పరువు ప్రతిష్ఠలకు సంబంధించిన విషయం. ఏమీ అనుకోకండి. నావల్లకాదు"

ఆమె అంత ఖచ్చితంగా చెప్పాక ఏం మాట్లాడాలో కార్తీక్‌కు అర్థంకాలేదు. కాస్సేపు ఆగి చెప్పాడు.

"అది కాదు రేణుకా. ఒక్కసారి నా స్థానంలో వుండి ఆలోచించు. భార్య ప్రసవ వేదన పడుతుంటే నేను చెయ్యని దొంగతనం నాపై మోపి జైలుకు పంపాడు ఆ ముసలాయన. ఆయనకు నేను చేసిన ద్రోహం కూడా ఏమీ లేదు. ఆయన కూతురుకు ఆమె ఇష్టపడ్డ మనిషితో పెళ్లి జరిపించాను. అందుకొరకు ఎన్నోపాట్లు పడ్డాను" ఆవేశంతో ఇంకా ఏదో చెప్పబోయాడు కార్తీక్.

"సార్! మీ బాధ నేనర్థం చేసుకోగలను. మీ స్థానంలో ఎవరున్నా ఇలా ఆవేశపడతారు సహజం. కాని ఆడపిల్లను, రేపు నాకు పెళ్లి కావాలికదా? " అతని మాటలకు అడ్డం వస్తూ చెప్పింది రేణుక.

ఆమె అలా అన్న తర్వాత ఇంకేమీ మాట్లాడలేకపోయాడు. నిజమే! తను అంత దూరం ఆలోచించలేదు. కేవలం తనవైపు నుండే ఆలోచిస్తున్నాడు. రేపు ఈ అమ్మాయికి పెళ్లి ఎలా అవుతుంది?

"సారీ సార్! మీరంటే నాకు చాలా అభిమానం. అయినా మీ కొరకు ఈ పని చెయ్యలేకపోతున్నాను. నన్ను క్షమించండి" తల వంచుకుని చెప్పింది రేణుక.

రేణుక వద్ద సెలవు తీసుకుని అక్కడి నుండి బయటపడ్డాడు కార్తీక్. నరేష్ మావగారి పని పట్టడానికి వినోద్ ఒక పథకం ఆలోచించాడు. దానికి ఒక అమ్మాయి కావల్సి వచ్చింది.

కార్తీక్‌కు వెంటనే రేణుక గుర్తొచ్చింది. రేణుక అతని అభిమాని. గతంలో కార్తీక్ కొరకు త్రిమూర్తులుతో నాటకం ఆడిన

అమ్మాయి.

జరిగింది వినగానే వినోద్ చాలా నిరాశ చెందాడు. చాలాసేపు ఈ విషయమే ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"ఆ అమ్మాయి అభ్యంతరం ఏమిటి గురూజీ?" విసుగ్గా అడిగాడు.

కార్తీక్ మాట్లాడలేదు. ఇకదానిపై వాదన అనవసరమనిపించింది. ఇంకో ప్లాన్ వేసుకోవడం మంచిది. కాదంటే ఇంకో అమ్మాయిని వెతికి పట్టుకుంటే సరిపోతుంది.

"కష్టం గురూజీ. మీరంటే ఇంత అభిమానం వున్న అమ్మాయే ఒప్పుకోకపోతే ఇంకెవ్వరూ ఒప్పుకోరు. నేను చెప్పిన ప్లానుకు చదువుకున్న అమ్మాయి కావాలి. లేకపోతే మా స్టేషన్‌కు వచ్చే బ్రోతల్స్‌లో ఎవరో ఒకరిని పట్టుకుంటే సరిపోను"

"వేరే ప్లాను ఆలోచిద్దాం వినోద్. డోంట్ వర్రీ" చెప్పాడు కార్తీక్.

అతనికి వినోద్ పట్టుదల చూస్తుంటే ముచ్చటేసింది. ఏ వృత్తిలో వున్న వారైనా రాణించడానికి ఈ పట్టుదల అదనపు అర్హత అవుతుంది.

"అది కాదు గురూజీ. ఆ ముసలాడిని చెప్పుతో కొట్టినట్లు బుద్ధి చెప్పాలంటే ఈ ప్లానే అమలు పరచాలి. ఇప్పుడు మనకు కావలసిందేమిటి? రేణుక అనే అమ్మాయిని ఒప్పించడం. అంతేకదా? ఆ అమ్మాయి అడ్రస్ చెప్పండి. నేను ప్రయత్నిస్తాను"

కార్తీక్ తల అడ్డంగా తిప్పాడు.

"ఇదంతా వృథా ప్రయాస వినోద్! రేణుక ఒప్పుకోదు. రేణుక గురించి నాకు బాగా తెలుసు. భయం అంటే తెలియని అమ్మాయి. అటువంటి అమ్మాయి వెను కంజ వేసిందంటే చాలా ఆలోచించుకుని వుంటుంది. ఇక ఒప్పుకోదు"

"నేను కూడా ప్రయత్నిస్తే నష్టం ఏమిటి గురూజీ"

కార్తీక్ కాదనలేకపోయాడు. రేణుక చిరునామా అతనికి ఇచ్చాడు. అయితే రేణుక ఒప్పుకుంటుందని అతను అనుకోలేదు. అక్కడే అతని అంచనా తప్పింది.

రేణుక ఒప్పుకుంది. మొత్తానికి వినోద్ సాధించాడు. ఏ రకంగా సాధించావని కార్తీక్ అడగలేదు. అతనికి కావాల్సింది తన పని పూర్తి కావడం. అది ఏ రకంగానయినా సరే.

ప్లాను ప్రకారం రేణుకతో చాలాసార్లు రిహార్సల్స్ చేయించారు. పథకం అమలు చేసే రోజు వచ్చేసింది.

★ ★ ★

నరేష్ మావగారికి ఫోన్ చేసింది రేణుక. అవతలివైపు ఆయన గొంతు వినబడగానే చెప్పింది.

"నా పేరు రేణుక సార్! మీ అల్లుడు నరేష్‌తో నాకు చాలా దగ్గర బంధం వుంది. సాక్ష్యంగా ఫొటోలు కూడా వున్నాయి. ఇప్పుడు మీ అల్లుడుగారు నన్ను వదిలించుకుందామనుకుంటున్నారు. నేను కూడా నా దగ్గర వున్న ఆధారాలతో పోలీసుల దగ్గరకు వెడదాం అనుకుంటున్నాను. మధ్యలో పెద్దాయన మీరు వున్నారు కదా? ఒకసారి చెప్పి చూద్దాం అని ఫోన్ చేశాను"

ఒక్క నిముషం అవతలి వ్యక్తి చెప్పే మాటలు వింది. తర్వాత చెప్పింది.

"పోనీ ఒక పని చెయ్యండి సార్! ఒక లక్ష రూపాయలు నా ముఖాన కొట్టండి. నా దగ్గరున్న సాక్ష్యాలు ఇచ్చేస్తాను" చెప్పింది.

అవతలివాళ్లు చెప్పేది విని ఎక్కడికి రావాలో చెప్పింది. పథకంలో మొదటి భాగం సక్సెస్. ఇక రెండవ భాగం జాగ్రత్తగా నడపాలి.

అది చాలా చిన్న లాడ్జి. దాని ఓనరు వినోద్‌కు ఆప్తమిత్రుడు. అతడు వాళ్లు చెప్పినట్లు చెయ్యడానికి ఒప్పుకున్నాడు.

సరిగ్గా రేణుక చెప్పిన సమయానికే నరేష్ మావగారు పడుతూ లేస్తూ





వచ్చాడు.

రేణుక వున్న గదిలోనికే తిన్నగా వెళ్లాడు. కార్తీక్, వినోద్ ఆ పక్క గదిలోనే వున్నారు.

వాళ్ల పథకం ప్రకారం మరో పది నిముషాలల్లో రేణుక పెద్దగా కేకలు వేస్తుంది. తన బట్టలు తానే చింపేసుకుని తన జుట్టు తానే రేపుకుని బయటకు వచ్చేస్తుంది. లాడ్జిలో జనం ఆ కేకలు విని బయటకు వచ్చేస్తారు. అప్పుడు వినోద్ అతడిని అరెస్ట్ చేస్తాడు. మానభంగం కేసులో ఆ ముసలాయన జైలుకు పోతాడు.

కాని వాళ్ల పథకం తారుమారైంది. ఆ గదిలో నుండి చాలాసేపటి వరకు ఎటువంటి శబ్దం రాలేదు. వినోద్ ముఖంలో ఆదుర్దా కనిపించింది. టెన్షన్‌లో అతని నుదుటిపై నరాలు ఉబ్బి కనబడుతున్నాయి. కార్తీక్‌లోనూ టెన్షన్ పెరిగిపోతోంది.

చివరకు ఇద్దరూ వెళ్లి తలుపుకొట్టారు. ఎవ్వరూ తెరువలేదు. గట్టిగా బాదారు.

పాతకాలం తలుపు కావడంతో గడియ వూడిపోయి తలుపు తెరుచుకుంది.

లోపలకు వెళ్లడంతోనే వాళ్లకు ఊపిరి ఆగినంత పనయ్యింది.

ఎదురుగా... నేలపై రేణుక నిర్జీవంగా పడివుంది. ముసలాయన వీళ్లని చూసి గజగజా వణికి పోతున్నాడు. ఏం జరిగి వుంటుందో ఆ సన్నివేశాన్ని చూడగానే అర్థమవుతుంది. రేణుక ప్లాన్ ప్రకారం కేకలు వేసి అల్లరి చెయ్యబోయి వుంటుంది. ముసలాయన కంగారుతో పీక నొక్కేసి వుంటాడు. అంతే రేణుక చనిపోయింది.

వినోద్ పట్టరాని కోపంతో స్టిక్‌తో నరేష్ మావగారిని కొట్టాడు. ఆ తర్వాత ఆయన చేతులు వెనక్కు విరిచికట్టేసాడు. ఆ గది చుట్టూ మూగుతున్న జనాన్ని దూరంగా నెట్టి స్టేషన్‌కు ఫోన్ చెయ్యడానికి కిందకు వెళ్లాడు.

రేణుక నిర్జీవంగా పడివుంది. ఆమె కళ్లు తెరుచుకుని కార్తీక్‌వైపు చూస్తున్నాయి. ఆ కళ్లలో మృత్యువును ప్రత్యక్షంగా చూస్తున్న భావన. కార్తీక్‌లో దుఃఖం తెరలు తెరలుగా... నిర్వేదం పొరలుపొరలుగా.

"సార్ నేను మీ అభిమానిని. మీకోసం ప్రాణాలైనా ఇచ్చేస్తాను"ఆ అమ్మాయి తనను మొదటిసారి కలిసినప్పుడు మాట్లాడిన మొదటి మాటలు. నిజంగానే ప్రాణాలు ఇచ్చేసింది. ఇప్పుడు ఆ ముసలాయనకు జైలు శిక్షపడవచ్చు కాని తను సాధించింది ఏమైనా వుందా? ఏమీలేదు. పోగొట్టుకున్నది మాత్రం కొండంత. చక్కగా నవ్వుతూ నవ్విస్తూ, ఆడుతూ, పాడుతూ తిరిగే అమ్మాయిని చంపేశాడు. యస్. ఐయామ్ ఎ మర్డరర్. తను హంతకుడు. పగ, ప్రతీకారాల పేరు చెప్పి ఒక నిండు ప్రాణాన్ని బలికొన్నాడు.

రేణుకను చూస్తుంటే అతనికి దుఃఖం ఆగడంలేదు. ప్రతీ మనిషి చనిపోవలసిందే. కాని ఈ చావుకు ఒక లక్ష్యంలేదు. ఒక అవసరంలేదు. కేవలం తన మూర్ఖత్వానికి ఆమె తన ప్రాణాలు బలిపెట్టింది. కొద్ది నిముషాలక్రిందట తనతో మాట్లాడిన రేణుక ఇక లేదు అనే భావన తన మనస్సులో ఇంకడంలేదు. చనిపోవడం ఇంతతేలికా? మరి ఇంక జీవించడంకోసం ఇంత తాపత్రయం దేనికి?

ఎంత డబ్బు సంపాదించినా, ఎంత కీర్తి సంపాదించినా, చివరకు ఏ మనిషయినా ఇంతే. మరణించాక ఈ డబ్బు, కీర్తి, ఈ అనుబంధాలు ఏమీ వెంటరావు. బతుకు అశాశ్వితం, మృత్యువు శాశ్వతం.

ఈ మాత్రం దానికి ఎందుకింత కష్టపడుతున్నాం. అర్థంలేని బతుకులో ఏదో వుందని భ్రమిస్తూ మెట్టు తర్వాత మెట్టుఎక్కేయాలనీ, పైకి, పైపైకి ఎదిగిపోవాలనీ దహించివేసే కోరికలతో ఎందుకింత సతమతమైపోతున్నాం?

అతనికి తలలో నరాలు చిట్లిపోతా యేమో అన్నంత బాధ కలుగుతోంది.

భుజంపై చెయ్యిపడింది. తిరిగి చూశాడు. వినోద్ నిలబడి వున్నాడు.

"సారీ గురూజీ ఇలా అవుతుందనుకో లేదు" బాధగా చెప్పాడు.

తల వూపాడు కార్తీక్.

ఇప్పుడు ఎవరైనా చెయ్యగలిగింది ఏముంది? రేణుక ఈ పనికి ఒప్పుకోకుండా వుండవలసింది. అప్పుడు సరిగ్గా అప్పుడు తేలు కొండీలా ఓ అనుమానం అతని మనస్సులో తలెత్తింది.

"ఈ అమ్మాయిని ఎలా ఒప్పించావు? "

వినోద్‌ని అడిగాడు.

"వదిలెయ్యండి గురూజీ. మనం ఎంతగా తల బద్దలు గొట్టుకున్నా రేణుక బతికిరాదు"

"అలా కాదు. నాకు తెలియాలి. ఎలా ఒప్పించావు? " అతని కంఠంలో ఏదో తీవ్రత.

"పెళ్ళి చేసుకుంటానని మాట ఇచ్చాను"

రేణుకవైపు వెర్రిగా చూశాడు.

ఈ దేశపు ఆడపిల్లతో పెళ్ళి పేరు చెప్పి ఏమైనా చేయించవచ్చా? ఆఖరికి... ప్రాణాలు కూడా తీసేసుకోవచ్చా? అతని కళ్ళనిండా నీళ్ళునిండి రేణుక దేహం కనిపించడం మానేసింది.

★ ★ ★

రేణుకను మరిచిపోవడానికి అతనికి చాలాకాలం పట్టింది. భోజనం చేస్తున్నా, నిద్రపోతున్నా కార్తీక్‌కు రేణుకే గుర్తుకు వచ్చేది.

నరేష్ మావగారిపై వినోద్ చాలా పకడ్బందీగా కేసు పెట్టాడు. ఆయనకు వురిశిక్ష పడింది. వయస్సులో పెద్దవాడై తన మనవరాలి వయసుదైన అమ్మాయిని మానభంగం చెయ్యబోయి కుదరక హత్య చేశాడని చాలా పత్రికలు రాశాయి. చాలారోజులు ఈ కేసు ప్రజలలో చర్చనీయాంశమైంది. ఇది కూడా కార్తీక్‌కు ఒకరకంగా బాధే కలుగజేసింది.

ఆ ముసలాయనకు అంత పెద్ద శిక్ష పడాలని అతను అనుకోలేదు. నిజానికి ఈ హత్యలో తనకు, వినోద్‌కు భాగం వున్నట్లే.

జయదేవ్ కథను, నరేష్ మావగారి కథను వాళ్ళిద్దరిని విలన్స్‌గా చిత్రిస్తూ రెండు నవలలు రాశాడు. రెండూ హిట్టయ్యాయి. తన పగను, ప్రతీకారాన్ని, తన నవ్వును సంతోషాన్ని, తన కష్టాన్ని, కన్నీళ్ళను కూడా రచనల రూపంలో సొమ్ముచేసుకోగలుగుతానని కార్తీక్ అనుకోలేదు.

★ ★ ★

నిశీధి మెల్లిగా ప్రపంచాన్ని ఆక్రమిస్తోంది. కప్పను మింగే పాములా ఈ లోకంలో మిగిలిన వెలుగుని మింగేస్తోంది. కార్తీక్ తన భవంతి పైఅంతస్థులో అద్దాలముందు కూర్చుని రాసుకుంటున్నాడు. ఈ అద్దాలకు ఒక ప్రత్యేకత వుంది. వాటినుండి తను బయటవారందరిని చూడగలడు. కాని తను ఎవ్వరికీ కనబడడు. అచ్చంగా తనలానే వుంటాయా అద్దాలు. తను అందరి మనస్సుల్లోనికి చూడగలడు. కాని తనే మిటో ఎవ్వరికీ తెలీదు.

టీనేజ్ ఆడపిల్లలు తనను నవలల్లో హీరోలతో పోల్చుకుంటారు. కుర్రవాళ్ళు తన అంత ఎత్తుకు ఎదగాలని కలలు కంటారు. వృద్ధులు, పాతతరంవాళ్ళు తన్ను స్వార్థపరుడనుకుంటారు. తన సమవయస్కులు తనను సమర్థుడనుకుంటారు.

ఎవరు ఏమనుకున్నా తనుతనే. ఎవ్వరికీ అర్థంకాని కార్తీక్. కార్తీక్‌కు కూడా ప్రశ్నగానే మిగిలే కార్తీక్.

పొద్దుటనుండి అలాగే కూర్చుని రాస్తున్నాడు. తనలో నుండి తుఫానులా ప్రభంజనంలా బయటకు తన్నుకువస్తున్న రసధునిలో మునిగి అక్షర సృష్టి చేస్తున్నాడు.




పార్వతి కోరిక తీర్చడానికి రాస్తున్నాడు. ఇందిరకిచ్చిన మాటకొరకు రాస్తున్నాడు. మనస్సులో సుళ్ళు తిరుగుతున్న ఆవేశం గుండెల్లో నుండి కలంలోనికి దిగి ఊపిరిపో సుకుంటోంది.

చుట్టూ నిశ్శబ్దం.

ఆ నిశ్శబ్దంలో కవితానుభూతిలోనికి వెళ్ళి ఆ స్పందనతో రచనా ఝరిలో మునిగి తేలుతున్నాడు. కాలం జరుగు తోంది.

మెల్లిగా గతంనుండి భూతంలోనికి సెకన్లు నిముషాలుగా, నిముషాలు గంట లుగా మారిపోతున్నాయి.

బయట తలుపు చప్పుడయ్యింది. తపో భంగమయిన ఋషిలా ఉలిక్కిపడ్డాడు. అతని ఏకాగ్రతను బద్దలుచేస్తూ సన్నగా చప్పుడు.

మామూలుగా 'మృత్యుగీతం', 'రక్తచం దనం' వంటి రచనలయితే బస్టాండ్‌లో నిల బడి కూడా రాయగలడు. ఎందుకంటే అతను ప్రొఫెషనల్ రైటర్. ప్రొఫెషనల్ రైటర్‌కి కళ్ళు, చేతులు పనిచేస్తే చాలు. చుట్టుపక్కల మూడో ప్రపంచయుద్ధం జరు గుతున్నా రాసెయ్యాలి తప్పదు. లేకపోతే రచయితగా మనుగడ సాగదు. పోటీ. అవ తలివాడి మనస్సులో ఒక ఊహ మెదిలే లోగా అది మనం రాసెయ్యాలి.

ఏమో? ఏ పుట్టలో ఏ పాముందో ఎవ రికి తెలుసు. ఎవరి మదిలో మెరిసిన ఆలో చన ఎంత కమర్షియల్ సక్సెస్ అవుతుందో ఎవరికి తెలుసు.

కాని ఇప్పుడు అతను చేసేది అటువంటి రచన కాదు. తన భార్య కొరకు, అతని చిన్ననాటి స్నేహితురాలికొరకు, అన్నింటిని మించి సుబ్రమణ్యశర్మగారి మనవడిగా నేనూ మంచి రచనలు చెయ్యగలనని నిరూ పించుకోవాలనే 'ఇగో'ని తృప్తి పరచుకో వడం కోసం చేస్తున్న రచన.

చేతిలోని కలం కదులుతూనేవుంది.

"కార్తీ" ఎవరిదో కంఠస్వరం అతడిని తట్టి లేపుతోంది.

ఆ కంఠం ఎవరిదో అర్ధమయిన మరు క్షణం అతని తాదాత్మ్యం భళ్లున బద్దలయి పోయింది. అర్ధంతర స్థితిలో అనుభూతి నుండి ఇవతలకు వచ్చి పడ్డాడు.

వెనుకనుండి అతని మెడచుట్టూ తన రెండు చేతులు వేసింది సరోజ. ఆమెనుండి చాలా ఖరీదైన పరిమళం వస్తోంది.

"నాపైన ఇంకా కోపం పోలేదా? " చిన్నగా అడిగింది.

"కోపమా? నాకెందుకు? వుంటే నీకే వుండాలి" పెన్ను పక్కన పెడుతూ చెప్పాడు.

"నీపైన నేను కోపం తెచ్చుకోవడమా? ఈ జన్మలో జరగదు. అయినా రంభవంటి అమ్మాయి పక్కన వుండగా ఎవరితోనో వెళ్ళిపోయావు. నీకు న్యాయంగా అనిపిం చిందా? "

ఎంత హీనంగా అందామాట. జనం హారతిపట్టి నీరాజనాలర్పించే అద్భుతమైన డాక్టర్‌ని ఒక కేబరేడ్యాన్సర్ అన్నట్లుగా ఈసడించిందీమె.

అహంకారానికి అసలు సిసలు రూపం సరోజ. ఈమెను పెళ్ళి చేసుకోకపోవడం నిజంగా తన అదృష్టం. జీవితంలో జరిగే ప్రతిదీ మన మంచికే అంటే అర్ధం ఇప్పుడు తెలుస్తోంది.

కార్తీక్ మాట్లాడకపోవడం చూసి మాట మార్చింది. "పార్వతి ఏది? "

"వాళ్ళ అమ్మగారింటికి వెళ్ళింది. ఆమెకు వంట్లో బాగా లేదట. ఒక గంటలో రావచ్చు. రేఖను కూడా తీసుకువెళ్ళింది"

"రేఖ అంటే మీ ఇంట్లో వుంటున్న అమ్మాయా? "

తల వూపాడు.

"ఆ అమ్మాయి ఎవరు? "

"మా పెదనాన్నగారి అమ్మాయి. సర దాగా వచ్చింది"

అంతకు మించి చెప్పడం అతనికి ఇష్టం లేకపోయింది.

సరోజ సంతృప్తిగా తల వూపింది. అత నికి తెలుసు. రేఖ గూర్చి తను ఇంకేమైనా చెప్పివుంటే చాలా అసహ్యంగా మాట్లాడేది.

"పార్వతి వచ్చేలోగా మనం ఒక పార్టీకి వెళ్ళివద్దాం. అక్కడ నీకు చాలా ఖరీదైన మనుష్యులను, నీ జీవితానికి ఉపయోగపడే మనుష్యులను పరిచయం చేస్తాను రా" చెయ్యిపట్టి లాగుతూ చెప్పింది.

కార్తీక్‌కు అక్కడినుండి కదిలి వెళ్ళడం ఇష్టంలేదు. ఇప్పుడు రాస్తున్న పేజీ పూర్తిచె య్యకపోతే సగం భోజనం చేసినట్లుగా అసంతృప్తిగా, అసంపూర్తిగా, వెలితిగా వుంటుంది. అయినా చేసేదేమీలేదు. వెళ్ళక పోతే నానా గొడవ చేసి మూడ్ పాడుచేసి వెళ్ళిపోతుంది. దానికంటే ఆ పార్టీకి వెళ్ళ డమే సుఖం.

అందుకే ఇష్టంలేకపోయినా బయలుదే రాడు. కారు స్టార్ట్‌చెయ్యబోతుండగా చెప్పింది సరోజ.

"ఈపార్టీ ఇచ్చేది ఎవరో తెలుసా? మిస్టర్ అండ్ మిసెస్ శేషగిరిరావు.

గోదావరిలో స్నానం చేస్తున్నవాడికి హఠాత్తుగా కాలికి పాము చుట్టుకున్నట్లు అదిరిపడ్డాడు కార్తీక్.

"నీవు చెప్పేది కాంట్రాక్టర్ శేషగిరి గురించేనా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును... కాని ఇప్పుడు ఆయన కాంట్రాక్టర్ కాదు. పెద్ద బిజినెస్ మాన్. ఆయన భార్య మిసెస్‌రావ్ నా స్నేహతు రాలు" గర్వంగా చెప్పింది సరోజ.

నిజమే. మిస్టర్ రావ్ ఇప్పుడు చాలా పెద్ద బిజినెస్ మాన్. గొప్ప దాత. ఊరికి ఉపకారి. ఒకప్పుడు ఇదే శేషగిరిరావు కడుపు చేత్తోపట్టుకుని ఈ ఊరు వచ్చాడు. ఎన్నో పనులు చేశాడు. ఎంతో కష్టపడ్డాడు. డబ్బు సంపాదించడమే లక్ష్యంగా ఎంతో శ్రమ పడి ఈనాడు ఈ స్థాయికి వచ్చాడు. ఇప్పుడు ఆయనకు మందులషాపులు న్నాయి. జనరల్‌స్టోర్స్ వున్నాయి. రైస్‌మిల్లులున్నాయి. సినిమాహాలు వుంది. ఉత్తముడు, సంస్కారి, దాత అనే బిరుదులు న్నాయి.

ఒకప్పుడు ఆయనను ఈసడించుకున్న వాళ్ళు ఇప్పుడు ఆయనను అదే నోటితో పొగుడుతున్నారు. అంతా డబ్బు మహిమ. మనిషి బతకాలంటే డబ్బు కావాలి. ఆ డబ్బే అన్నీ తెచ్చిపెడుతుంది. అందుకే కూడా డబ్బు సంపాదించడం అంటే అంద రికీ అంత ఇష్టం.

కారు ఒక పెద్ద బిల్డింగ్ కాంపౌండ్‌లోకి ప్రవేశించింది. అక్కడ అప్పటికే ఎన్నో కార్లు ఆగివున్నాయి. చీకట్లో పావురాల్లా కనబడు తున్నాయి. బంగళా లైట్లతో వజ్రాలు ధరించిన రాకుమారిలా మెరిసిపోతోంది.

"కమాన్ కార్తీ" కారు దిగుతూ చెప్పింది సరోజ.

ఆమెను అనుసరించి లోనికి నడిచాడు. మెట్లముందరి గూర్ఖా సవినయంగా వంగి నమస్కరించాడు. లోపలకు వెళ్ళారు.

చల్లటి గాలితోపాటు చక్కటి పరిమళం వంటిని గిలిగింతలు పెట్టింది.

హాలులో వెండిపూత పూసినట్లు గోడలు మెరుస్తున్నాయి. నేలపైన ఎర్రటి తివాచి గోడలపై ఖరీదైన తైలవర్ణ చిత్రాలు వేలాడు తున్నాయి. పైన ఖరీదైన షాండ్లియర్స్. ఎక్కడినుండో తెరలు తెరలుగా సంగీతం గాలిలో తేలుతూ వస్తోంది.

అన్నింటికంటే ప్రధాన ఆకర్షణ అందరిన డుమ బంగారు తీగల్లా మెరుస్తూ హడావిడిగా తిరిగే వెయిట్రెస్‌లు. ఎయిర్ హోస్టెస్‌ల మాదిరిగా ఒకేరకం చీర కట్టుతో సాంప్రదాయబద్ధంగా వున్నారు.

"హల్లో సరోజ. యు ఆర్ లేట్" రావు గారి ఆహ్వానం వినబడింది.

ఆయన పక్కనే వున్న మిసెస్ రావు దగ్గరగా వచ్చి సరోజ చెయ్యి ఆప్యాయంగా




పట్టుకుంది.

"రావేమో అనుకున్నాను. పోనీలే ఇప్పటికైనా వచ్చావు"

"ఇదిగో వీరిని తీసుకుని వచ్చేసరికి కాస్త ఆలస్యం అయ్యింది"

"వీరు? " రావుగారు సందేహంగా అడిగారు.

"వీరు ప్రఖ్యాత రచయిత కార్తీక్ గారు"

ఒక్కసారిగా ఆయన కళ్ళు పెద్దవి అవుతాయనుకున్నాడు కార్తీక్. అతనిని మొదటిసారి కలిసినప్పుడు ఎదుటివాళ్ళ కళ్ళలో మెరిసే ఆ మెరుపు చూడడం అతనికి చాలా ఇష్టం. కాని ఈసారి అతని అంచనా తప్పింది.

"సారీ, సాహిత్యంతో నాకంతగా పరిచయంలేదు. ఎనీవే, నైస్ టు మీట్ యు" కరచాలనం చేస్తూ చెప్పాడాయన.

"నాకు మాత్రం మీరు బాగా తెలుసు. మీ నవలలు నేను చాలా చదివాను" ఆయన భార్య అతడిని ఓదారుస్తున్నట్లు చెప్పింది.

"ప్లీజ్ బి సీటెడ్" ఎదురుగా వున్న కుర్చీని చూపించి మరో రెండు నిముషాలు మాట్లాడాక సారీ చెప్పి మరొకరిని కలవడానికి వెళ్ళిపోయారు.

ఎప్పుడూ గలగల మాట్లాడే సరోజ కూడా ఇప్పుడు మౌనంగా చుట్టూ చూస్తోంది.

కార్తీక్ చుట్టూ పరిశీలనగా చూడసాగాడు. అంతా హడావిడి. పలకరింపులు, పరామర్శలు, ఖాతాఖానీలు వగైరా, వగైరా.

"హల్లో సరోజ" ఒకాయన దగ్గరగా వచ్చాడు.

ఖరీదైన దుస్తులలో చాలా ఖరీదుగా వున్నాడు. గోల్డ్‌ఫ్రేమ్ కళ్ళద్దాలు ఆయనకు హుందాతనాన్ని తెచ్చిపెడుతున్నాయి.

"హల్లో అంకుల్, మీరు కూడా వచ్చారా? " అడిగింది సరోజ.

"ఏమ్మా? నాన్నగారు బావున్నారా? మొన్నీమధ్య మద్రాస్ వచ్చి కలవలేదు. ఈసారి మీ ఇంటికి పోట్లాటకు వద్దామనుకుంటున్నాను" చెప్పాడాయన.

"ఆ పని చెయ్యొండంకుల్. ఈమధ్య నాన్నగారికి మరీ బద్ధకం ఎక్కువైపోయింది"

చెబుతూనే ఇటు తిరిగి, "కార్తీ! ఈయన మా అంకుల్, పెద్ద సినిమా నిర్మాత. అంకుల్ వీరుమంచి రైటర్, పేరు కార్తీక్"

కార్తీక్ చెయ్యి చాపాడు.

అతని చెయ్యి పట్టుకుని వూపుతూ చెప్పాడాయన.

"వెదకబోయిన తీగ కాలికి తగలడం అంటే ఇదే"

కార్తీక్‌కు అర్ధంకాలేదు. ఏమిటన్నట్లు చూశాడు.

ఇంతలో ఒక వెయిట్రస్ ట్రేలో కూల్ డ్రింక్స్ పెట్టుకుని వాళ్ళ దగ్గరకు వచ్చింది. ఆ గ్లాసులు కూడా కళాత్మకంగా వున్నాయి. బహుశా ఈ పార్టీ కొరకు ప్రత్యేకంగా తెప్పించి వుంటారు.

ముగ్గురూ మూడు గ్లాసులు అందుకున్నారు. "మీ తాజా నవల చదివాను. సినిమాగా ఆ సబ్జెక్ట్ పనికి వస్తుందనిపించింది. మా బ్యానర్ తెలుసుగా? న్యూవేవ్ కమర్షియల్స్. మా డైరెక్టర్‌కు కూడా మీ నవల నచ్చింది. మీకు కబురు చేసి మీతో మాట్లాడదామనుకుంటున్నాం. ఇంతలో మీరే ఇలా కలిశారు"

కార్తీక్ తన నవలల్లో...

"అతడు వెయ్యి ఓల్టుల కరెంట్ షాక్ తిన్నట్లు బిగుసుకుపోయాడు" అనిగాని,

"ఆనందం పట్టలేక భూమ్యాకాశాలు ఏకమయ్యేలా అరిచాడు" అని గాని రాస్తుంటాడు.

ఇప్పుడు మొదటిసారిగా అతనికి నిజంగా ఆ అనుభవం ఎదురైంది. ఒళ్ళంతా తిమ్మిరెక్కిపోయి గాల్లో నాట్యం చేస్తున్నట్లు అనిపించింది.

"థ్యాంక్స్" తేరుకుని చెప్పాడు.

"ఏమిటి అంత తేలికగా థ్యాంక్స్ చెప్పేశారు. సాధారణంగా మీ రచయితలు

కానీండి, రచయిత్రులు కానీండి తమ నవలను సినిమాకు ఇవ్వాలంటే లక్షా తొంభైతొమ్మిది షరతులు పెడతారు. మీకు అటువంటివి ఏమీలేవా? " అడిగారాయన.

"సారీసార్, మీరు ఎంత ఇవ్వదల్చుకున్నారో అంత కరక్ట్‌గా ఇచ్చెయ్యండి చాలు. ఇక మిగిలినవంటారా? లక్షలు ఖర్చుపెట్టి సినిమా తీసేది మీరు. మీకు నష్టం కలిగించే షరతులు ఎందుకు చెబుతాను? "

"అదీ బతకనేర్చినవాడు మాట్లాడవలసిన పద్ధతి. ఈమధ్య వీరభద్రం అని ఒక రచయితను కలిశాను. కథ ఇవ్వడానికి చాలా కండీషన్లు పెట్టాడు. హీరో పాత్ర చాలా ఉదాత్తంగా వుండాలంటాడు. హీరోయిన్ వంటినిండా బట్టలు వుండాలంటాడు. ఇలాంటివే చాలా చెప్పాడు. మీరు చెప్పండి ఇటువంటి నియమాలతో సినిమా ఫీల్డ్‌లో బతకగలమా? "

"మట్టికొట్టుకుపోతాం సార్. పొరపాటున కూడా అటువంటి ఆలోచనలురానివ్వకండి"

"చూశారా మన అభిప్రాయాలు ఎలా కలిసిపోయాయో? ఎంతైనా మేధావులంతా ఒకేలా ఆలోచిస్తారు"

కార్తీక్ మాట్లాడలేదు. వీరభద్రం అతని ఆలోచనల్లోనికి వచ్చాడు. అతను అంతే. ఈ జన్మకు మారడు. గడ్డిమేటు దగ్గర కుక్కలా తను తినడు. ఇంకొకళ్ళు తింటే అరచి గోలచేస్తాడు.

"కార్తీక్ మీరు ఓసారి మద్రాస్ రావాలి. మా ఆఫీస్‌కు వస్తే అన్ని విషయాలు వివరంగా మాట్లాడదాం" చెప్పాడాయన.

కార్తీక్ ఒప్పుకున్నాడు. మరి కాస్సేపు ప్రస్తుత సినిమా బిజినెస్ గురించి మాట్లాడాక ఆయన మరోవైపు వెళ్ళిపోయాడు.

గ్లాసులో డ్రింక్ అంతా ఒక్కసారే తాగేశాడు. ఇప్పుడు సినిమా ఫీల్డ్‌లో మన జండా పాతాలి. మన గొప్పతనాన్ని పరీక్షించి చూసుకోవడానికి మరోరంగం దొరికింది.

ఎంత అణుచుకున్నా అతని మనస్సులోని ఆనందం పైకి తెలిసిపోతోంది.

"చూశావా? నా ఫ్రెండ్‌షిప్ నీకు ఎలా కలిసి వస్తోందో? ఈ కేదారి వెనుకే అదృష్టం వుంటుంది" చెప్పింది సరోజ.

ఈలోగా శేషగిరిరావు దంపతులు కనిపించి సరోజ అటువైపు నడిచింది. కార్తీక్ అక్కడే నిలబడివున్నాడు.

సరోజ శేషగిరిరావుతో ఏదో మాట్లాడుతోంది. ఆయన భార్య కార్తీక్ వద్దకు వచ్చింది.

"మీకు సినిమా ఛాన్స్ వచ్చిందట కదా? " ఆమె అడిగింది.

"అఫ్‌కోర్స్" చెప్పాడు. "ఇంతకుముందు ఇద్దరు ముగ్గురు నిర్మాతలు అడిగారు. టర్మ్స్ కుదరక ఒప్పుకోలేదు. ఇప్పుడైనా వాళ్ళతో వ్యక్తిగతంగా మాట్లాడితే తప్ప చెప్పలేను"

నిజానికి అతన్ని ఏ నిర్మాతా కథ అడగలేదు. ఇదే మొదటి ఛాన్స్. మరి ఆమె ముందు అలా ఎందుకు అబద్ధం చెప్పాడో తనకే తెలీదు.

"ఏమైనా మీరు చాలా అదృష్టవంతులు. ఏపని చేసినా విజయం సాధిస్తారు"

ఈమాట నిజమే కావచ్చుగాని అందమైన ఆడదానిముందు సమర్థుడైన మగవాని ముందు అదృష్టం ఎప్పుడూ మోకరిల్లుతుంది.

"మా సరోజను మీరు పెళ్ళిచేసుకోబోతున్నారట కదా? "

"ఎవరు చెప్పారు? " ఆశ్చర్యంగా అడిగాడు.

"సరోజ చెప్పింది. మీ భార్యతో విడాకుల కొరకు అప్లయ్ చేశారట కదా? విడాకులు మంజూరు కాగానే తనను పెళ్ళిచేసుకోబోతున్నారని చెప్పింది. అదే నిజమైతే మీరు ఈ ప్రపంచంలోనే మొదటి అదృష్టవంతుడవుతారు"

కాదు, ఈ ప్రపంచంలోనే మొదటి దుర





దృష్టవంతుడినవుతాను. పార్వతిని వదులుకుని సరోజని పెళ్ళిచేసుకోవడం అంటే చేతిలో వున్న అమృతభాండాన్ని వదిలి కల్లుముంత కోసం పరుగులు పెట్టడం. అటువంటి తెలివి తక్కువపని ఏ బుర్రన్నవాడూ చెయ్యడు.

తను త్వరగా సరోజకు బుద్ధి చెప్పాలి. ఆమెను వదిలించుకోవాలి.

తనలోతనే నవ్వుకున్నాడు. అతని నవ్వును మిసెస్‌రావు మరోవిధంగా ఊహించింది. "బెస్టాఫ్‌లక్" చెప్పి నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

సరోజ తిరిగి కార్తీక్ దగ్గరకు వచ్చింది. పదిమందినీ ఆకర్షించేలా పెద్దగా నవ్వుతూ, గట్టిగా మాట్లాడుతూ రకరకాలుగా ప్రవర్తిస్తుందామె. అతని మనస్సు సరోజపైలేదు. ఈ ఆనందాన్ని ఎంత త్వరగా పార్వతితో పంచుకుందామా అని వుంది. కాని సరోజ వదలడంలేదు. వసపిట్టలా వాగుతూనే వుంది.

కష్టమైనా భరిస్తూనే వున్నాడు కార్తీక్



ఆ రోజు కార్తీక్ ఇంటికి వినోద్ వచ్చాడు. ఈమధ్యకాలంలో అతను వినోద్‌ను కలవలేదు. రేణుక హత్యకేసు ముగిసిన తర్వాత వాళ్ళు మళ్ళీ ఇదే కలుసుకోవడం.

"గురూజీ మీకు 'ఎదురు దాడి' అనే పత్రిక తెలుసా?"

"తెలుసు. సమాజంలో పేరుప్రఖ్యాతలున్న ప్రతీ వాళ్ళపైన అవాకులు చవాకులు రాసే పత్రిక అవునా?"

"ఆ పత్రిక ముఖచిత్రం ఈసారి మీదే. మీరు అమ్మాయిలను ఇతర దేశాలకు అమ్మేస్తున్నారట. పెద్దపెద్ద వాళ్ళకు అమ్మాయిలను సప్లయ్‌చేస్తారట. మీ డబ్బంతా అలానే సంపాదించారట. మీవల్లనే ఒక అమ్మాయి చనిపోయిందట" గబగబా చెప్పాడు.

కార్తీక్ మాట్లాడలేదు. సోఫాలో వెనక్కు జారబడి కూర్చున్నాడు. ఎల్లో జర్నలిజం అలానే వుంటుంది. దానికి సాక్ష్యాలు, ఆధారాలు అక్కరలేదు. ప్రతీవాక్యానికి చివర 'ట' అనే అక్షరం చేరిస్తే చాలు.

"కోర్టుకు వెళ్ళొచ్చేమో?" వినోద్ అడిగాడు.

"వద్దు వినోద్, బురదలో రాయి వేస్తే మనపైనే పడుతుంది. మనం కోర్టుకు వెడితే మనపై నాలుగు రాళ్ళు వేసి పేరు సంపాదించేద్దామనుకుంటున్న వాళ్ళ దురాశ నిజం చేసినట్లు అవుతుంది. వదిలేయ్"

"అదికాదు గురూజీ..." ఏదో చెప్పబోతున్నవాడల్లా ఆగిపోయాడు. కార్తీక్ వెనుకకు చూస్తున్న అతని చూపు అలానే వుండిపోయిది.

కార్తీక్ వెనక్కు చూడలేదు. అతని ముఖంలో భావాలు చదువుతూ వుండిపోయాడు. రేఖ ఒక పళ్ళెంలో బిస్కెట్లు, టీ పెట్టుకుని వచ్చి టీపాయ్‌పై పెట్టింది.

"మా పెదనాన్నగారి అమ్మాయి. పేరు రేఖ. ఈమధ్య ఒక యాక్సిడెంట్‌లో వాళ్ళ నాన్నగారు మరణించారు. అందువల్ల మాతో వుంటోంది" పరిచయం చేశాడు.

ఆ తర్వాత చాలాసార్లు వినోద్ వాళ్ళ ఇంటికి వచ్చేవాడు. రేఖతో అతని పరిచయం రోజురోజుకు పెరుగుతోంది.

పార్వతితో ఈ విషయం మాట్లాడాడు. వినోద్ రేఖవైపు ఆకర్షించబడుతున్నాడని అర్థమయింది. కాని అనాథ అని చెబితే పెళ్ళి చేసుకుంటానంటాడో లేదో! అందుకే తను చెప్పిన అబద్ధాన్ని అలాగే వుంచేద్దామనుకున్నాడు. రేఖను పిలిచి ఈ విషయం చెప్పాడు.

"నేను ఆయనకు మొత్తం చెప్పానన్నయ్యా! ఒక దశలో పొట్టకూటికోసం ఒక హోటల్లో ఎంగిలి పళ్ళాలు కడిగానని కూడా చెప్పాను" అంది రేఖ.

కార్తీక్‌కు మతిపోయినట్లయ్యింది. ఇక వినోద్ రేఖను పెళ్ళి చేసుకోవడం కలలో మాట. అతనికి చాలా బాధ కలిగింది.

"చాలా తొందరపడ్డావమ్మా. అతనితో అన్నీ మాట్లాడేముందు నాతో చెప్పవలసింది. లేదా కనీసం మీ వదినతోనైనా చెప్పవలసింది"





"వదిన మొత్తం చెప్పేయమన్నద న్నయ్యా. జీవితాంతం కలిసి మెలిసి బతక వలసిన భార్యాభర్తలమధ్య రహస్యాలు వుండకూడదంది. నాకూ నిజమే అనిపిం చింది. పెళ్ళయ్యాక మేము కూడా మీలాగే ఒకే ప్రాణం, రెండు శరీరాలుగా వుండాలి. అంతేగాని ఒకే బోనులో బంధించబడ్డ రెండు వేర్వేరు జాతులకు చెందిన జంతు వులు కాకూడదు"

ఒక్కక్షణం ఆగి తిరిగి చెప్పింది.

"ప్రేమ అనేదానిలో మోసానికి తావు ఎక్కడ వుందన్నయ్యా. నేను నీ అంత తెలి వైనదానిని కాదు. ఎక్కువ చదువుకోలేదు. కాని నా ఆశయం ఒక్కటే. నేను పార్వతి వదినలా వుండాలి. ఈ ప్రపంచంలో అన్నిం టికంటే ఎక్కువగా నా భర్త నన్ను ప్రేమిం చాలి. నిజంగా ఆయన నన్నే ప్రేమిస్తే నా గతంతో సంబంధం లేకుండా నన్ను పెళ్ళిచే సుకుంటారు. లేదా నాన్నగారు చనిపోవడం లానే ఇదీ ఒక యాక్సిడెంట్ అని సరిపెట్టు కుంటాను"

చాలాసేపు కార్తీక్‌ను రేఖ మాటలు వెంబడించాయి. ఆ అమ్మాయి జీవితాన్ని కాచివడబోసిన తీరులో మాట్లాడింది. ఆమె మాట్లాడిన ప్రతి మాటా నిజమే. ఈ దేశంలో పెళ్ళి పేరుతో బద్ధశత్రువులు ఒకే ఇంట కాపురం వుంటున్నారు. ఏమాత్రం మనస్సులు కలవక, అభిప్రాయాలు కలువ కుండా పాము, ముంగీసలా ఒకే చూరు కింద కలిసి బతుకుతున్నారు.

నిజానికి మనుష్యులని తాళి అనే పసుపు తాడుతో కట్టెయ్యవచ్చు. కాని మనసులను ఏ తాడూ కట్టెయ్యలేదు. కాబట్టే మగవాళ్ళు వ్యభిచరిస్తున్నారు. తాము పొందలేనిసుఖం ఎక్కడైనా వుందేమో అని చీకట్లో పిచ్చివా ళ్ళలా వెతుక్కుంటున్నారు. ఆడవాళ్ళు సాధింపులతో, తగాదాలతో బతుకుతు న్నారు. మనస్సును సరిపెట్టుకుని, తాము పవిత్రులమనే భ్రాంతిలో బతుకులు వెళ్ళదీ స్తున్నారు.

"ఏమిటి అంత తీక్షణంగా ఆలోచిస్తు న్నారు? "

పార్వతి వచ్చి అతని పక్కనే కూర్చుంది.

"రేఖ పెళ్లి గురించి..." చెప్పాడు.

"ఆలోచించడానికేముంది? వాళ్లిద్దరూ ప్రేమించుకున్నారు. పెద్ద వాళ్లుగా నాలుగు అక్షింతలు వేసేద్దాం"

"చాలా తేలికగా చెప్పావు. కాని ఆవిడ గారు నీ సలహాపై తన గత చరిత్రనంతా వినోద్‌కు చెప్పిందట. ఇప్పుడు వినోద్ ఈ పెళ్లికి అంగీకరించాలికదా? " కాస్త కోపం గానే చెప్పాడు.

"రేఖను నిజంగా ప్రేమిస్తే ఖచ్చితంగా ఒప్పుకుంటాడు. ఒప్పుకోకపోతే అటువంటి చపల మనస్కుడికి రేఖను ఇవ్వకపోవడమే మంచిదని సరిపెట్టుకుందాం, కార్తీ! ప్రస్తుతం టీనేజ్ పిల్లలు ఈ ప్రేమవల్ల చాలా ఇబ్బందుల పాలవుతున్నారు. శారీ రక ఆకర్షణే ప్రేమ అనుకుని తొందరపడి ఆనక జీవితంలో అన్నివిధాల ఓడిపోతు న్నారు. అందుకే రేఖకు అలా సలహా ఇచ్చాను"

"బానే వుంది. మరి ఆ అమ్మాయికి పెళ్లి ఎలా అవుతుంది? "

"లీవిట్ బాస్. పెళ్లి జరుగుతుంది. కాని నాదో చిన్న సందేహం. ఒకవేళ వినోద్‌వాళ్ల నాన్నగారు కట్నం అడిగితే ఎలా? ఎవరి స్తారు? "

"ఇంకెవరు? నేనే ఇస్తాను. నాకు చెల్లెలు వుంటే ఇవ్వనా? రేఖను దేవుడు నాకిచ్చిన చెల్లెలుగానే భావిస్తాను. వినోద్ ఒప్పుకోవా లేగాని అతను అడిగినంత కట్నమిచ్చి రంగ రంగ వైభవంగా పెళ్లి జరిపిస్తాను. రేఖ బాధ్యత పూర్తిగా నేనే తీసుకుంటాను" కొద్దిగా ఆవేశంగానే అన్నాడు.

చటుక్కున అతని తలను ముందుకు లాగి నుదుటిపై ముద్దు పెట్టుకుంది పార్వతి.





"థ్యాంక్స్ కార్తీ"

"ఎందుకు? "

"ఆలోచించండి. మీకే తెలుస్తుంది" చెప్పి లోపలికి వెళ్లిపోయింది.

ఆలోచించకుండానే అతనికి తెలిసింది. తను రానురాను లోభిగా మారుతున్నానే మోనని పార్వతి భయం. తన గుండెలలో తడి పూర్తిగా ఆరిపోలేదనీ, తను కూడా కొన్ని విషయాలకు స్పందించగలడనీ అని పించి వుంటుంది.

నిజానికి తను డబ్బుకు విలువ ఇస్తాడు. చిన్నతనం నుండి ప్రతీ పైసాకు ముఖం చూసుకుంటూ బతికిన తనకు తెలుసు డబ్బు ఎంత విలువైందో. అంత మాత్రాన డబ్బు ఖర్చు చెయ్యకుండా ఇనప్పెట్టెలో ఎలా దాస్తాడు? అలా దాస్తే ప్రపంచ సుందరిని తొంభై ఏళ్ల ముసలాడికిచ్చి పెళ్లి చేసినట్లు వుంటుంది. అంతేకదా?

★ ★ ★

ఈమధ్య కాలంలో సాహిత్యంలో పెను మార్పులు సంభవించాయి. ఇంతకు ముందు సాంఘీక నవలలు, డిటెక్టివ్ నవ లలు అంటూ రెండు రకాలు వుండేవి.

ఇప్పుడు రెండూ కలిసిపోయాయి. ఇన్ఫ ర్మేషన్ నవలలు ఎక్కువైపోయాయి. దానికి తోడు సైన్స్ ఫిక్షన్ మరోపక్క ఊపే స్తోంది.

ఇదివరలో 'అతనికి కోపం వచ్చింది. ముఖమంతా ఎర్రబారిపోయింది. కసిగా అతని పిడికిళ్లు బిగుసుకున్నాయి' అని రాసే వాళ్లు.

ఇప్పుడు అదే వాక్యాన్ని 'అతనికి కోపం వచ్చింది. అతని అడ్రినల్ గ్రంధులనుండి అడ్రినల్ హార్మోను అధికంగా ఉత్పత్తి అయ్యింది' (అడ్రినల్ గ్రంధులు మూత్రపిం డాలకు పైభాగాన వుంటాయి. వీటివలన కోపం, భయం, ఆందోళన మొదలగు భావాలు కలిగినప్పుడు...) ఈ రకంగా సాగి పోతుంది సొద.

ఇంత గందరగోళం మధ్య తను అనుకు న్నట్లు రాయడమంటే నిజంగా సర్కస్ఫీట్. అయినా ఒక నెల రోజులు అన్నీ మరిచి నిద్ర, తిండి కూడా వదిలి రాశాడు. తాతగా రివల్ల తనకు సంక్రమించిన భాషా పరిజ్ఞా నాన్నంతా ఉపయోగించి రాశాడు. ఒక మంచి వచన కావ్యాన్ని తయారుచేశాడు. దానికి పేరు పెట్టడానికి కూడా కార్తీక్ చాలా ఆలోచించాడు.

చివరకు 'అసతోమా' అని నిర్ణయించాడు. పార్వతికి కూడా అది నచ్చింది.

చాలాకాలం తర్వాత వచ్చిన మంచి రచ నగా అది అందరి ప్రశంసలు, మన్ననలు పొందింది. దానివల్ల కార్తీక్కు ఒరిగిందేమీ లేదు. దానికి పడ్డ కష్టంలో ఐదో వంతు పడితే దానికి మూడు రెట్లు అతనికి ఆర్థి కంగా లాభం చేకూరేది. అందుకే మరో ఆలోచన లేకుండా మరో పత్రికలో ఒక సీరి యల్ ప్రారంభించాడు.

అది సక్సస్ అయ్యింది. నిజానికి ఈ రకంగా రాయడానికి అతను అలవాటుపడి పోయున్నాడు.

ఒక సూపర్ హీరో, అందగత్తె, అసాధా రణ తెలివితేటలు గల హీరోయిన్, ఒక విలన్ అంతే. నవలలో కొన్ని హత్యలు తప్పనిసరి. ఖచ్చితంగా నవలలు సక్సెస్ అవుతున్నాయి.

బంగారు గుడ్లు పెట్టే బాతును చంపుకో వడాన్ని వెర్రివాళ్లు మాత్రమే చేయగలరు.

★ ★ ★

నవలలు సినిమాగా తీసే ప్రక్రియ గురించి కార్తీక్కు ముందే తెలుసు. కాని సినిమాకొరకే నవలలు రాయడం అనేది ప్రారంభం కాలేదింకా.

గతంలో చాలా నవలలు సినిమాలుగా వచ్చాయి. ఆ తర్వాత కొంతకాలం నిర్మా తలు నవలల్ని మర్చిపోయారు. కార్తీక్

తొలి నవల సినిమాగా హిట్టయ్యింది. దానితో మరి రెండు నవలలు సినిమాలుగా తయారవ్వసాగాయి.

ఈ ఊపుతో రచయితలు సినిమా కొరకే నవలలు రాయడం మొదలుపెట్టారు. నవల ప్లాన్ చెయ్యడమే సినిమాకు పనికివచ్చేలా రాసెయ్యడం ఆరంభించారు. వీలైతే ఎక్కడ పాటలు వుండాలో, ఎక్కడ ఫైట్స్ వుండాలో రచయితలే నిర్ణయించేస్తున్నారు.

ఒకసారి కార్తీక్ సినిమా షూటింగ్ కొరకు ఊటీ వెళ్లాడు. అందరు రచయితలలా అతను కథ ఇచ్చేసి ఊరుకోడు. ఆ సినిమా షూటింగ్‌లో పాల్గొంటాడు. ఆవిధంగా పెద్దపెద్ద దర్శకుల సహవాసం అతనికి లభిస్తుంది. ఏదో ఒక రోజు దర్శకుడినవాలనుకుంటున్నాడతను.

ఊటీలో వుండగా సరోజ కార్తీక్‌ను వెదుక్కుంటూ వచ్చింది. ఆమె తన కొరకు అంత దూరం ఎందుకు వచ్చిందో కార్తీక్‌కు అర్థం కాలేదు.

ఆ రోజంతా అతడిని అంటిపెట్టుకునే వుందామె.

కార్తీక్ పగలంతా షూటింగ్ స్పాట్‌లో వుంటాడు. రాత్రివేళ అతనికి ప్రత్యేకమైన హోటల్ గదివుంది. పగలంతా సినిమా హడావిడిలో వున్నా రాత్రివేళ తన గదిలో కూర్చుని రాసుకుంటాడు.

అప్పటికి అతనివి మూడు పత్రికలలో మూడు సీరియల్స్ నడుస్తున్నాయి. ఇదివరకులా మొత్తం నవలంతా రాసి ఇచ్చే పద్ధతిలేదు. ఏ వారం ఇన్‌స్టాల్‌మెంట్ ఆవారం రాయడమే. సీరియల్ సక్సెస్ అయితే ఇరవై వారాలనుకున్నది యాభై వారాలు చెయ్యడం, ఫ్లాపయితే తగ్గించడం. ఈ వాయిదాల పద్ధతిలో అతను ఆలస్యం చేస్తే పత్రిక ఆలస్యం అవుతుంది. అది అతనికి ఇష్టంలేదు. అందుకే కష్టమే అయినా ఎప్పటివర్క్ అప్పుడు కంప్లీట్ చేసేస్తాడు.





ఆరోజు షూటింగ్ పూర్తి అయ్యేసరికి చాలా రాత్రయ్యింది. ఆ రోజు తనతో తన గదికి రమ్మని సరోజ పట్టుబట్టింది. కార్తీక్ తప్పించుకుందామని ప్రయత్నించాడు.

అర్జంటుగా మాట్లాడవలసిన పని వుందని తొందర చేసింది. అప్పటికి ఆమె అంతరంగం అతనికి అర్థమయ్యింది. ఆమె తనతో ఏ విషయం మాట్లాడుతుందో అతడు ఊహించగలిగాడు.

కార్తీక్ కళ్ల ముందు గతం ఇంకా కదులుతోంది. మనస్ఫూర్తిగా ప్రేమించి ఆమె లేనిదే బతకలేనని పెళ్లి చేసుకుందామని మోకాళ్లపై మోకరిల్లి ప్రార్థించిన తనను ఆమె ఈసడించింది. ఎందుకూ కొరగానివాడివంది. తన స్థాయికి తగనివాడివంది. తన కాళ్లు పట్టుకుని పైకి రావడానికి ప్రయత్నిస్తున్నావంది. మరి ఈ రోజు ఏ ముఖం పెట్టుకుని తనను పెళ్లి చేసుకోమంటోంది? అదీ రెండో భార్యగా? ఇదంతా ఆత్మవంచన కాకమరేమిటి?

వీధుల వెంబడి చాలా చలిగా వుంది. కార్తీక్ జేబులలో చేతులు పెట్టి నడవసాగాడు. సరోజ దాదాపు అతనిపై వాలిపోతోంది. సరోజ వుంటున్న హోటల్ గదికి చేరారు.

"కార్తీ! నాన్నగారు నాకు పెళ్లి చెయ్యాలని తొందరపడుతున్నారు" చెప్పింది.

"చేసుకో సరోజా. ఎన్నాళ్లు ఒంటరిగా వుంటావు? "

సరోజ మాట్లాడలేదు. టేబుల్‌పై వున్న ఫ్లాస్క్ నుండి టీ రెండు కప్పుల్లోకి వంచింది. కార్తీక్ కూడా మాట్లాడకుండా ఆమె చేష్టలు గమనిస్తున్నాడు. ముందుగా బయట పడటం అతనికి ఇష్టంలేదు. ఆమె ఏమి చెబుతుందో పూర్తిగా విన్న తర్వాత తన వంతు తాను చెబుతాడు. ఎంతైనా బదులు తీర్చుకోవలసిన బాధ్యత తనపై కూడా వుందికదా?

ఒక కప్పు తేనీరు అతనికి ఇచ్చింది. ఆ చలి వాతావరణంలో వేడివేడి టీ తాగు

తుంటే ప్రాణం లేచివచ్చినట్లయ్యింది.

"కార్తీ! నీవు నాకు ప్రాణంతో సమానం. ఆ రోజులు ఒక్కసారి గుర్తుకు తెచ్చుకో. ఒకళ్లు లేకుండా ఒకరం బతకలేమన్నట్లు వుండేవాళ్లం. పెళ్లి చేసుకుని సుఖంగా బతకాలని ఎన్నెన్ని కలలుగనే వాళ్లం"

"కాని నన్ను పెళ్లి చేసుకోవడం ఇష్టంలేదనీ, నేను నీ అంత గొప్పవాడిని కానని చెప్పావుకదా? " అమాయకంగా అడిగినట్లు అడిగాడు.

"కార్తీ! ఆ రోజు ఏదో సరదాగా నిన్ను ఏడిపించాలని అలా చెప్పాను. తర్వాత వచ్చి నీతో నిజం చెబుదామనుకున్నాను. ఆ రాత్రి మా అత్తయ్యకు ఒంట్లో బాగా లేదని కబురు వచ్చింది. వెళ్లాను. మా అత్తయ్య చనిపోయేముందు నన్ను బావను చేసుకుంటానని మాట ఇమ్మంది. అందరూ నన్ను బలవంత పెట్టారు. మనసు రాయి చేసుకుని మాట ఇచ్చాను. నీకు ముఖం చూపించలేకపోయాను. పెళ్లి జరిగిపోయింది. ఇష్టంలేకుండా ఎన్నాళ్లు కాపురం చెయ్యను. అందుకే విడాకులు ఇచ్చేశాను. అప్పటికే నీకు పార్వతితో పెళ్లి అయిపోయిందని తెలిసింది. దూరంగా ఎక్కడికైనా వెళ్లిపోదామనుకున్నాను. నిన్ను వదిలి వెళ్లడం నావల్ల కాలేదు. అందుకే తప్పయినా, ఒప్పయినా నిన్ను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను" ఎక్కడో శూన్యంలోకి చూస్తూ చెప్పింది.

వారేవా! కథలు అమ్ముకునేవాడికి కథలు చెబుతోంది. మంచి సూపర్‌హిట్ సినిమాకు పనికివచ్చే కథ! తమ అదృష్టం బావుండి సరోజ ఈ రంగంలోకి రాలేదు గానీ వచ్చుంటే తమ రచయితలు మట్టికొట్టుకుపోదురు.

"నా పెళ్లి పార్వతితో అయిపోయింది" చెప్పాడు.

"కార్తీక్! అయితే మాత్రం ఏం కొంప మునిగింది. పార్వతికి విడాకులు ఇచ్చేసెయ్. నన్ను పెళ్లిచేసుకో"

కార్తీక్ మాట్లాడకుండా టీ తాగడంలో మునిగిపోయాడు. తను కూర్చున్న చోటు నుండి లేచివచ్చి అతని కుర్చీకోడుపై కూర్చుని అతని మెడచుట్టూ చేతులువేసి గారంగా అడిగింది సరోజ.

"ఏం? నేనంటే నీకు ఇష్టంలేదా? "

"ఉంది"

"మరేమిటి ఆలోచిస్తున్నావ్? "

"పార్వతిని వదిలి నిన్ను చేసుకోమంటున్నావు కానీ పార్వతి ఇప్పుడు గర్భవతి"

అంత దగ్గరగా వున్న సరోజ ఒంటి స్పర్శ అతనిలో గిలిగింతలు రేపుతోంది. ఈ చలి రాత్రి వెచ్చని సరోజ కౌగిలిలో ఒకే దుప్పటి కింద ఆ ఊహకే అతని నరాలు జివ్వుమంటున్నాయి.

"కావాలంటే ఒక లక్షో, రెండు లక్షలో ఆ పుట్టే పిల్ల ముఖాన పారేద్దాం" చెప్పింది సరోజ.

ఆ మాటతో అతని మనసు చివుక్కుమంది. కాని ముఖంలో ఏ భావం కనబడకుండా జాగ్రత్తపడ్డాడు.

"నీకోసం పార్వతివంటి అందగత్తెను వదులు కోవాలన్నమాట"

"పార్వతికంటే నేను వెయ్యిరెట్లు అందంగా వుంటానని అందరికీ తెలుసు" ఉక్రోషంగా అంది.

"ఏమోమరి? పార్వతిని నేను బట్టలు లేకుండా చూశాను"

"ఏయ్ నాటీబోయ్. నీ అసలు కోరిక అదన్నమాట" నవ్వుతూ అంది.

అంటూనే లేచి కార్తీక్‌కు కొద్ది దూరంలో నిలబడింది. మరుక్షణం అతనిలోని మిస్టర్ హైడ్ బయటకు వచ్చేశాడు.

ఆమె శరీరం నుండి వేరవుతున్న వలువలను ఆసక్తిగా గమనిస్తున్నాడు.

సరోజ చాలా అందగత్తె. ఆ అందాన్నంతా పరిపూర్ణంగా ఆస్వాదించే అవకాశం అతనికిప్పుడు లభించింది.

అతనిలోని మిస్టర్ హైడ్ ఆమెను అను భవించమంటున్నాడు.

ఇంతలోనే...

పార్వతి అమాయకమైన ముఖం గుర్తుకు వచ్చింది. పసిపాప కళ్ళలా వుండే ఆమె కళ్ళలో తనపట్ల అపారమైన నమ్మకం అత నికి కనబడుతోంది.

అంతే ఆ తర్వాత అతనిలో కోరిక పడగ విప్పి ఆడటం మానేసింది.

కూర్చున్నచోటునుండి లేచాడు కార్తీక్.

త్యాగమూర్తిగా, అనురాగమయిగా, పవి త్రనారిగా, భూదేవిగా స్త్రీని గురించి చెబు తారు.

ఇక్కడ వున్న ఈ ఆడది మాత్రం స్వార్థా నికి, కుత్సితత్వానికి, అహంకారానికి మచ్చు తునక.

గబగబా తలుపు దగ్గరకు నడిచాడు.

"కార్తీ!" గాబరాగా పిలిచిందామె.

తలుపు సగం తెరిచి గిర్రున వెనుకకు తిరిగాడు. వాళ్ళ కళ్ళు కలుసుకున్నాయి.

"సరోజా! ఒకప్పుడు ఈ మనిషినే చెదపు రుగని, ఆఫ్టాల్ అని తీసిపారేశావు. ఇప్పుడు అదే అర్భకుడి ముందు వివస్త్రగా అన్నీ అర్పించుకోడానికి సిద్ధపడ్డావు. కాని నేను మరీ అంత స్వార్థపరుడినేం కాను. నాతో బెడ్ షేర్ చేసుకోవాలన్నా కొన్ని అర్హ తలు కావాలి. నీకు అర్హతలు లేవు. సూటిగా చెప్పాలంటే నువ్వు నాకు పనికి రావు. నా కారు డ్రైవర్‌కు తప్పించి"

ఈ మాటలు ఏవీ అతను అనలేదు. కళ్ళ తోనే చెప్పాడు. చెప్పి బయటకు నడిచాడు. అతని వెనుకే ఆ గది తలుపూ మూసుకు పోయింది.

దానితోపాటే సరోజ కూడా అతని జీవి తంనుండి నిష్క్రమించింది.

ఆ తర్వాత ఆమె ఏమయ్యిందో అతనికి తెలీదు. నిజానికి ఆత్మాభిమానం వున్న ఆడ దయితే ఆత్మహత్య చేసుకోవాలి. కాని ఆమె సరోజ. అలా ఎన్నటికీ చేయదు. జరిగిన దాన్ని మర్చిపోయి మరో వ్యక్తిని పెళ్ళాడి హాయిగా జీవితం గడిపేస్తుంది.

★ ★ ★

కార్తీక్ ఊటీలో వున్నప్పుడు ఒక శుభ వార్త తెలిసింది. అతనికి పెద్ద అవార్డు ఒకటి లభించింది. "అసతోమా సద్గమయ" రచనలోని ఉన్నత మానవ విలువలకు కట్టిన పట్టంగా ఆ అవార్డును వర్ణించారు. న్యూస్‌పేపర్స్ హెడ్‌లైన్స్‌లోకి కార్తీక్ చొరబ డ్డాడు. టి.వి. న్యూస్‌లో అతని ఫోటోతో పాటు ఈ సమాచారం, అతని వివరాలు వచ్చాయి. ఈ అవార్డ్ తీసుకున్న మొదటి వానిగా అతనిపేరు నమోదయ్యింది.

ఆరోజు అతనికి కలిగిన సంతోషం అంతాఇంతా కాదు. ఏ కీర్తికాంతను వరిం చాలని చిన్నతనంనుండి కలలు కన్నాడో అది ఇప్పటికి సాధ్యపడింది.

తాతగారి మనుమడిగా తను ఒక మహ త్కార్యాన్ని సాధించాడు. నిజం చెప్పాలంటే తాతగారికంటే ఎక్కువే సాధించాడు. అతని స్వర్ణస్వప్నం, అతని బంగారు కల నిజ మైంది.

ఎంతో కష్టమనుకున్న ఆపరేషన్ విజయ వంతమైన తర్వాత ఒక డాక్టర్ పొందే ఆనందం ఇలానే వుంటుందేమో.

అతనికి ఈ వార్త ఎప్పుడెప్పుడు పార్వతికి చెబుదామా అని వుంది. కాని సినిమా యూనిట్‌వాళ్ళు ఆరోజు పార్టీ ఏర్పాటుచే శారు. తర్వాతరోజు ఇంటికి బయలుదే రాడు.

ఈపాటికే పార్వతి ఈ ఆనందాన్ని సెల బ్రేట్ చేస్తుందేమో. ఎందుకంటే అతనికి సంబంధించిన ప్రతీ వార్త అతనికంటే ముందే పార్వతి సేకరిస్తుంది. కుప్పలు తెప్పలుగా వస్తున్న అభినందన టెలీగ్రా మ్స్‌ని, గ్రీటింగ్స్‌ని వరుసలలో దాస్తూ, వస్తున్న టెలిఫోన్ కాల్స్‌కు సమాధానాలు




చెబుతూ పార్వతి చాలా బిజీగా వుండివుంటుంది.

ఇల్లు చేరగానే లోపలికి పరిగెత్తాడు. కాని ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. అతని మనస్సు విపరీతమైన ఆందోళనకు గురయ్యింది. ఒక్కొక్క గదినే చూసుకుంటూ వస్తున్నాడు.

తన నవలలలో పాఠకులను ఇలా సస్పెన్స్‌లో పెట్టడం అతనికి అలవాటు. ఇప్పుడు అతను అదే పరిస్థితిలో చిక్కుకున్నాడు. ఒక్కసారి ఆగి స్థిమితంగా ఆలోచించడం మొదలుపెట్టాడు.

ఇంటిలో మనుషులు తిరుగుతున్న అలికిడి వినబడుతోంది. కాని మనుషులు కనబడటంలేదు. మరి ఎక్కడ వున్నారు? ఇల్లంతా వెదికాడు. ఇంక వెదకవలసింది పైఅంతస్థు మాత్రమే. అటువైపు నడిచాడు.

పై అంతస్థు చేరగానే ఆగిపోయాడు. అక్కడ ఎన్నెన్నో దీపాలు వినీలాకాశంలో నక్షత్రాల్లా మెరుస్తున్నాయి. వెనుక గోడపై సుస్వాగతం అనే అక్షరాలు ఆ దీపాల వెలుగులో మెరుస్తున్నాయి. దీపాల వెలుగులో పార్వతి అమృతం పంచడానికి వచ్చిన జగన్మోహినిలా వుంది.

ఎందరెందరో ప్రముఖులు అక్కడ వున్నారు. కార్తిక్ రాగానే ఒక రిథమ్‌లో చప్పట్లు మోగాయి. అతను బయలుదేరినట్లు సినిమా యూనిట్ వాళ్ళు ఊటీనుండి ఫోన్‌చేశారు. వెంటనే మిత్రులు ఈ పార్టీ ఏర్పాటు చేశారు.

"కంగ్రాట్యులేషన్స్ గురూ! తెలుగు వాడి పేరు దేశమంతా తెలిసేలా చేశావు. మనకు కూడా మెదడనే పదార్థం వుందని నిరూపించావు" శర్మ తనధోరణిలో చెప్పాడు.

"కమర్షియల్ రచనలు చేస్తూ కూడా ఇటువంటి పురస్కారానికి అర్హమైన రచనలు చెయ్యడం నిజంగా కత్తిమీద సాము. అది నీవు సాధించావు" రావుగారు చెప్పారు.

అలా ఒకరి వెనుక ఒకరు అభినందనలు తెలియజేస్తున్నారు.

అప్పుడు అతనిలో పెల్లుబికిన భావానికి ఆనందం అనే పేరు పెడితే అది చాలా చిన్నదవుతుంది.

పార్టీ అంతా అయిపోయాక పార్వతి అడిగింది. "కార్తీ! ఎప్పుడూ ఇలా మంచి రచనలు చెయ్యకూడదా? "

"ఎందుకు? " ప్రశ్నించాడు. "పారూ! నీవు నాణానికి ఒకవైపే ఆలోచిస్తున్నావు. ఇటువంటి గ్రంథరాజాలను రాసుకుంటూపోతుంటే మెచ్చి కనకాభిషేకాలు చెయ్యడానికి శ్రీకృష్ణదేవరాయల కాలం కాదిది. ఆహా ఒహో అని జనం మెచ్చుకోవచ్చు కాని చప్పట్లు కడుపునింపవు. ఒక్కసారి చరిత్రలో లోనికి వెళ్ళు. నీతికి నిజాయితీకి నిలబడి ప్రజల కొరకు బతికిన నాయకులు తమ వారసులకు ఏంమిగిల్చారు?

"కోట్ల విలువచేసే ఆస్తిపాస్తులు దేశం కొరకు ధారపోసి చివరిదశలో పిడికెడు మెతుకులు కూడా లేకుండా చనిపోయిన నేతలు లేరా? వాళ్ళనుగాని, వాళ్ళ వారసులనుగాని ప్రజలు పట్టించుకున్నారా? కనుక ఒంట్లో శక్తి వున్నప్పుడే నాలుగురాళ్ళు సంపాదించుకోవాలి. డబ్బు వున్నవాడు మాత్రమే ఈ రోజుల్లో గొప్పవాడు"

"కాని మీ వంటి రచయితల వల్లనే సమాజం పాడవుతోందనీ, యువతరం మనస్సులను విషపూరితం చేస్తున్నారనీ, రకరకాలుగా విమర్శిస్తున్నారే, ఇంకా ఎంత కాలం వీటిని భరిద్దాం? " పార్వతి వేదన అతనికి అర్థమవుతోంది.

"ఏంచేస్తాం! ఈ రంగం ఇంతే! నేను మానుకున్నా, రిటైరైనా పరిస్థితి ఇలానే వుంటుంది. రేపు నా స్థానాన్ని మరొకడు ఆక్రమిస్తాడు. ఇలా అనేవాళ్ళు అతడినీ ఇలానే హింసిస్తారు. తప్పదు. పళ్ళున్న చెట్టుకే రాళ్ళ దెబ్బలు తగులుతాయి"

పార్వతి ఏదో ఆలోచించుకుంటూ వుండిపోయింది. అతను కూడా దీనిని పొడిగిం



చదల్చుకోలేదు.

"ఇందిర వచ్చిందా? " అడిగాడు.

"లేదు. ఏదో మెడికల్ ప్రోగ్రాం నిమిత్తం అమెరికా వెళ్ళిందట. 'అక్కడినుండే ఫోన్ చేసి అభినందనలు తెలిపింది"

★ ★ ★

కార్తీక్‌కు అత్యున్నతమైన ఆ అవార్డు రావడం సాహితీలోకంలో సంచలనం సృష్టించింది. పత్రికలు దీనిపై విరివిగా రాసాయి.

అతని సీరియల్స్ ప్రచురించే పత్రికల యితే సరేసరి. ఆ అవార్డు తమ పత్రికకే వచ్చినట్లు హడావుడి చేశాయి.

ఎంతోమంది అతడిని అభినందించారు. అతనిలో అతనికే తెలియని గొప్ప కవి వున్నాడన్నారు. అలాగే మరికొంతమంది ఈ పురస్కారానికి అతడు తగడన్నారు. అతనికి ఇవ్వడంద్వారా ఆ అవార్డుకున్న గౌరవం తగ్గిపోయిందన్నారు.

ఎవరు ఏమనుకున్నా కార్తీక్ చలించ లేదు. తనపై తనకి ఒక అభిప్రాయం ఏర్ప డిపోయింది. తను సర్వసమర్థుడు. తనను విమర్శించే వాళ్ళంతా తన గొప్పతనానికి అసూయపడి విమర్శిస్తున్నారు. అంతే! తను ఎవరినీ లెక్కచెయ్యనక్కరలేదు.

వస్తున్న సీరియల్ హిట్ కావడంతో అది అయిపోగానే అదే తరహాలో అదే పత్రికలో మరో సీరియల్ మొదలుపె ట్టాడు. అది కూడా సక్సెస్ అయింది.

పెద్దల సూక్తి వుందిగా, నథింగ్ ఈజ్ సక్సెస్ దేన్ సక్సెస్.

దాంతో ఈ నవలలకు మూస నవలలు రాసాగాయి. అంతర్జాతీయ గూఢచారులు, జాకాల్స్, కిల్లర్స్ తెలుగు నవలా ప్రవేశం చేశారు. గుంటూరు వ్యాపారి గోంగూర పచ్చడిలో వజ్రాలుపెట్టి స్మగ్లింగ్ చేస్తు న్నట్లూ, నడిరోడ్లపై మనుష్యులను దారు ణంగా చంపేస్తున్నట్లూ ఎన్నో ప్రయోగాలు వచ్చేశాయి.

ఇంగ్లీషులో అయితే సైకాలజీపై ఒక పత్రిక, సెక్స్‌పై ఒకటి, కార్టూన్స్‌కు ఒకటి, బ్యూటీ కొరకు ఇంకొకటి, ఇలా ఒక్కొక్క సబ్జెక్ట్‌పై ఒక్కొక్క పత్రిక వుంటుంది. కాని తెలుగులో అన్నీ కలగలిపి ఒకే పత్రికలో అందించాలి. ఎవరుమాత్రం ఏంచేస్తారు? పైగా పుస్తకాలు చదవడం తగ్గింది. ఈ పరి స్థితిలో ఒక పత్రిక నడపడం అంటే పులి నోట్లో తల పెట్టడంతో సమానం.

ఒకసారి ఒక మహిళా మండలివాళ్ళు ఏర్పాటు చేసిన సమావేశానికి పార్వతిని ముఖ్య అతిథిగా ఆహ్వానించారు. కార్తీక్‌ను కూడా రమ్మని బలవంతపెట్టడంతో వెళ్ళక తప్పలేదు. అక్కడ మాట్లాడిన వక్తలందరూ ఆడవారి సమస్తమైన కష్టాలకు మగవాళ్ళే కారణమనీ, మగజాతిని పూర్తిగా ఉతికి ఆర వేస్తేగాని మహిళల కష్టాలు కడతేరవనీ చెప్పారు. వరకట్న చావులు, అత్తగారి సాధింపులు లేకుండా ఆడవాళ్ళ సమస్యల గురించి ఒక నవల రాయాలని అప్పుడే అనిపించింది.

వెంటనే "నిప్పుల గుండం" అనే పేరుతో ఒక నవల రాశాడు. అది కూడా సక్సెస్ అయ్యింది. ఆడపిల్లల సమస్యలు నిజాయి తీగా చూపించాడన్నారు.

వాళ్ళకు ఇవ్వవలసింది పిడికెడు సాను భూతి కాదనీ, చిటికెడు ఆత్మవిశ్వాసమనీ చెప్పాడు. కార్తీక్, అతని వెనుకే మిగిలిన వాళ్ళూ ఇటువంటి నవలలు రాయసాగారు.

కార్తీక్ ఎదుర్కొనే సమస్యలలో ఇది ముఖ్యమైనది. అతను వెరయిటీగా ఒకరకం నవల రాస్తాడు. అది కాని సక్సెస్ అయితే మిగిలిన వాళ్ళు అదేరకం నవలలు రాసి ఆ ప్రయోగం పాతబడిపోయేవరకు విడవడం లేదు. ఇంతచేసినా కార్తీక్‌కు వచ్చిన పేరు వాళ్ళకు రావడంలేదు. ఆ విషయం గమ నించినా వాళ్ళు ఈ అనుకరణ విద్య వదల డంలేదు.

అతను మొదట్లో 'మనసు' నవల రాసినప్పుడు చాలామంది అదేరకం నవ లలు రాసారు.

తెలుగుతేజం పత్రికనుండి రావుగారు తప్పుకున్నాడు. స్వంతంగా 'నీలిమ' అనే పత్రిక పెట్టుకున్నాడు. ఆ పత్రికకు ప్రాణం పోయమన్నాడు. ఆ బలవంతంపై మళ్ళీ 'మనసు' నవలకు డూప్లికేట్‌లాంటిది తయారు చేశాడు. అది హిట్ కాలేదు. కాదని అతనికి ముందే తెలుసు. అతను చెబితే రావుగారు వినలేదు.

★ ★ ★

శ్రీకాంత్ పంజాబ్‌లో పుట్టినా చిన్నతనం లోనే తల్లి, తండ్రి చనిపోవడంతో ఒక దూరపు చుట్టంతో ఆంధ్రా వచ్చేశాడు. ఒక సంపన్న కుటుంబం దగ్గర ఆ కుర్రాడిని పనివాడిగా చేర్చి తన బాధ్యత వదిలించుకు న్నాడా బంధువు.

ఆ కుటుంబంలో శ్రీకాంత్ వయస్సు వాడే ఒక కుర్రాడు వున్నాడు. అతనిపేరు




తేజ. ఒకే వయసు వాళ్ళు కావడంతో వాళ్ళి ద్దరూ మంచి స్నేహితులయ్యారు.

తేజ ఎక్కడికి వెళ్ళినా కూడా శ్రీకాంత్ వుండవల్సిందే. తేజ వదిలేసిన బట్టలు, బూట్లు అన్నీ శ్రీకాంత్ వాడుకునేవాడు. తేజ అనుభవించేవన్నీ శ్రీకాంత్ కూడా అనుభవించేవాడు. క్రమంగా శ్రీకాంత్ ఆ ఇంట్లో సభ్యుడిగా మారిపోయాడు. కొన్ని సంవత్సరాలు శ్రీకాంత్ జీవితంలో హాయిగా గడిచిపోయాయి.

తేజ చాలా అందంగా వుండేవాడు. చాలా డాబుగా తయారయ్యేవాడు. మార్కెట్‌లో ఏ ఫ్యాషన్ వచ్చినా ముందు తేజ ఉపయోగించేవాడు.

తేజ చాలామంది ఆడపిల్లలతో తిరిగేవాడు. అందుకోసం ఊరికి దూరంగా వుండే ఏరియాలో ఒక ఇల్లు అద్దెకు తీసుకున్నాడు.

అక్కడికి ఆడపిల్లలను శ్రీకాంత్ స్వయంగా తీసుకువచ్చేవాడు. ఆ తర్వాత ఆ గదిముందు కాపలా వుండేవాడు. తేజ కొరకు ఏ పనిచేయడానికైనా శ్రీకాంత్ సిగ్గు పడేవాడు కాదు. అతని సేవ కోసమే తను పుట్టేననుకునేవాడు.

ఆ గదికి వచ్చిన ఆడపిల్లలు శ్రీకాంత్‌ను లెక్కచేసేవారుకాదు. శ్రీకాంత్ కూడా వాళ్లను పట్టించుకునేవాడు కాదు. మంచి మంచి బట్టలు, బిర్యానీలు, కారులో షికార్లు, తేజతోపాటు ఆల్కహాల్, ఇవన్నీ అతనికి ఎంతో ఆనందాన్ని ఇచ్చేవి.

తేజ అలవాట్ల గురించి అతని తల్లిదండ్రులకు తెలియకుండా వుంచే బాధ్యత పూర్తిగా శ్రీకాంత్‌దే. ఆ విషయంలో శ్రీకాంత్ చాలా ఎలర్ట్‌గా వుండేవాడు. అయితే శ్రీకాంత్‌కు ఏమాత్రం కొరుకుడు పడని వ్యక్తి ఆ ఇంట్లో వుంది.

ఆమె...

శైలజ

తేజకు కాబోయే శ్రీమతి.

ఆ అమ్మాయికి శ్రీకాంత్ అంటే అస్సలు పడేదికాదు. తేజాని అతడే చెడగొడుతున్నాడని ఆమె అభిప్రాయం. వాళ్లను విడదీయాలని ఆమె చాలా ప్రయత్నించింది.

తేజ ఈ విషయంలోమాత్రం ఆమె మాట వినేవాడుకాదు. శ్రీకాంత్‌కు చాలా భయంగా వుండేది. వాళ్ళ పెళ్ళి జరిగితే తనను ఇంట్లోంచి బయటకు గెంటేస్తారని అతనికి తెలుసు. అందువల్ల వాళ్ళ పెళ్ళి జరగకూడదని మూడుకోట్ల దేవుళ్ళకూ మొక్కుకునేవాడు.

ఒక్కొక్కసారి శైలజకు చిన్నచిన్న పనులు చేసిపెడుతూ మంచి మార్కులు కొట్టేద్దామనుకునేవాడు.

శైలజకు ఎన్నో బలహీనతలు వున్నాయి.

ఆమెకు కార్తీక్ నవలలంటే ఇష్టం. పుస్తకం పట్టుకుందంటే తిండి, నిద్ర ఏమీ అక్కరలేదు.

అది గ్రహించి ఆమెకు కార్తీక్ నవలలు తీసుకొచ్చి ఇచ్చేవాడు.

శైలజకు కొన్ని సైకలాజికల్ ప్రాబ్లమ్స్ కూడా వున్నాయి.

డాక్టర్ ఇందిర వద్ద ట్రీట్‌మెంట్ తీసుకుంటోంది.

దెయ్యాలపైన, అతీంద్రియ శక్తులపైన విపరీతమైన నమ్మకమున్న అమ్మాయి. ఈ మధ్యనే ఒక ప్రైవేట్ టి.వి. ఛానల్లో వస్తున్న హారర్ సీరియల్ అంటే ప్రాణం పెడుతోంది.

శైలజ అంటే తేజాకు చాలా ఇష్టం. కానీ ఆమె శ్రీకాంత్‌ని దూరం చెయ్యమనడం అతనికి నచ్చేదికాదు.

ఒకసారి శైలజ వాళ్ళ గదికి వచ్చేసరికి గదిముందు వున్న శ్రీకాంత్ ఆమెను చూసి అదిరిపడ్డాడు. కంగారుగా లోపలకు పరిగెత్తాడు.

కానీ అప్పటికే ఆలస్యమైపోయింది.

లోపల వున్న అమ్మాయిని బయటకు పంపే వ్యవధి లేకపోయింది.

# ఏరిన ముత్యాలు

★ మనిషి తన అభిప్రాయాలను, ఆశయాలను మార్చుకుంటే జీవితాలను సౌలభ్యంగా మార్చుకోవచ్చు

–విలియమ్ జేమ్స్

★ ఉపక్రమించడానికి ముందేకాదు, ఉపక్రమించిన తరువాత కూడా యోచించు.

–వినోబాభావే

★ వారధులు నిర్మించుకోరు, గోడలు కట్టుకుంటారు. కాబట్టే కొందరు లోకులు అవివేకులు.

–జి.ఎఫ్. న్యూటన్

★ బాధ అంత తీవ్రంకాదు మరణం.

–ఆండీ మాల్ రాక్స్

★ జనన మరణాలకు మందులేదు. రెండింటిమధ్యగల అవకాశం అనుభవించాల్సిందే.

–జార్జ్ శాంతాయన

★ విన్నది వినడానికి విసుగుండదు చెవికి. చూడనిది చూడాలనిపిస్తుంది కంటికి.

–డబ్ల్యు. హెచ్. ఆడెన్

★ సంపద కలిగినప్పుడు మీ దోషాలను చెబుతూ, ఆపదలో మనసారా చేయూతను ఇచ్చువాడే నిజమైన మిత్రుడు.

–హారేస్‌స్మిత్

★ పురుషులు దేహపుష్టి గలవారే. కానీ మానసిక పరిణతి పొందినవారు కాదు.

–లియోరోస్టెన్

★ మానవుని జబ్బులలో చికిత్సకు లొంగనిది అహంభావం.

–అరిస్టాటిల్

★ సత్యవాదికి ధర్మదూషణ పనికిరాదు.

–మహమ్మదు ప్రవక్త

★ జంతువులు మంచి స్నేహితులు. అవి ప్రశ్నలడిగి బాధించవు. విమర్శలు చేసి నొప్పించవు.

–జార్జ్ ఇలియట్

★ మీరు అప్పు ఇచ్చేటప్పుడు పుచ్చుకునేవాళ్ళు మీకు నమస్కారం చేస్తారు. వసూలు చేసేటప్పుడు వారికి మీరు నమస్కారం చేయాలి.

–రష్యా సామెత

★ గొప్పగా వుండటం గొప్పే కానీ దయకలిగి వుండటం ఇంకా గొప్ప.

–విల్‌రోజర్స్

సేకరణ: **పి.వి.రమణకుమార్**

శైలజ తప్పంతా శ్రీకాంత్‌దే అంది. అతడిని నానా మాటలు అంది.

ఆ మాటలకు శ్రీకాంత్ కంటే తేజా చాలా బాధపడ్డాడు. శైలజతో గొడవపడ్డాడు. చాలారోజులు వాళ్ళు మాట్లాడుకోలేదు.

శ్రీకాంత్ జోక్యం చేసుకోకపోతే విషయం పెద్దలవరకు వెళ్ళేదే.

శ్రీకాంత్ వాళ్ళిద్దరి మధ్య రాజీకుదిర్చాడు.

ఆ సందర్భంగా వాళ్ళిద్దరూ కలిసి ఎక్కడికైనా పిక్‌నిక్‌కి వెళ్ళాలనుకున్నారు.

శ్రీకాంత్‌కు శైలజ బలహీనత తెలుసు. అందువల్ల శైలజకు ఇష్టమైన టి.వి. సీరియల్‌లో చూపించిన కోటను తమ విహార స్థలంగా ఎన్నుకున్నాడు.

కానీ శైలజ మెప్పు పొందడానికి అతను చేసిన పని వాళ్ళ ముగ్గురి ప్రాణాలకు ముప్పు తెస్తుందనుకోలేదెవరూ.



అభిమానం అనే మాటను నిర్వచించడం చాలా కష్టం. ఎందుకంటే ఈ అభిమానులు ఎవ్వరికీ అర్థంకారు.

గాంధీజీని కాల్చిచంపిన గాడ్సే ఆయనను ఎంతో అభిమానించేవాడు. కెనడీని హత్య చేసిన ఆస్వాల్డ్ కూడా అంతే.

మార్లిన్‌మన్రో చనిపోతే ఆమెతోపాటు చనిపోయినవాళ్ళున్నారు.

నేతాజీ చనిపోలేదని వాదించేవాళ్ళున్నారు.

జపాన్‌లో ఒక సినీనటిని చంపేసి ఫ్రిజ్‌లో దాచేసుకున్నాడొక అభిమాని.

ఇదంతా అభిమానమే.

ఏ వ్యక్తి అయినా మరొకరిని అభిమానిస్తున్నాడంటే అందుకు కారణం ఒకటే. తను ఎలా వుండాలనుకుంటున్నాడో అవతలి మనిషి సరిగా అలా వుండడమే.

అయితే ఈ అభిమానం పేరుతో మోసం చేసేవాళ్ళూ వుంటారు.

ఒకసారి ఒక కుర్రాడు పరీక్ష ఫీజు కట్టాలనీ, డబ్బులేదనీ, సంవత్సరం వృధాగా పోతుంది, సహాయం చెయ్యమనీ కార్తీక్‌కు ఉత్తరం రాశాడు.

కార్తీక్ వెంటనే స్పందించాడు. ఒకప్పుడు తను డబ్బులేక చదువుకోడానికి చాలా అవస్థలు పడ్డాడు. ఇప్పుడు అదే పరిస్థితిలో మరో కుర్రాడు వున్నప్పుడు అతనికి సహాయపడడం తన విధి అనుకున్నాడు.

అతని ఎడ్రస్‌కు డబ్బు పంపాడు.

కొన్నిరోజులవరకు అతనినుండి ఉత్తరం వస్తుందని ఎదురుచూశాడు.

తర్వాత అతని కాలేజీకి బాగా చదవమని ఉత్తరం రాశాడు. అది తిరిగివచ్చింది. అసలు అటువంటి వ్యక్తి ఎవరూ అక్కడ లేరని బదులువచ్చింది.



ఆరోజు పొద్దుటనుండి వర్షం. బయటకు కదిలే వీలులేదు. కార్తీక్ ఇంట్లోనే వున్నాడు. చాలాకాలం తర్వాత అతనికి ఓ ఖాళీరోజు దొరికింది.

పాత జ్ఞాపకాలు గుర్తుచేసుకుంటూ

అతనూ, పార్వతీ చాలాసేపు మాట్లాడుకున్నారు.

ఇంతలో ఫోన్ మోగింది. పార్వతి రిసీవ్ చేసుకుని ఆ తర్వాత కార్తీక్‌కు ఇచ్చింది.

"హల్లో" రిసీవర్ చెవికి ఆన్చుకుంటూ కాస్త గంభీరంగా అన్నాడు.

ఈమధ్య కార్తీక్ మాటతీరులో, నడకలో, ప్రవర్తనలో స్పష్టమైన మార్పు కనబడుతోంది. బహుశా డబ్బు, పేరు తెచ్చిన మార్పై వుంటుంది. ఒక్కొక్కసారి అది పార్వతికి నచ్చదు.

"మిస్టర్ కార్తీక్? "

"యస్"

"మీరు రచయిత కార్తీక్‌గారేనా? " నిర్ధారణ చేసుకోవడానికన్నట్లు తిరిగి ప్రశ్నించారు.

"ఔను, మీరు ఎవరో తెలుసుకోవచ్చా? " కార్తీక్ అడిగాడు.

అదే సమయంలో ఒక విమానం బయలుదేరుతున్న శబ్దం అతని చెవులకు స్పష్టంగా వినబడింది. అంటే ఈ ఫోన్‌కాల్ ఎయిర్‌పోర్ట్ నుండి వచ్చింది అనుకున్నాడతను. "నాకు చాలా కొద్ది సమయమే వుంది మిస్టర్ కార్తీక్. నేను ఒక అర్జంట్ పనిపైన ఢిల్లీ వెడుతున్నాను. శుక్రవారం తిరిగి వస్తాను. ఆరోజు నాకు మీ అప్పాయింట్‌మెంట్ కావాలి"

"మీ పేరు తెలుసుకోవచ్చా? "

"నా పేరు గిరిధర్. నాకు చాలా వ్యాపారాలు వున్నాయి. నేను చాలా కష్టపడి ఈనాటి ఈ స్థాయికి వచ్చాను. నా జీవితంలో ముఖ్యమైన ఘట్టాలు రాసి వుంచాను. వాటి ఆధారంగా మీరు ఒక నవల రాయాలి"

కార్తీక్ కాసేపు ఏంమాట్లాడలేదు. అతనికి ఈ ప్రపోజల్ నచ్చలేదు.

"మీరు వేరే ఎవరినైనా కలవండి. జీవిత చరిత్రలు రాసే రచయితలు వేరే వుంటారు"

"కార్తీక్, ప్లీజ్ నామాట వినండి. ఎప్పటి నుండో నాకు ఒక కోరిక వుంది. నా జీవితాన్ని పదిమంది చదవాలి. జీవిత చరిత్రగా రాస్తే ఎవ్వరూ చదవరు. దానిని నవలగా రాయండి. మీ పుస్తకాలన్నీ నేను చదివాను. మొదలుపెడితే చివరి వరకు చదివించగల శక్తి మీకు మాత్రమే వుంది" చెప్పాడతను.

కార్తీక్ సమాధానం చెప్పేలోగానే అతను తిరిగి చెప్పాడు.

"అదిగో నన్నే పిలుస్తున్నారు. శుక్రవారం మీ ఇంటికి వస్తాను. మీకు ఎంత డబ్బు కావాలన్నా ఇస్తాను"

అవతలివైపు ఫోన్ పెట్టేసిన శబ్దం వినబడింది. కార్తీక్‌కు గిరిధర్ పేరు బాగా తెలుసు. అతడు మంచి బిజినెస్‌మాన్.

కాసేపు అతని గురించి ఆలోచించాడు కార్తీక్. డబ్బు బాగా వచ్చే అవకాశం వుందనిపించింది.

డబ్బు వచ్చేటట్లయితే దాన్ని గురించి ఆలోచించడానికి కార్తీక్ సిద్ధంగానే వుంటాడు.

అయితే శుక్రవారం గిరిధర్ రానేలేదు. కార్తీక్ కొద్దిరోజులు ఎదురుచూసి ఆ తర్వాత ఆయన్ని గురించి మర్చిపోయాడు. గాయిత్రిగారు వచ్చి కలిసేవరకు అతనికి గిరిధర్ మళ్ళీ గుర్తుకు రాలేదు.

★ ★ ★

ఒకరోజు మిట్టమధ్యాహ్నం వేళ కార్తీక్‌ను కలవడానికి వచ్చింది గాయత్రి. కార్తీక్ అప్పుడే భోజనం ముగించి రాసుకుంటూ కూర్చున్నాడు. వచ్చే వారానికి చెందిన ఇన్‌స్టాల్‌మెంట్ అది. అతను మంచి మూడ్‌లో వుండగా ఆవిడ వచ్చి కూర్చుంది.

అక్కడికీ పార్వతి ఇప్పుడు కుదరదని చెప్పిందట. అయినా ఆవిడ వినలేదు. ఒక్క పదినిముషాలు మాట్లాడాలని బతిమాలడం మొదలుపెట్టింది. ఇక కార్తీక్‌కు తప్పలేదు. డ్రాయింగ్ రూంలో కూర్చుని వుందావిడ.




తెల్లటి చీరమీద నల్లరంగు పువ్వులు ఎంబ్రా యిడరీ చేసిన చీరకట్టింది. జాకట్టు కూడా తెల్లదే. దాదాపుగా ఐదడుగుల ఆరంగుళాలు పొడవుంది. అంటే ఈ రోజుల్లో ఆడవా ళ్ళలో చాలాపొడవుగా వున్నట్లే.

పార్వతి చెప్పిన దానిని బట్టి ఎవరో పెద్దావిడ వచ్చి వుంటుందనుకున్నాడు.

తీరా చూస్తే ఈవిడ ముప్పై, ముప్పై ఐదు మధ్య వయస్సులో వుంది. ఎర్రటి శరీర ఛాయలో అందంగానే వుంది.

కార్తీక్‌ను చూడగానే లేచి నిలబడి రెండు చేతులూ జోడించి నమస్కరించింది.

అతను కూడా చేతులు జోడించి ఆమె ముందు వున్న కుర్చీలో కూర్చున్నాడు.

"నా పేరు గాయిత్రి. మావారు గిరిధర్ గోపాల్. గిరిధర్ పేరుతో ఆయనకు చాలా వ్యాపారాలు ఉండేవి. ఈమధ్యనే ఆయన కాలం చేశారు" చెబుతున్న ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

కార్తీక్ కొద్దిగా ఆశ్చర్యపోయాడు. కారణ మేమిటంటే భర్త చనిపోయాడని చెబు తున్న ఆ స్త్రీ అలంకరణ మాత్రం అలా లేదు. ఆమె బొట్టు, కాటుక, మెడలో ఒంటి పేట గొలుసుతో మామూలుగానే వుంది.

"మీరు ఏంఆలోచిస్తున్నారో నేను ఊహిం చగలను. ఈ రకంగా వుండడం నా భర్త చివరి కోరిక. అందుకే సమాజంలో ఎటు వంటి అపవాదులు ఎదురైనా నేను ఇలాగే వుంటున్నాను"

పార్వతి ఒక ట్రేలో పళ్ళరసం వున్న గ్లాసులు పెట్టుకుని వచ్చింది. తలొకటి తీసుకున్నారు. పార్వతి కూడా కూర్చుంది. గాయిత్రి తన గ్లాసు టీపాయ్‌పై పెట్టి తిరిగి మాట్లాడసాగింది.

"ఆయన చాలా మంచివారు. నన్ను ఎంతో ప్రేమగా చూసుకునేవారు. ఏనాడూ దేనికీ నన్ను కష్టపెట్టలేదు. చనిపోయే ముందురోజు రాత్రి కూడా చాలా హుషారుగా వున్నారు. అర్ధరాత్రి సడన్‌గా గుండెనొప్పి వచ్చి చనిపోయారు" ఒక్క క్షణం ఆగిందామె.

ఎర్రని తామర రేకులనుండి జారుతున్న నీటి బిందువుల్లా ఎర్రబడిన ఆమె కళ్ళ నుండి కన్నీటి బిందువులు జారుతున్నాయి.

తల తిప్పి పార్వతివైపు చూశాడు. ఆమె కళ్ళలో కూడా నీళ్ళు ఊరుతున్నాయి. మగ వాళ్ళ విషయంలో నవ్వు ఒక అంటువ్యాధి వంటిదయితే ఆడవాళ్ళ విషయంలో ఏడుపు అంటువ్యాధే.

కాసేపటికి గాయత్రి తననుతానే సంబా ళించుకుంది. తన చేతి సంచినుండి కొన్ని డైరీలు తీసి కార్తీక్ చేతికిచ్చింది.

"ఇవి ఆయన డైరీలు. చిన్నతనంనుండి ఎంతో కష్టపడ్డారాయన. తిండి కూడా లేక ఆకలితో పడుకున్న రాత్రులు ఎన్నో వున్నాయి. అవన్నీ ఆ డైరీలో రాసారు. పట్టుదలతో చిన్న షాపు ప్రారంభించారు. ఈనాడు రాష్ట్రంలోనే పెద్ద బిజినెస్ మాగ్నె ట్‌గా మారారు. ఆయన జీవితాన్ని మీరు ఒక నవలగా రాయాలి. కష్టపడి పైకి రావ డంలో వున్న ఆనందం యువతరానికి తెలి పేవిధంగా రాయాలి ప్లీజ్"

కార్తీక్ ఆలోచనలో పడ్డాడు. చాలా డ్రై సబ్జెక్ట్. పాఠకులకు ఎక్కడా విసుగనిపించ కుండా, ఒక జీవిత చరిత్ర చదువుతున్నా మన్న ఫీలింగ్ రాకుండా జాగ్రత్తగా రాయాలి.

అతని మౌనాన్ని గాయత్రి మరోవిధంగా అర్థం చేసుకున్నట్లయింది.

"డబ్బు గురించి మీరు ఆలోచించవద్దు. మీరు ఒక సీరియల్‌కు ఎంత వసూలు చేస్తారో అంతకు రెట్టింపు ఇస్తాను" అని అతనిని అనుమానంగా చూస్తూ

"చెప్పండి. ఏం? రాయలేరా? " గాయత్రి ఆదుర్దాగా అడిగింది.

"రాస్తారు. ఆ డైరీలు ఇక్కడ వుంచే యండి. మీ ఫోన్ నంబర్ ఇచ్చి వెళ్ళండి. అవసరమైతే మీతో మాట్లాడవలసి

రావచ్చు" అతని బదులు పార్వతి చెప్పింది.

గాయత్రి తన భర్త విజిటింగ్ కార్డ్ తీసి వాళ్ళముందున్న టీపాయ్‌పై పెట్టింది. దానితోపాటే తను అంతకుముందే సంతకం చేసి వుంచిన చెక్కు కూడా ఇచ్చింది.

కార్తీక్ మాట్లాడకుండా లేచి నిల్చున్నాడు. గాయత్రి సెలవు తీసుకుని వెళ్ళిపోయింది.



ఆరోజు రావుగారి దగ్గరకు వెళ్ళాడు కార్తీక్. ఆయన ఏదో రాసుకుంటున్నాడు. కార్తీక్‌ను చూడగానే విష్ చేసి ఎదురుగా వున్న కుర్చీ చూపించాడు.

"మన పత్రికలో కథల పోటీ ప్రకటించాం కార్తీ. చాలా కథలు వచ్చాయి. ఎలాగూ వచ్చావు కాబట్టి ఇందులో బహుమతి పొందేకథలేవో నీవే తియ్యి" చెప్పాడు రావు.

"నేను జడ్జిలా వ్యవహరించడమేమిటి రావూ. ఎవరైనా బాగా అనుభవమున్న కథారచయితతో తీయించు" ఇబ్బందిగా చెప్పాడు.

"వాళ్ళంతా ఇప్పుడు ఎక్కడ దొరుకుతారు గానీ నీవే సెలక్ట్ చేసేయ్. సెన్సేషనల్ రైటర్ కార్తీక్ ఈ కథలపోటీకి జడ్జిగా వ్యవహరించారన్న వార్త కూడా సెన్సేషన్ సృష్టిస్తుంది"

అతనిక బెట్టు చెయ్యలేదు. ఆ కథలన్నీ పరిశీలించడం మొదలుపెట్టాడు. కథల పోటీకి వచ్చే కథలు చాలా విచిత్రంగా వుంటాయి. ఎక్కువశాతం మనిషి మనస్సులోని ఆర్ద్రతని, గుండెలలో తడిని స్పృశిస్తాయి. చిన్నతనంలో ఒక కథ చదివాడు కార్తీక్.

ఇతివృత్తం ఏమిటంటే ఒక తల్లి కొడుకును చాలా గారాబంగా పెంచుతుంది. పెద్దయ్యాక వాడు వట్టి జులాయిగా మారతాడు. పెళ్ళి అయితే బాగుపడతాడేమోనని పెళ్ళిచేస్తుంది. అయినా వాడు మారడు. పిల్ల పుడుతుంది. భర్త ఆగడాలు భరించలేక భార్య పుట్టింటికి వెళ్ళిపోతుంది. ఆ వ్యక్తి ఇంకా చెడిపోతాడు. చెడు అలవాట్లతో ఆ వ్యక్తి ప్రాణం పోయే స్థితికి చేరుకుంటాడు. మంచంపై చివరిదశలో ఒక అమ్మాయిపేరు కలవరిస్తుంటాడు.

తల్లి వాకబుచేసి ఆ పేరుగల వేశ్యను తీసుకువస్తుంది. ఆమెవైపు కనీసం కన్నెత్తి కూడా చూడడు. అలాగే చనిపోతాడు. దినంరోజు ఏడుస్తూ వచ్చిన కోడలిని, మనవరాలిని చూసి అప్పుడు మనవరాలి పేరు కనుక్కున్న ముసలావిడ ఆ పేరు తన కొడుకు కలవరిస్తూ చనిపోయాడని తెలుసుకుంటుంది.

ఈ కథ మనస్సును పిండేసింది. ఎన్ని సంవత్సరాలైనా ఆ కథను కార్తీక్ మరిచిపోలేదు.

పోటీకి వచ్చిన చాలా కథలలో తనకు నచ్చిన మంచికథలు తీసి రావుగారికి ఇచ్చేసరికి సాయంకాలమయ్యింది. ఆ తర్వాత రావుగారికి గాయత్రి గురించి చెప్పాడు.

"ఒక పని చెయ్యి కార్తీ. కష్టపడి పైకి వచ్చినవాళ్ళ బ్యాక్‌గ్రౌండ్ తీసుకుని నవలగా రాయి" చెప్పాడు రావుగారు.

ఇంతలో ఒక కుర్రాడు కూల్‌డ్రింక్స్ తెచ్చి ముందు టేబుల్‌పై పెట్టాడు.

"ఏంసాగర్? ఏమంటున్నాడు మీ మావగారు? నిధి దొరికిందా?" ఆ కుర్రాడిని అడిగాడు రావుగారు.

"ఎక్కడ దొరుకుతుంది సార్. అంతా వట్టిదే. ఎవడి పిచ్చి వాడికి ఆనందం" నవ్వుతూ చెప్పి బయటకు వెళ్ళిపోయాడు సాగర్.

"నిధి ఏమిటి?" రావుగార్ని అడిగాడు కార్తీక్.

"సాగర్ మావగారికి తన జాతకం ప్రకారం నిధి దొరుకుతుందని నమ్మకం.





అందుకోసం రకరకాల ప్రయత్నాలు చేస్తుంటాడు" కూల్‌డ్రింక్ అందిస్తూ చెప్పారు రావుగారు.

సడన్‌గా కార్తీక్‌కు ఒక ఆలోచన వచ్చింది. మనస్సులో మళ్ళీ మళ్ళీ సరిచూసుకున్నాడు. అతని ముఖంలో ఏ మార్పు కనిపించిందో రావుగారు ఉత్సాహంగా ముందుకు వంగారు.

"ఏదైనా ఆలోచన వచ్చిందా? "

"ఒకవైపు మన థీమ్ ప్రకారం నవల రాస్తూ మరోవైపు నిధి వేట కూడా ఇందులో ఇరికిస్తే ఎలా వుంటుంది? "

"బాగానే వుంటుందిగాని కష్టపడి పనిచేయడంకంటే ఇలా నిధులు వెదికి పట్టుకోవడం సులువనుకుంటారేమో జనం"

"ఊహు! అలాకాదు. కష్టపడి పని చేస్తే ఎప్పటికైనా పైకి వస్తారని అర్థం వచ్చేలా రాస్తాను. నిధివేట అనేది కేవలం కమర్షియల్ బ్రేక్ మాత్రమే"

"అంటే టీవీలో ప్రోగ్రామ్ మధ్యలో వచ్చే అడ్వర్‌టైజ్‌మెంట్స్‌లా గన్నమాట" మళ్లీ కాసేపు ఆగి ఆయనే అన్నారు. "మన పత్రికలో నీ సీరియల్ నడుస్తోందికదా? దిన పత్రికలో వేద్దామా? "

కార్తీక్ ఒప్పుకోలేదు. వేరే పత్రికకు ఇవ్వడానికే నిశ్చయించుకున్నాడు.

గాయిత్రి అడిగిన నవల సీరియల్‌గా మొదలైంది. ప్రారంభంలో బాగానే వున్నా మధ్యలోకి వచ్చేసరికి అసలుకంటే కొసరు ఎక్కువయింది.

రావుగారు చెప్పినట్లే కష్టపడి పని చేయడంకంటే ఇలా నిధులు వెదుక్కోవడం మంచిదనుకునేలా తయారైంది. అయితే అది మంచి హిట్ సీరియల్. గాయిత్రి తన భర్త కథ అంత జనాదరణ పొందినందుకు చాలా సంతోషించింది. కార్తీక్‌కు కావలసింది అదేకదా? ఆ పత్రిక యాజమాన్యం అంతమంచి సక్సెస్ సీరియల్ ఇచ్చినందుకు చాలా ఆనందించారు. చదివిన పాఠకులు నిధుల వేట అనే అంశంలోని మజా రుచి చూసి ఆనందించారు.



అర్ధరాత్రి దాటుతోంది. నగరం చీకటిని దుప్పటిగా చేసుకుని కప్పుకుంది.

చలికాలం కావడంవల్ల చలిచాలా ఎక్కువగా వుంది. ఆరిపోయిన సిగరెట్‌ను వెలిగించుకుని బలంగా రెండు దమ్ములు వెంటవెంటనే లాగాడు కానిస్టేబుల్ మునియ్య. వెచ్చని పొగ గుండెలలోనికి జారిపోతూనే ఏదో తెలియని అనుభూతికి లోనయ్యాడు.

నాసికాపుటాల నుండి పొగను బయటకు వదులుతూ తనతో పాటే నడుస్తున్న రాజయ్యవైపు చూశాడు. అతను కూడా అదే పనిలో బిజీగా వున్నాడు.

"థూ! వెధవ ఉద్యోగం. దేశంలో అందరూ పెళ్లాల పక్కలో హాయిగా పడుకునే వేళల్లో మనం మాత్రం చలి, గాలి, వాన ఎలా ఉన్నా చావాల్సిందే. మన కష్టం ఎవ్వడికీ అక్కరలేదు. ఏదైనా తప్పు జరిగితే మాత్రం రోడ్లు తుడిచేవాడినుండి మంత్రివరకు అందరూ మనల్ని తిట్టేవాళ్లే" కసిగా అన్నాడు రాజయ్య.

మునియ్య ఏం మాట్లాడలేదు. కాండ్రించి తుపుక్కున నేలపైన ఉమ్మాడు అదే తన

అభిప్రాయం అన్నట్లు.

వీధి ఈ చివరి నుండి ఆ చివరి వరకు చీకట్లు అలుముకుని వున్నాయి. రోడ్డు కిరు వైపులా వున్న మేడల వరసలు ఆ చీకట్లో చేతులు కట్టుకుని నిల్చున్న రాక్షసుల్లా వున్నాయి. మధ్యమధ్య వలయాలుగా నీడలు సృష్టిస్తున్న వీధి దీపాలు ఆ రాక్ష సుల మెల్లకన్నుల్లా వున్నాయి.

ఆ వీధిలోనే వుంది కనకదుర్గ అమ్మవారి ఆలయం. అందువల్ల ఆ వీధిలో డ్యూటీ పడ్డ వాళ్లు చాలా జాగ్రత్తగా వుంటారు.

మరో దమ్ములాగుతూ తల ఎత్తి ఆకాశం వంక చూశాడు రాజయ్య. మిణుకుమిణుకు మంటూ మెరుస్తున్న నక్షత్రాలు కనిపిం చాయి.

భార్యా పిల్లలను తల్చుకుంటూ నడుస్తు న్నాడు. అతని ఎనిమిదేళ్ల పిల్లాడికి రెండు రోజుల నుండి జ్వరం. ఆ రోజు డ్యూటీకి రావడం అతనికి ఇష్టంలేదు. కాని ఎంత బతిమలాడినా పైఆఫీసరు అతనికి సెలవు ఇవ్వలేదు.

రాత్రి రెండు గంటలయ్యేందుకు ఇంకా పది నిముషాల వ్యవధి వుంది. ఇద్దరూ నడుచుకుంటూ మర్రిచెట్టుదాకా నడిచారు.

మునియ్య చేతిలోని టార్చిలైటు పైకివేసి చూశాడు. ఆ మర్రిచెట్టు శాఖలు చాలా దూరం విస్తరించి ఆలయం గోడ మీదుగా లోపలకు పోతున్నాయి.

"ఎందుకు ఆ చెట్టువైపు అలా చూస్తు న్నావు? " రాజయ్య అడిగాడు.

"టీవీలో భస్మం సీరియల్ చూడడం లేదా? "

"లేదు... ఆ సీరియల్‌కు, ఈ చెట్టుకు సంబంధం ఏమిటి? "

"అందులో ఇలాగే ఒక గుడి పక్కన పెద్ద చెట్టువుంది. దానిద్వారా కొందరు దుండగులు గుడిలోనికి వెళ్లి దేవుడి నగలు కాజేస్తారు"

రాజయ్య భుజాలు ఎగరవేశాడు. అతనికి తన కొడుకు గుర్తుకు వచ్చాడు. మరో టీవీ సీరియల్‌లో చెప్పిన ఫీట్స్ బళ్లో విద్యా ర్థులందరూ కలిసి చేశారట. మధ్యల్లో తన కొడుకు చేతులు వదిలివేశాడట. అంతే! పిల్ల లంతా ఒకటే గోల. నువ్వు చచ్చిపోతావు. దెయ్యం చంపేస్తుందని భయపెట్టేశారు. దాంతో వాడికి జ్వరం వచ్చేసింది.

"ఛూ! ఏదో సర్దాగా ఇంట్లో వాళ్లంతా కలిసి కూర్చుని చూసే టీవీలో ఈ దెయ్యాల గోలేంటి? దానిని టీవీ అనాలా? పిశాచాలపెట్టె అనాలా? " చిరాగ్గా అన్నాడు రాజయ్య.

"దెయ్యాల విషయం వదిలేయ్! దొంగత నాలు ఎలా చెయ్యాలో, హత్యలు ఎలా చెయ్యాలో మాత్రం చక్కగా నేర్పుతున్నారు. గవర్నమెంటు ఎలా ఒప్పుకుంటోందో తెలిసి చావడంలేదు"

మరోసారి గుడిచుట్టూ ప్రదక్షిణం చేశాక పక్కవీధిలోనికి వెళ్లబోతుండగా కనిపించిం దది. చెట్టు పక్కగా వున్న చెత్తకుండి పక్కన ఉంది ఆ శవం. దుర్గగుడి కాపలా దారుడి శవం అది.

పదునయిన ఆయుధంతో అతిబలంగా తాకినట్లు మధ్యకు చీలిపోయి వుంది పొట్ట. పేగులు బయటకు వేలాడుతున్నాయి.

బయటకు తన్నుకు వచ్చిన రక్తం చిన్న సైజు మడుగులా మారింది. అతని ప్రాణాలు ఎప్పుడో గాలిలో కలిసిపోయా యని గ్రహించుకునేందుకు వారికి ఎంతోసేపు పట్టలేదు.

ఎవరు...? ఎవరు చేశారీ దారుణం?

"రాజయ్యా! దొంగలు గుళ్లో చొరబడ్డారు. పద... స్టేషన్‌కు వెళ్లి మన వాళ్లను తీసు కువద్దాం" మునియ్య ఆదుర్దాగా అన్నాడు. రాజయ్య తల అడ్డంగా వూపాడు.

"ఇద్దరం వెడితే వాళ్లు పారిపోతారు. నువ్వు వెళ్లు. నేను ఇక్కడ దాక్కుని వాళ్లను కనిపెడతాను"

"నీకేమైనా మతిపోయిందా? వాళ్లు

చూస్తే నిన్ను కూడా చంపేస్తారు"

"ఫర్వాలేదు. నేను వాళ్లకు కనబడకుండా దాక్కుంటాను. ఊరికే చూస్తుంటాను. అంతే వాళ్లను ఎదిరించను" చెప్పాడు రాజయ్య.

మునియ్య వేగంగా అక్కడినుండి స్టేషన్ వైపు పరిగెత్తాడు.

రాజయ్య తన ఎదురుగా వున్న శవాన్ని చూస్తూ తల విదిలించాడు. ఆ రక్తం చూస్తుంటే అతనికి కడుపులో తిప్పుతోంది.

ఉన్నట్లుండి ఉలిక్కిపడ్డాడు రాజయ్య. గాలివాటున ఏదో అలికిడి అతని చెవులకు చేరింది.

కనులు చిట్లించి ఆ దిశలో చూస్తూ టార్చి వెలిగించి అటువైపు తిప్పాడు.

ఆలయం వెనుక గోడకి ఆనుకుని వున్న మర్రి వృక్షంపైనుండే ఆ కదలికలు వస్తున్నాయి. చేతిలోని లాఠీని బిర్రుగా బిగించి పట్టుకుంటూ కాస్త ముందుకు వెళ్లి చూశాడతను.

ముఖానికి పల్చని తొడుగు వేసుకున్న ఆకారం ఒకటి ఆ చెట్టు కొమ్మపై నుంచి ఆలయంలోపలికి జారిపోవడం క్లియర్‌గా కనబడింది. అప్రయత్నంగా అతని శరీరం జలదరించింది.

అంటే గుడిలో దోపిడి జరుగుతోందన్న మాట.

ఆ గుడిలోని బంగారు ఆభరణాల విలువ యాభై లక్షలవరకు వుంటుంది.

ఏదో తెలియని ఆవేశం అతడిని కమ్ముకుంది.

తను చేస్తున్న పనిలో మంచి చెడ్డల గురించి ఆలోచించకుండా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వృక్షాన్ని సమీపించాడు.

ఒక్క నిముషం కూడా గడవకముందే ఆలయంలోపలికి వచ్చేశాడు. లోపల ఎంత మంది వున్నారో కూడా చూడకుండా లోపలకు దూకేశాడు. కాలు మడతపడి బోర్లాపడ్డాడు. మోకాలు చిప్ప ఫట్‌మంటూ గచ్చు నేలకు బలంగా పొడుచుకుంది.

ఒక్కసారిగా విపరీతమైన బాధతో నరాలు జివ్వుమన్నాయి. వెంటనే లేచి నిలబడటం అసాధ్యం అయిపోయింది.

అయినా ఆ బాధను అతి ప్రయత్నం మీద సహిస్తూ చుట్టూ చూశాడు.

గుడి తలుపులు ఊడదీస్తున్నారు. లోపల ఇద్దరు. మరో ఇద్దరు చుట్టూ జాగ్రత్తగా గమనిస్తున్నారు. అప్పుడే అతనికి ఒక విషయం తెల్సింది.

ఈ జరిగేదంతా ఒక పథకం ప్రకారం జరుగుతోంది. అంతా 'భస్మం' టెలీ సీరియల్‌లో లాగానే జరుగుతోంది.

లేవబోయాడు రాజయ్య. తల తిప్పక ముందే ఫట్‌మంటూ పడింది తలమీద బలమైన దెబ్బ.

గట్టిగా అరవబోయాడు. గొంతెత్తి బిగ్గరగా అరచి అందరినీ పిలుద్దామని అనుకున్నాడు.

ఈలోగానే తలపై మరో దెబ్బ పడింది.

కళ్లముందు ఏవో వలయాలు గుండ్రంగా తిరుగుతుండగా ముందుకు పడిపోయాడు. సగంలో వుండగానే అతని ప్రాణాలు గాలిలో కలిసి పోయాయి. చనిపోయే ముందు అనుకున్నాడతను.

"ఇదంతా ఆ సీరియల్‌లో లాగే ఉంది"

★ ★ ★

ఈవిధంగా జరగడానికి కారణం...

ఆ కోట ముందు గుర్రపుబండి ఆగింది. అందులో నుండి ముందు శైలజ కిందకు దిగింది. ఆ వెనుకే శ్రీకాంత్, తేజ దిగారు.

"మీరు వచ్చేవరకు వుంటానండి. ఇప్పుడు నాకు బేరాలు దొరకవు" బండతను చెప్పాడు. వాళ్లు ముగ్గురూ తల వూపి లోపలకు నడిచారు.

అది ఒక మారుమూల ప్రాంతం. ఇక్కడి కోటను గురించి ఎన్నో పుస్తకాలు




వున్నాయి. వాటిలో ఆ కోట చారిత్రకవై భవం, సిరి సంపదల గూర్చి కళ్లకు కట్టి నట్లు వర్ణింపబడింది.

ఆ కోటకు పెద్ద సింహద్వారం. ఆ ద్వారానికి అటుఇటు పెద్ద పెద్ద రాతి సింహాలు. అవి రాతితో చెక్కినవైనా హఠాత్తుగా చూస్తే నిజం సింహాలని భ్రమపడే అవకాశం వుంది.

ఆ కోటను పాలించిన రాజులు తమను తాము సింహాలతో పోల్చుకునేవారు. నిజంగా యుద్ధాలలో వాళ్లంతా సింహాల్లాగే ప్రవర్తించేవారు. వాళ్లు ముగ్గురూ లోపలకు నడిచారు.

సూర్యకాంతిలో ఆ రాతికోట విచిత్రంగా గోచరిస్తుంది. ఎత్తయిన గోడలు, గోడలపై చెక్కిన శిల్పాలు. అక్కడక్కడా వాటిపై పగుళ్ళు, విరిగిన తలుపులు.

ఒక్కొక్కటే చూసుకుంటూ నడుస్తున్నారు.

ఆ కోట బురుజుపై ఎడ్లబండి నడిచేదట. కోటచుట్టూ పెద్ద కందకం. ఆనాటి రాజులు ఉపయోగించిన ఆయుధాలు, కవచాలు, శిరస్త్రాణాలు చూస్తే కళ్ళు తిరిగినంతపనవుతుంది. వాటిని ఈ కాలం మనుష్యులు కనీసం ఎత్తలేరు.

కాలం గడిచేకొద్దీ మానవుడు శారీరకబలంలోనూ, ఒడ్డు పొడుగులోనూ బలహీనుడిగా మారిపోయాడన్నమాట.

ఆ కోటకు ఒక ప్రాముఖ్యత వుంది. ఆ కోటను బేస్‌గా చేసుకుని తీసిన టెలివిజన్ సీరియల్ బాగా పాప్యులర్ అయి ఉంది.

ఆ సీరియల్ వీరభద్రం రాసాడు. దాని వల్ల సియాన్స్ గురించి, సూక్ష్మమండలాల గురించి చాలా విషయాలు తెలిసిపోయాయి. అవి ఒక వ్యక్తి ఆలోచనలనుండి వచ్చాయని ఎవరూ అనుకోవడంలేదు. నిజమేనని భ్రమ పడుతున్నారు. అటువంటి వాళ్ళలో శైలజ ప్రథమురాలు.

"తేజా! ఈ శిల్పం చూడు. నిజంగా అద్భుతం" శ్రీకాంత్ చిన్నపిల్లాడిలా అరిచాడు.

నిజంగానే ఆ శిల్పం చాలా బావుంది. దూరంనుండి చూస్తే ఒక రాణి అక్కడ నిలబడినట్లు వుంటుంది.

ఆ శిల్పి ఎవరోగాని ఈ శిల్పాలవల్ల మరణించి కూడా సజీవుడయ్యాడు.

"ఈ శిల్పం ఎవరిది? " తేజ అడిగాడు.

"ఈవిడ పేరు మణికర్ణిక. ఈ కోటను పరిపాలించిన జయసింహుని పట్టమహిషి. చాలా అందగత్తె. జయసింహుడు ఈమె కొరకు ఏమైనా చేసేవాడు. ఈ రాణి అంటే అతనికి చాలా ఇష్టం" శైలజ చెప్పింది.

కొద్దిగా ముందుకు నడిచారు. అక్కడ మరి రెండు శిల్పాలు వున్నాయి. వాటిని చూడగానే శైలజ మళ్లీ చెప్పడం మొదలుపెట్టింది.

"అదిగో ఆ గోడపై తలపై కిరీటం, ఒరలో ఖడ్గంతో, ఒక చేత్తో మీసం మెలిపెడుతూ రీవిగా నిలుచున్న ప్రతిమ చూశారా? అతనే జయసింహుడు. ఎన్నో యుద్ధాలు చేసిన మహావీరుడు. ఓటమి అనేది తెలియనివాడు. అతని వంటిపై ఎనభైకి పైగా గాయపు మచ్చలు వున్నాయట. తన మొదటి భార్య చనిపోయాక ఒక సామంతుడి కుమార్తె అయిన మణికర్ణికను తన యాభైయ్యవ ఏట పెళ్ళిచేసుకున్నాడు. ఆమె అంతకుమునుపే మంత్రి కుమారుడైన రవిచందుని ప్రేమించింది. మహారాజు ఏరి కోరి చేసుకోవడంలో ఆమెకు మరో గత్యంతరం లేకపోయింది"

ఒక్కక్షణం ఆగింది. తను ఈ కథ చెబుతుండగా చుట్టూ వాతావరణంలో ఏదో మార్పు వచ్చినట్లనిపించిందామెకు. సహజంగా వేడిగా వుండే ఆ ప్రాంతం సడన్‌గా చల్లబడిపోయింది. గాలి కూడా ఆగిపోయి, నిశ్శబ్దంగా వింటున్నట్లుంది.

"తేజా, ముందుకు వెళ్దాంపద" అతని చెయ్యిపట్టుకుని నడుస్తూ చెప్పింది శైలజ.

"తర్వాత ఏమైంది? " శ్రీకాంత్ కుతూహలంగా అడిగాడు

"వివాహమైనా మణికర్ణిక తన పూర్వపరిచయాన్ని వదులుకోలేదు. ఒకనాడు రాణిగారి అంతఃపురంలో వాళ్ళిద్దరూ ఉండగా జయసింహుడు చూశాడు. ఆచారప్రకారం రవిచంద్రునితో యుద్ధానికి తలపడ్డాడు.

"అదిగో... భుజంపై చిలుకతో నిలబడి వున్న యువకుని ప్రతిమ చూశారా? అతడే రవిచంద్రుడు. అది అతని పెంపుడు చిలుక. పెద్దసైజులో విచిత్రంగా వుండేది. చాలా చిత్రంగా అరిచేది. రవిచందునికి, మణికర్ణికకు మధ్య ప్రేమరాయబారిగా వ్యవహరించేది"

"ఆ కథంతా టి.వీలో చూపిస్తున్నారుగా"

శ్రీకాంత్ ఆసక్తిగా చుట్టూ చూస్తున్నాడు. శైలజకు మాత్రం భయంగా వుంది. అది అంటువ్యాధిలా తేజాకు వ్యాపించింది. అతని చెవులకు చుట్టూవున్న గాలిలో ఎవరో గుసగుసలాడుతున్నట్లు అస్పష్టమైన శబ్దాలు వినిపిస్తున్నాయి. అక్కడినుండి పారిపోవాలని వుంది కాని కాబోయే భార్య ముందు లోకువ అయిపోతానని ఆలోచిస్తున్నాడు.

"ఆ తర్వాత ఏమైంది? " శ్రీకాంత్ అడిగాడు.

"జయసింహునిముందు రవిచంద్రుడు ఆగలేకపోయాడు. జయసింహుడు అతడిని అంధునిగా చేశాడు. మణికర్ణిక ఆత్మహత్య చేసుకుంది. జయసింహుడు కూడా కత్తితో పొడుచుకుని చనిపోయాడు"

"చెప్పింది చాలు శైలూ. పద ముందుకు వెళ్ళి చూద్దాం" అన్నాడు తేజ.

ఆరోజు వాళ్ళు ముగ్గురూ అరమరికలు మరిచి కలిసిమెలిసి తిరిగారు. తెచ్చుకున్న ఆహారపదార్థాలు కడుపునిండా తిన్నారు. ఆ తర్వాత 'మణికర్ణిక అంతఃపురం' దగ్గర కూర్చుని పేకాట మొదలుపెట్టారు.

క్రమంగా చుట్టూ చీకట్లు ముసురుతున్నా ఆటలో పడినవాళ్ళకు కాలం తెలియలేదు. ఆటలో వున్నా శైలజ మాట్లాడుతూనే వుంది. 'మణికర్ణిక' కథను మళ్ళీమళ్ళీ చెబుతోంది.

తేజ ఇక భరించలేక ఇప్పుడే వస్తానంటూ బయటకు వెళ్ళిపోయాడు.

శ్రీకాంత్ కూడా తిరుగు ప్రయాణానికి అన్నీ సర్దసాగాడు.

ఆరోజు నిండుపూర్ణిమ. ఆకాశంలో అందమైన అమ్మాయి ముఖంలా చందమామ మెరిసిపోతోంది. చుట్టూ పరిసరాలు అదోరకమైన కాంతితో ధగధగలాడుతున్నాయి.

ఆ వెన్నెలలో శైలజ పాలతో స్నానం చేస్తున్న వనదేవతలా వుంది. యధాలాపంగా ఆమెవైపు చూసిన శ్రీకాంత్‌కు ఆమెలో ఏవో కొత్త అందాలు కనిపించాయి.

అతనికి తనలో ఎవరో ప్రవేశించినట్లు తల భారంగా తయారైంది. ఇంతలో ఎక్కడినుండో ఒక అరుపు వినబడింది. భయంతో కెవ్వున అరిచిన శైలజ శ్రీకాంత్ వైపు పరుగులుపెట్టింది. అప్రయత్నంగా అతడామెను రెండు చేతులతో పొదివి పట్టుకున్నాడు.

వేగంగా కొట్టుకుంటున్న ఆమె గుండె చప్పుడు అతన్ని సమ్మోహితుడిని చేస్తోంది. ఎక్కడినుండో ఒక చిలుక అరుపు వాళ్ళ చెవులకు వినిపిస్తోంది.

శైలజలో మెల్లిగా మార్పు వస్తోంది. ఆమె శ్రీకాంత్ కౌగిలిలో అతని చేతలకు అనుగుణంగా మారసాగింది. ఎక్కడినుండో వీణా నాదం వినిపిస్తోంది.

శైలజకు ఏమీ గుర్తుకురావడంలేదు. తన తల్లితండ్రులుగాని, తాను ఎంతో ప్రేమించే తేజగాని ఆమెకు ఆ క్షణాన జ్ఞాపకం రావడంలేదు.

తేనె పసుపు కలిపినట్లుండే ఆమె మేని రంగు వెన్నెలలో మరింత కాంతితో మెరుస్తోంది. ఏదో తెలియని నిషాలో ఉన్నట్లు




నిముషాలలో ఆమెను ఆక్రమించుకున్నాడు శ్రీకాంత్.

ఇంతలో తేజ వచ్చాడు. వాళ్ళనాస్థితిలో చూడగానే అతని ముఖం కోపంతో జేవురించింది.

వారికి పక్కగానే కనుపించిన పెద్ద బండ రాయినెత్తి సరిగా వాళ్ళ నెత్తిన పడేలా విసిరాడు బలంగా.

అంతే!

చిందిన రక్తం, ఛిద్రమైన ఇద్దరు ఆప్తుల శిరసులు చూడగానే అతనికి కళ్ళు తిరిగి, నిల్చున్న పళంగా కూలబడిపోయాడు.

మరికాస్సేపటికి తేరుకున్న తేజ లేచి మామూలు మనిషయ్యాడు. జరిగింది చూసేసరికి అతనికి మతి చలించింది.

ఏవేవో అదృశ్యరూపాలు అతనిచుట్టూ నాట్యంచేస్తున్నట్లున్నాయి. వాటి కదలికలు, అరుపులు, అతని చెవులకు స్పష్టంగా వినబడుతున్నాయి..

శైలజ...

అతని ప్రాణంలోప్రాణమైన శైలజ, ప్రస్తుతం నిర్జీవమై నేలపై పడివుంది. తన స్నేహితుడు శ్రీకాంత్ ఆ పక్కనే ఆమెను కౌగలించుకుని... పిచ్చివాడిలా పరుగులు తీసి, కోటగోడమీంచి క్రింది అగాధంలోకి దూకేశాడు తేజ.



ఆ గుడి, ఈ కోట ఉన్న సీరియల్స్‌కు కథ రాసింది వీరభద్రం!

వీరభద్రం ఆవిధమైన కథలు రాయడానికి కారణం డబ్బు అవసరం. కార్తీక్ బలవంతం లేకుంటే అటువంటివి అతను కలలో కూడా సృష్టించలేడు.

తన కారణంగా ఇలా జరగటం, దోపిడీలు, ముగ్గురు పిల్లలు బలైపోవడం వీరభద్రాన్ని కుంగదీస్తుందని కార్తీక్‌కి తెలుసు. బహుశ ఇకపైన కలంపట్టడం మానేస్తాడేమోననుకున్నాడు. కాని వీరభద్రం అతను ఊహించిన దానికంటే తీవ్రంగా రియాక్ట్ అయ్యాడు. ఇక ఎప్పటికీ రాయలేని చోటుకు వెళ్ళిపోయాడు.

నిజాయితీగా, ఆత్మసాక్షిగా రాయగలిగే సత్తావున్న రచయిత ఆత్మహత్య చేసుకుని సాహిత్యానికి దూరంగా వెళ్ళిపోయాడు.

కార్తీక్ చాలా బాధపడ్డాడు. తనవల్ల ఒక మనిషి చనిపోవడం ఇది రెండవసారి.

మొదట రేణుక.

ఇప్పుడు వీరభద్రం.

నిజానికి వీరభద్రాన్ని రచయితగా తను ఏనాడో చంపేసాడు. అతనికి ఇష్టంలేని రచనలు అతనితో చేయించినప్పుడు వీరభద్రం చనిపోయాడు. ఆ మిగిలిన కట్టె ఇప్పుడు వెళ్ళిపోయింది.

వీరభద్రాన్ని చూసినప్పుడు అతని కళ్ళ వెంబడి అశ్రువులు కాదు రాలింది, అతని హృదయం. పశ్చాత్తాపమనే అగ్నిలో దహింపబడి అంతరాత్మ మథనంతో గిలక్కొట్టబడి నీరై అతని కన్నుల వెంబడి బయటకు వచ్చింది.

డబ్బు కొరకు, కీర్తి కొరకు ఏమైనా చెయ్యవచ్చు అనే తన సిద్ధాంతానికి గండిపడింది. మీకు ఎవరూ శత్రువులు లేరు. మీకు మీరే శత్రువు" అన్న పార్వతి మాటలు అతని చెవులో మారుమ్రోగుతున్నాయి.

అతనికి తెలుస్తోంది శత్రువులు తనలోనే వున్నారని.

క్రోధం తన మొదటి శత్రువు.

ఎవరైనా చిన్నమాట తనకు వ్యతిరేకంగా మాట్లాడితే విరుచుకుపడిపోయే కోపం. ఎదిరించిన వారి అంతం చూడమనే ఆవేశం.

లోభం తన రెండవ శత్రువు.

ఎంత సంపాదించినా తృప్తిపడని తన లోని లోభి ఇంకా ఇంకా సంపాదించమంటున్నాడు. రక్తాన్ని, చెమటని నోట్ల కట్టలుగా చేసి దాచమంటున్నాడు. అందుకొరకు తన జీవితాన్ని , అవసరమైతే ఇతరుల



ప్రాణాలను కూడా పణంగా పెట్టమంటు న్నాడు.

మాత్సర్యం తరవాతి శత్రువు.

తోటి రచయితలంటే ఈర్ష్య లేకున్నా తన కంటే ఎక్కువ పేరు ప్రఖ్యాతులొస్తే మాత్రం సహించలేడు.

తన పంతం నెగ్గించుకోవడానికి, ఇతరుల ఆత్మాభిమానాన్ని దెబ్బతీయడానికి వెనుకాడని అహంకారి.

కార్తీక్‌కు తల భారంగా వుంది. ఏవేవో ఆలోచనలు ఈగల్లా ముసురుతున్నాయి.

★ ★ ★

పార్వతి కళ్లు మంకెన పూవుల్లా వున్నాయి. చాలా సేపు ఏడ్చి వుండాలి. వీరభద్రంతో పార్వతికున్న అనుబంధం కార్తీ

క్‌కు తెలుసు. వాళ్ల పెళ్లికాకముందే ఆమె వీరభద్రాన్ని కథారచయితగా అభిమానించేది. ఆ తర్వాత అతను కార్తీక్ స్నేహితుడు కావడంతో వాళ్ల బంధం మరీ బలపడింది.

"టేకిట్ ఈజీ పారూ! మనందరం చేరవలసింది అక్కడికే" చెప్పాడు కార్తీక్.

"నిజమేనండీ. కానీ వీరభద్రాన్ని మనమే చంపేశాం"

ఉలిక్కిపడ్డాడు కార్తీక్. సరిగ్గా ఆమాటే ఇంతకుముందు తనూ అనుకున్నాడు. కానీ పార్వతి అదేమాట అనేసరికి బాధ కలిగింది.

"అతడిని ఎవరు చనిపొమ్మన్నారు? అతడే పిరికివాడిలా ఆత్మహత్య చేసుకున్నాడు"

"ఆయనకు ఆ పరిస్థితి మీరే కల్పించారు. హాయిగా పాఠాలు చెప్పుకునే బడిపంతులితో బ్యాంకు దోపిడీ చేయించినట్లు, వేద



మంత్రాలతో దేవీ ఉపాసన చేసుకునే సద్బ్రాహ్మణుడితో శ్మశానంలో తంత్రపూజలు చేయించినట్లు వీరభద్రాన్ని దారి మళ్ళించింది మీరు కాదా? ఆశయానికి, ఆచరణకు మధ్య సయోధ్య కుదరకా, దాని దుష్ఫలితాలు చూసీ అతను ఆత్మహత్య చేసుకున్నాడు"

పార్వతి కంఠంలో ఏడుపు జీర తొంగి చూస్తోంది.

"అంటే నేను చెడుమార్గాన వెడుతున్నానంటావా? "

"ఆమాట నేనెందుకంటాను? మీకు నచ్చినదారిలో మీరు వెడుతున్నారు. ఆ దారిలోకే అందరూ రావాలనడం అన్యాయం అంటున్నాను"

"కానీ నన్ను ఇలా రాయమని సలహా ఇచ్చింది నీవే కదా? " హీనస్వరంతో అడిగాడు.

"అవును. నేనే చెప్పాను. కానీ అది నా బాధ్యత కార్తీ. భర్తకు విధి నిర్వహణలో మంత్రిలా సలహాలివ్వడం భార్య విధి. పైగా అప్పటి పరిస్థితిలో ఈ రంగంలో నీవు నిలదొక్కుకోవడానికి అది తప్పనిసరి. అయితే ఆ తర్వాత కళ్లాలు మీ చేతికి వచ్చాక కూడా మీరు అదే మార్గాన నడిచారు. బతకడానికి డబ్బు కావాలన్నారు. నిజమే. కానీ మీకు డబ్బే బతుకైపోయింది. అది కూడా మీ సొంత సిద్ధాంతం. దానిని కూడా కాదనం. కానీ మావిచిగురు తింటూ మత్తుగా మధురంగా కూసేకోయిలనూ, పేడను ఉండలు చేసి దొర్లించే పురుగును ఒకేలా బతకమనడం అన్యాయం"

ఎవరు కోయిల, ఎవరు పురుగని కార్తీక్ అడగలేదు. మౌనంగా కూర్చున్నాడు. ఎవరో కదిపిన తేనెతుట్టనుండి ఝుమ్మని లేచిన ఈగల్లా అతని మదిలో ఆలోచనలు కదులుతున్నాయి. అతనిలోని మానసిక సంఘర్షణకు ప్రతీకగా నుదిటిపై నరాలు ఉబ్బి కనబడుతున్నాయి.

"ఇది చదవండి కార్తీక్. ఒక మనిషి చనిపోతూ ఇచ్చిన మరణ వాంగ్మూలంలాంటిది ఈ ఉత్తరం"

ఒక కాగితం ఇస్తూ చెప్పింది పార్వతి.

కార్తీక్ గుండె దడదడలాడింది.

వణుకుతున్న చేతులతో కాగితం విప్పాడు.

"భగవంతుడిచ్చిన అద్భుతమైన జీవితం నుండి పారిపోయిన ఈ మనిషి నాకు ఉత్తరం రాసాడేమిటా అని ఆశ్చర్యపోతున్నావా? ఈ జీవితపు చివరి క్షణాలలో నిన్ను ఒక కోరిక కోరాలనిపించింది. అందుకే ఈ ఉత్తరం!

మా అమ్మ మంచి సంగీత విద్వాంసురాలు. బాల్యంలోనే అమ్మగొంతు వింటుంటే ఏదో లోకాలలో విహరిస్తున్నట్లుండేది. అయితే...

ఒక్కోసారి కమ్మగా పాడుతున్న ఆ కోయిల కంఠాన్ని కత్తితో నరికేసినట్లు హఠాత్తుగా కర్ణకఠోరమైన తిట్లు వినపడేవి.

నాన్న తాగివచ్చి అమ్మను చిత్రహింసలు పెట్టేవాడు. అమ్మతోపాటు నేను కూడా ఏడ్చేవాడిని. అంతకుమించి ఆ వయస్సులో ఏంచెయ్యాలో తెలిసేదికాదు.

ఒకరోజు బడినుండి ఇంటికి వచ్చేసరికి అమ్మ చచ్చిపోయింది. అమ్మ చావుకు నాన్నే కారణమని అందరూ అన్నారు. మరి కొన్ని రోజులకు నాన్న ఎవరో ఆడమనిషిని తీసుకుని ఎక్కడికో వెళ్ళిపోయాడు.

జీవితం అంటే ఏమిటో తెలియని రోజుల్లో నా బతుకు భారం నాపైనే పడింది. ఎవరో దూరపు బంధువులు తీసుకువెళ్ళారు. వాళ్ళింట్లో రకరకాల పనులు చేసే కుర్రాడిగా పసిపిల్లలను మోసే పనివాడిలా చాలాకాలం బతికాను.

పగలంతా నా జీవితం నన్ను భయపెట్టినా, రాత్రి నాలోనుండి మరో మనిషి బయటకు వచ్చేవాడు.

మనస్సు రాత్రివేళ చల్లని వెన్నెల వెలుగును, తళుక్కున మెరిసే నక్షత్రాల కాంతిని చూసి పరవశించేది. మనోహరమైన ప్రకృతిలో లీనమయ్యేది.

ఆ బాధ, ఆ సుఖం కలగలసి నాతో కలం పట్టించాయి. కార్ఖానాలలో ఇనుప ముక్కలమధ్య పనిచేసే పాలబుగ్గల పసివాళ్ళ వ్యధ నన్ను కదిలించేది. బిడ్డ పాల కొరకు వ్యభిచరించే ఆడవాళ్ళ వ్యధ నన్ను కుదిపేసింది.

అమ్మ ప్రేమ, ఆడదాని అనురాగం, అన్నీ కలగలిపి కథలుగా రాసేవాడిని. రచయితగా మారినప్పటినుండి నేను ఒకేఒక సిద్ధాంతానికి కట్టుబడ్డాను.

"ఒక వ్యక్తి తప్పుమార్గాన వెడితే అతను ఒక్కడే చెడతాడు. ఒక తండ్రి తప్పుమార్గాన వెడితే అతని పిల్లలు చెడతారు. కానీ ఒక రచయిత తప్పుమార్గాన వెడితే మొత్తం సమాజమే చెడిపోతుంది"

రచయితగా మొదటినుండి నా నమ్మకం అదే. కాబట్టే నాలుగేళ్లలో నీవు చేసినన్ని రచనలు రెండు దశాబ్దాలకాలంలో కూడా నేను చెయ్యలేకపోయాను.

రచయితగా మనం సమాజాన్ని అమృతమయం చెయ్యకపోయినా ఫర్వాలేదు. విషపూరితం మాత్రం చేయకూడదని పదేపదే చెప్పాను.

నీవు నమ్ముకున్న సాహిత్యం నీకు డబ్బువల్ల వచ్చే సౌఖ్యాలన్నీ ఇచ్చింది. పేరుప్రతిష్టలను తెచ్చిపెట్టింది.

కార్తీ! మన పిల్లలు చూడకూడని దృశ్యాలు చూస్తున్నారు. వినకూడని మాటలు వింటున్నారు. వాటిని మనమే సమకూరుస్తున్నాం.

నీ ఎదుగుదలకు నీవు వేసిన బీజం విషవృక్షమై విస్తరించింది. రేపు దాని విషఫలాలు మన సంతానానికీ అందిస్తుంది. అప్పుడు మనం చెయ్యగలిగిందేముంది.

జరిగిన దుర్ఘటనలు చూశావుగా? ఇలా జరగవచ్చుననే నేను మొదటినుండి భయపడుతున్నాను. కానీ నా కూతురికాపురం నిలబెట్టడం కోసం, నా అల్లుడి దురాశను తీర్చడం కోసం, అన్నింటినీమించి నీ అహాన్ని చల్లార్చడం కోసం రాయవలసివచ్చింది.

ఫలితంగా నా కూతురి వయస్సుదే మరో అమ్మాయి బలైపోయింది. నేను ఏది జరగకూడదని మొక్కుకున్నానో అది నా వల్లే జరిగింది.

నా అంతరాత్మ నన్ను హంతకుడంటుంది. జీవితాంతం ఈ రంపపు కోత నేను భరించలేను.

అందుకే నిశ్శబ్దంగా వెళ్ళిపోతున్నాను.

ఇదంతా నీవల్లే జరిగిందని నిన్ను నిందించను.

నేను నిన్ను విమర్శించేది నీపై అసూయతోకాదు, నిన్ను సరియైన దారిలో పెట్టాలని మాత్రమే.

రాయలేని వాళ్ళు ఎలాగూ చెత్త రాస్తున్నారు. నీ పరిస్థితి అదికాదు.

నీవు మంచి రచనలు చెయ్యగలవు. పదికాలాలు తెలుగువాళ్ళు దాచుకుని మరీ చదువుకునే రచనలు ప్రస్తుతం నీవు మాత్రమే చెయ్యగలవు.

అందుకోసమే...

నీచేత అటువంటి రచనలు చేయించడం కొరకే నిన్ను విమర్శించాను.

నిన్ను కర్తవ్యోన్ముఖుడిని చేశానని భావించాను. కానీ నీవు నాచేత ఒక విషపు బాణాన్ని సంధింపచేశావు. అది ముగ్గురి పిల్లల ప్రాణాలను బలిగొంది.

ఇటువంటి తీవ్ర పరిణామాలు ఎదురవ్వకూడదనే నేను నిన్ను ఎన్నోసార్లు ఈ కమర్షియల్ వాల్యూస్‌నుండి బయటకు రమ్మని కోరాను. కానీ నీవు నామాట వినలేదు. నేను చెప్పినట్లు రాస్తే ఆ రచనలు ఎవ్వరూ చదవరని తీసిపారేశావు. నిజమే! ఒకనాడు

నీవు రాసిన అపురూపమైన రచనలు ఎవ్వరూ ప్రచురించలేదు. ఈ సందర్భంలో నాకు ఒకటి గుర్తొస్తోంది.

ఒక హంస గ్రహపాటున కొంగల మధ్యకు వచ్చి వాలింది. అది తమలాలేదని కొంగలు గ్రహించాయి. అందుకే ఎక్కడి నుండి వచ్చావని అడిగాయి.

మానస సరోవరంనుండి వచ్చానంది హంస.

కొంగలు ముఖాలు చూసుకున్నాయి. మానస సరోవరం ఎక్కడో వాటికి తెలీదు. అక్కడ ఏంవుందని అడిగాయి. కోమలమైన బంగారువన్నె పూవులు, ముత్యాలు దొరకుతాయని చెప్పింది హంస.

"అక్కడ నత్తలు, పిత్త పరిగలు దొరకవా? " అని అడిగాయి కొంగలు. తెల్లబోయిన హంస అవేమిటో తనకు తెలియవంది.

అంతే! కొంగలన్నీ ఆ హంసను ఎగతాళి చేస్తూ పెద్దగా నవ్వాయి.

నత్తలకు మాత్రమే అలవాటుపడిన ప్రాణులకు 'మువ్వపుగాంచ నాబ్దముల', 'మౌక్తికముల' విలువ తెలియదు. అందుకే కొంగలు హంసను హేళన చేసాయి.

అంత మాత్రాన హంస కొంగల గుంపులో చేరిపోలేదు కదా? కాని నీవు మాత్రం ఆ కొంగల గుంపులో చేరిపోయావు. చుట్టూవున్న కొంగలను హంసలుగా మార్చేప్రయత్నం మాని నీవు కూడా నత్తలకు అలవాటు పడిపోయావు. ఇప్పటికైనా మించిపోయింది ఏమీలేదు కార్తీక్. సాహితీ జగత్తులో నీవు ఆడిందిఆట పాడిందిపాట గనుక కొద్దిగా శ్రమ తీసుకుని దీని దారి మార్చు. నీ తొలి రచనలవంటి అపురూపమైన రచనలు మరికొన్ని రావడానికి నీవు నడుం బిగించు.

తల్లీకొడుకులమధ్య అనురాగాన్ని, తండ్రికి కూతురికి మధ్య వుండే అనుబంధాన్ని, భార్యాభర్తల మధ్య ఆప్యాయతనూ, వీటినన్నింటినీ ఇతివృత్తాలుగా తీసుకో. నిర్లక్ష్యం చెయ్యబడుతున్న బాల్యం, విపరీతమైన వేదనకు గురవుతున్న వృద్ధాప్యం ఇలా జీవితంలోని వివిధ కోణాలను ఎన్నుకో. వాటిని గూర్చి రాయి. అంతేగాని నరమాంస భక్షకుల గురించి, మాఫియా గ్యాంగుల పోరాటాల గురించి, దేవాలయాలలో దొంగతనాల గురించి నీవు ఎవ్వరికీ చెప్పనక్కరలేదు.

విదేశాలలోవున్న డేటింగ్ సంస్కృతిని ఇక్కడ పరిచయం చెయ్యనక్కరలేదు. నాకో కవిత గుర్తొస్తోంది.

"తిరిగే భూగోళాన్ని ఆపేయండి దిగిపోతాన్నేను

మానవత వసించవలసినచోట దానవత సహించలేను

నరకం లేదులేదన్నవాళ్ళే నరలోకాన్ని నరకం చేసారు.

స్వర్గం వట్టిదివట్టిదన్నవాళ్ళే స్వప్రయోజనాల స్వర్గం సృష్టించారు"

నీవు అటువంటి మేధావుల కోవకి చెందకూడదు. అందుకే కనీసం ఇకనుండయినా, పరిమళభరితంగా, ఆర్ద్రంగా వుండే మంచి అనుభూతిని పాఠకులలో కలుగజేయి. మనస్సులలోని అనుభూతులకు అక్షర రూపం ఇవ్వు.

సరస్వతీదేవి వేసుకున్న కర్పూర తాంబూలపు తాపులవంటి మెత్తని రచనలు నీనుండి రావాలి.

అలా చెయ్యమని నిన్ను మాత్రమే ఎందుకు అడుగుతున్నానో తెలుసా?

నీవు నడిచేదారిలో పదిమందిని నడిపించగల సామర్థ్యం నీలో పుష్కలంగా వుంది గనుక! కార్తీక్! నా చివరి ప్రార్థనగా ఆ సర్వాంతర్యామిని ఏమని కోరుతున్నానో తెలుసా?

పదార్థంలో అణువుని, ప్రాణులలో జీవాన్ని, నింపిన ఓదేవా! మాకు సత్యమా





ర్గాన నడిచే బుద్ధిని ప్రసాదించు.

మంచి మార్గాన మమ్ము నడిపించు. ఏ ప్రలోభానికి ఏ ఒత్తిడికి లొంగకుండా మేము సరియైన మార్గంలో నడిచేలా చెయ్యి.

"అసతోమా సద్గమయా"

కార్తీక్ పూర్తిగా చదవలేకపోయాడు. అతని మనస్సంతా శూన్యంగా మారిపోయింది.

రెండు చేతుల మధ్య ముఖం దాచుకుని కూర్చున్నాడు.

తన పరిస్థితి ఏమిటో అతనికి అర్థం కాలేదు.

అతని జుత్తు లోనికి వేళ్లు పోనిచ్చి దువ్వింది పార్వతి. అతని తలను తన గుండెలకేసి అదుముకుంది.

అతనికి అమ్మ ఒడి గుర్తుకువచ్చింది. ఆ క్షణాన తన పురుషత్వం, సంఘంలో తన పేరుప్రతిష్టలు, డబ్బు, పరపతి ఏవీ అతనికి గుర్తుకు రాలేదు.

ఓదార్పు కావాలి.

తనను సర్వం మరిపింపజేసే రెండు చేతుల ఆసరా కావాలి.

అతని కన్నులనిండా నీరు చోటుచేసు కుంది.

★ ★ ★

2010

చీకటి

కన్నుపొడుచుకున్నా కానరాని కటికచీకటి.

అమావాస్య కావడంతో మనిషి మనస్సులో పాపంలా పెనుచీకటి.

ఆ చీకట్లో బ్రహ్మరాక్షసునిలా ఊరికి దూరంగా వుందా భవంతి.

విశాల ప్రాంగణంలో రాజప్రాసాదంలా ఠీవిగా నిలబడివుంది.

చాలా పురాతనమైన బంగళా అది.

ఎన్నో ఏళ్ళకిందటి కట్టడం కావడంచేత పాడుబడిన ఛాయలు కనిపిస్తున్నాయి.

అందుకే దాన్ని అందరూ దెయ్యాలమేడ అంటారు.

చీకటిపడితే ఆ ఛాయలకు వెళ్ళడానికే ప్రజలు భయపడతారు. పగటివేళ కూడా అక్కడ అంతగా జనసంచారం వుండదు.

అటువంటి ప్రదేశంలో ఆ నిశ్శబ్ద నీరవనిశీధిలో.

ఒక ఆడపిల్ల ఆర్తనాదం.

గావుకేక...

తీతువుకూతలా...

మృత్యుగీతంలా...

భయంకరంగా...

వికృతంగా...

ఆ అరుపుకు అక్కడే మర్రిచెట్టుపై విశ్రాంతి తీసుకుంటున్న పక్షులు గోలగా అరిచాయి. రెక్కలు టపటపలాడించాయి.

ఎవరో నలుగురు ముసుగు మనుష్యులు ఒక ఆడపిల్లను మోసుకువస్తున్నారు.

ఆ అమ్మాయిలో ఇంకా పసితనపు ఛాయలు పోలేదు. యవ్వనం ఇప్పుడిప్పుడే తన ప్రభావం చూపిస్తోంది.

భైరవునికి ప్రసాదంగా అర్పించడానికి అటువంటి అమ్మాయే కావాలి.

పూర్తిగా బాలిక కాకూడదు.

పూర్తిగా యవ్వనస్తురాలు కాకూడదు. విరిసీ విరియని పువ్వు.

ఆ అమ్మాయిని భవంతి లోపలకు తీసుకువెళ్లారు.

అక్కడ ప్రధాన సాధకుడు! అతని వెనుక భయంకరంగా చూస్తున్న భైరవుని విగ్రహం!

ఆ విగ్రహం తల కుక్కతల.

శరీరం మనిషి శరీరం. పైగా నగ్నంగా నిలబడి వుంది.

ఆ విగ్రహం ముందు నేలపై దీపాలు పేర్చి వున్నాయి.

వాటి మధ్య ఆ బాలికను కూర్చోబెట్టారు. చిత్రంగా అంతవరకు గింజుకుంటున్న పిల్ల

అక్కడ కూర్చో బెట్టగానే చిత్తరువులా బిగిసి పోయింది.

సాధకుడు కన్నులు మూసుకుని భైరవు డిని ప్రార్థించాడు. చుట్టూవున్న మనుషులు కూడా భైరవుడిని ప్రార్థించారు. వాళ్ళు రెండు చేతులు గుండెలపై అటుఇటు వేసు కున్నారు. దాని అర్థం క్షుద్రదేవతలకు తాము లొంగి వుంటామని చెప్పడం.

సాధకుడు నోటిని నీటితో శుభ్రంగా కడుక్కున్నాడు.

నోటిలో ఏ చిన్న పదార్థమున్నా మంత్రో చ్ఛారణకు ఇబ్బంది కలుగుతుంది.

అటువంటి వాటిని క్షుద్రదేవతలు అసలు సహించరు.

క్షుద్రదేవతోపాసనలో ఏమాత్రం తేడా వచ్చినా సాధకుని ప్రాణాలకే ప్రమాదం అనీ... సాధకుడు నెత్తురు కక్కుకుని చని పోతాడనీ... వాళ్లంతా నమ్ముతారు.

ఆ అమ్మాయిని అక్కడే వదలి భక్తులం దరూ బయటకు నడిచారు.

ఆ గది తలుపులు మూసివేయబడ్డాయి. సాధకుడు ఆ అమ్మాయి ఎదురుగా కూర్చుని పెద్దగా మంత్రాలు చదువుతు న్నాడు. మధ్యమధ్య తనముందున్న పాత్రనుండి బూడిదతీసి ఆమెపై వేస్తు న్నాడు.

ఎక్కడినుండో ఒక జాగిలం అరపు అదో మాదిరిగా వినబడింది.

అదే సంకేతం.

భైరవుడు సిద్ధంగా వున్నాడు.

తను సిద్ధంచేసిన కన్నెపిల్లను ఆఘ్రాణిం చడానికి భైరవుడు సిద్ధంగా వున్నాడు.

సాధకుడు మెల్లిగా లేచాడు.

ముగ్గులో వున్న బాలికను లేపాడు.

ఆ అమ్మాయికి తెలివి వచ్చింది.

గావుకేక పెట్టిందా బాలిక.

సాధకుడు వడివడిగా బయటకు నడిచాడు. అతని వెనుకే తలుపు మూసుకుపోయింది. ఆ అమ్మాయి గుండెలు దడదడలాడుతున్నాయి.

ఆమె శరీరం దీపాల కాంతిలో చిత్రంగా మెరుస్తోంది.

సరిగ్గా ఆ సమయంలో ఎదురుగా వున్న భైరవుని విగ్రహంలో చలనం వచ్చింది.

అది చూసి భూనభోంతరాళాలు దద్దరి ల్లేలా అరిచిందా అమ్మాయి

చేతిలోని పెన్ను పక్కన పడేశాడు అన్వేష్.

కూర్చున్న చోటునుండి లేచి కిటికీ దగ్గ రకు వెళ్ళాడు. ఆరంతస్తుల బిల్డింగ్ అది. అక్కడినుండి తిన్నగా తన కుర్చీవద్దకు వచ్చి కూర్చుని అంతకుముందు ఆపిన దానిని తిరిగి రాయసాగాడు. కింద వెళ్ళే వాహ నాలు బొమ్మల్లా కనబడుతున్నాయి.

ప్రస్తుతం అతడు తెలుగు రచయితలలో నెంబర్‌వన్.

పత్రికలలో సీరియల్సేగాక సినిమాలకు, టి.వి. సీరియల్స్‌కు కథలు సమకూరుస్తు న్నాడు.

నొప్పులు పెడుతున్న వేళ్ళు వెనక్కు విరు చుకున్నాడు. అక్కడే కాసేపు నిలబడి మళ్ళీ లోపలకు వచ్చేసాడు. అది అతని అల వాటు. రాతమధ్యలో అటుఇటు నడుస్తూ ఆలోచిస్తాడు.

ఒకప్పుడు తెలుగు సాహిత్యంలో కార్తీక్ వున్న స్థానంలో ప్రస్తుతం అన్వేష్ వున్నాడు.

అంతే! మిగిలినవి ఏమీ మారలేదు.

సీరియల్స్ మరింత జుగుప్సాకరంగా తయారైపోయాయి.

వాటిని పిల్లలు, పెద్దలు అందరూ చూస్తు న్నారు, చదువుతున్నారు.

విమర్శించే వాళ్ళు విమర్శిస్తున్నారు.

చదివేవాళ్ళు చదువుతున్నారు.

కాలచక్రం గిర్రున తిరుగుతోంది.






# ఏరినముత్యాలు

★ సముద్రంలో కురిసిన వాన, కడుపు నిండిన వాడికి పెట్టిన భోజనం, డబ్బు కలవాడికి చేసిన దానం, దరిద్రుడికిగల యౌవనం ఇన్నీ వ్యర్థమైనవి.

–సంస్కృతసూక్తి

★ ఏ వ్యక్తి అయినా తన స్వభావానికి తగిన పరిస్థితులుంటే ఆనందంగా ఉండగలుగుతాడు. అయితే పరిస్థితులకు సరిపడే స్వభావాన్ని అలవరచుకోగల వ్యక్తి ఎంతగానో అదృష్టవంతుడు.

–హ్యూమ్

★ మనం కావాలనుకొంటే ఈ ప్రపంచాన్ని ఒక అందమైన సౌధంగా నిర్మించుకోగలం లేదా ఒక కర్కశకారాగారంగా కూడా తయారుచేసుకోగలం. అంతా మన చేతుల్లోనే వుంది.

–సర్‌జాన్‌లోబ్బక్

★ పువ్వు ఎంత అందంగా వున్నా పరిమళం లేకపోతే అది వ్యర్థమే. అలాగే క్రియాశూన్యమైన మాటలు వినడానికి ఎంత సొంపుగా వున్నా నిష్ప్రయోజనమే.

–సుభాషిత రత్నావళి

★ డబ్బు, కాలం ఇవి రెండూ జీవితంలో చాలా బరువైన సమస్యలు. ఈ రెంటిలో ఏదో ఒకటి అవసరానికి మించి ఉండి కూడా దాని ఉపయోగం తెలియకపోతే అంతకన్నా దురదృష్టం మరొకటి ఉండదు.

–జాన్సన్

★ ఓర్పు ఉన్నయెడల కవచములక్కరలేదు. కోపమున్న యెడల శత్రువులక్కరలేదు. దాయాది యున్న యెడల వేరే నిప్పు అక్కరలేదు. మిత్రుడుండెనేని సిద్ధౌషధములక్కరలేదు. దుర్జనులుండెనేని సర్పము లక్కరలేదు.

–భర్తృహరి

★ ఎండుకట్టెలవల్ల, కొబ్బరిపీచువల్ల, ధూళివల్ల కూడా ప్రపంచానికి ఏదో ఒక ప్రయోజనం ఉంటుంది. రాజ్యం కోల్పోయిన రాజువల్ల మాత్రం ఎవరికీ ఏ ఉపయోగమూ ఉండదు.

–రామాయణం

★ నదులనిండా నీరు వుంటుంది. కాని, ఆ నీరుని నదులు త్రాగవు. చెట్ల నిండా పండ్లుంటాయి. కానీ ఆ పండ్లును చెట్లు తినవు. మేఘాలు వర్షించి పంటలు పండిస్తాయి. కాని ఆ పంటలను మేఘాలు తినవు, అలాగే లోకంలో ధర్మాత్ములైనవారు తాము సంపాదించింది తాము అనుభవించక ఇతరులకోసం వినియోగిస్తారు.

–ట్రేడర్ హార్న్

సేకరణ: ఎన్.కె. రవికుమార్

# చతురకతలు

## అమెరికన్ కర్టెసి

టెన్త్ క్లాస్‌లోనే సుబ్బారావు అమెరికాకి వలసవెళ్ళి అక్కడ సెటిలవ్వాలని అనుకున్నాడు.
అందుకోసం గుంటూరులోని ఓ హాస్టల్‌లో చేరి, యంసెట్‌కి రాసి మంచి రేంక్ తెచ్చుకుని, హైద్రాబాద్‌లో ఉస్మానియా యూనివర్సిటి ఇంజనీరింగ్ కాలేజిలో చేరాడు.
తర్వాత టోఫెల్, జిఆర్‌ఇలు రాసి అమెరికాకి వెళ్ళాడు. వాషింగ్టన్ నగరంలోని ఓ యూనివర్సిటిలో సీట్ వచ్చింది.
మొదటి ఆదివారం వాషింగ్టన్ సిటీ చూడటానికి వెళ్ళాడు సుబ్బారావు. అకస్మాత్తుగా సుబ్బారావు నంబర్ ఒన్‌కి వెళ్ళాల్సిన అవసరం ఏర్పడింది. అయితే ఆంధ్రదేశంలోలా లేవు వాషింగ్టన్ రోడ్లు. ఎన్నిరోడ్లు తిరిగినా శుభ్రంగా అటు ఇటు చెట్లతో, మురిక్కాలవలు అనేవే లేకుండా ఉండటంతో ఏంచెయ్యాలో తోచలేదతనికి.
మరికొద్దిదూరం వెళ్ళాక అతనికో పార్క్ కనిపించింది. ఆ పార్క్‌లోకి వెళ్ళి అటు ఇటు చూసి ఓ గులాబి పొదచాటుకి పని కానివ్వడానికి వెళ్ళాడు.
అయితే ఒక పోలీస్ ఆఫీసర్ సుబ్బారావుని గమనించి అతని దగ్గరకి వెళ్ళి గట్టిగా అడిగాడు.
"ఏంచేస్తున్నావిక్కడ? "




"నేచర్ కాల్‌ని అటెండ్ చేస్తున్నాను" చెప్పాడు సుబ్బారావు.
"నో... ఇది వాషింగ్టన్ మెమోరియల్ పార్క్. ఇక్కడ ఆ పని చేయకూడదు" చెప్పాడు పోలీస్ ఆఫీసర్.
"ఓ! 'ఇక్కడ మూత్రము పోయరాదు' అన్న బోర్డ్ ఎక్కడా లేదుకాబట్టి ఇక్కడ ఓకే అనుకున్నాను. మీరు నో అంటే నోనే" చెప్పాడు సుబ్బారావు.




"నా వెంటరా" చెప్పాడు పోలీస్ ఆఫీసర్. అతని వెంట పార్క్ బయటకి వచ్చాడు సుబ్బారావు.
"కారెక్కు"
సుబ్బారావు గుండె గుభేలుమంది. కేసయిందా?
బయట ఆగి వున్న పోలీసు కార్ డ్రైవింగ్ సీట్ లో కూర్చుని, సుబ్బారావుని తన పక్కన కూర్చోమన్నట్లుగా సైగ చేశాడు.
కారు అవెన్యూలు, బొల్ వార్డ్లు, డ్రైవ్ లు దాటుకుంటూ కొద్దిసేపు ప్రయాణించాక ఓచోట ఆగింది.
కారు దిగి, పోలీస్ ఆఫీసర్ సుబ్బారావుని పక్కనే ఉన్న ఓ అందమైన గార్డెన్ లోకి తీసుకెళ్ళాడు.
పచ్చటి లాన్, అనేక రంగుల గులాబీల చెట్లు, పాటలు పాడే పిట్టలతో ఆ తోట ఎంతో ఆహ్లాదంగా ఉంది.
"ఇక్కడ నీపని కానివ్వచ్చు. హేవ్ ఏ నైస్ డే" చెప్పాడు పోలీస్ ఆఫీసర్.
"ఓ! థాంక్స్. అమెరికన్ కర్టెసినా? " అడిగాడు సుబ్బారావు మెచ్చుకోలుగా.
"కాదు, ఈ గార్డెన్ ఇండియన్ ఎంబసీ వెనుకభాగం" చెప్పాడు పోలీస్ ఆఫీసర్ చిరునవ్వుతో.

—యం.కావ్య

---

## జెట్

ఎయిర్ పోర్టు లాంజ్ లో ప్రయాణికులు ఫ్లయిట్ కోసం ఎదురుచూస్తున్నారు. వచ్చేది ఇంటర్నేషనల్ జెట్. బాంబే మీదుగా వుంది.
సుబ్బారావు ఈమధ్యనే "అక్షరజ్యోతి" కార్యక్రమంలో పలకపట్టి కొన్ని ముక్కలు నేర్చుకున్నాడు. రోజూ వ్యాపారరీత్యా గుడివాడ నుండి గుడ్లవల్లేరు పాసింజర్ రైలులో ప్రయాణించేవాడు. పక్క ప్రయాణికులతో




లండన్ వెళ్తుంది.
సుబ్బారావు సీట్లో కూచొని... మాటిమాటికీ చేతితో జేబుని తడుముకుంటున్నాడు. జేబులో జెట్ టిక్కెట్(?) భద్రంగా పిచ్చాపాటీ మాట్లాడటం ఓ అలవాటు.
ఆ అలవాటుకొద్దీ "ఏడకి వెళ్తున్నావ్! నాయనా" అన్నాడు పక్కతనితో. అతనో బిజినెస్ ఎగ్జిక్యూటివ్ లా ఉన్నాడు. సుబ్బా

రావ్ మాటతీరుకి స్విచ్ నొక్కగానే ప్రయోగించే రాకెట్ కూలిపోతే సైంటిస్టు షాక్ తిన్నట్లు... తిన్నాడు. అతనికి వచ్చిన మొట్ట మొదటి అనుమానం... ఇది అసలు ఫ్లయిట్‌లో వెళ్లే శాల్తీనేనా!? అని.

"లండన్‌కి. మరి మీరు? ".

"ఆ వచ్చే ఇమానం... 'జెట్' గదా నాయనా? "

"అవును ఇంటర్నేషనల్ జెట్? "

"అది ఎక్కి రాష్ట్రమంతటా ప్రయాణం చేయాలనుకుంటున్నా నాయనా? "

"స్టేట్' అంతా తిరుగుతారా? అదేమన్నా మన ముఖ్యమంత్రిగారి హెలికాప్టర్ అనుకున్నారా? ఎక్కడికి పడితే అక్కడికి వెళ్లటానికి? "

"ఏమోనాయనా! ఆ టికెట్ మీద అలాగే రాసుంది"

అనుమానం... ఎయిడ్స్ వ్యాధిలా మారి ఆ వ్యక్తిని భయపెట్టి...

"ఏదీ ఆ టిక్కెట్? " అన్నాడు.

జేబులోంచి ఓ ఎర్రకాగితం తీసి ఇచ్చాడు సుబ్బారావు.

ఎపిఎస్ఆర్‌టిసి వారి జెట్ టిక్కెట్ అది.

"ఈ టిక్కెట్ ఎక్కడ కొన్నారు? " అడిగాడాయన!

"మావూరి బస్టాండ్‌లో సారూ? 'జెట్' టిక్కెట్ కొనండి. రాష్ట్రమంతటా ప్రయాణించండి అని రాసుంది. టిక్కెట్ ఖరీదు కూడా తక్కువేన్నాయనా. 'జెట్' అంటే మా అక్షరజ్యోతి కార్యక్రమంలో ఇమానం అని చెప్పారు. నీలాంటి మహానుబావుడెవరో ఈ వూళ్ళో ఇమానాలు ఆగుతాయని చెప్పారు. సరాసరి ఈడకే వచ్చాను. ఇంతకీ ఇమానం లేటుగా వస్తుందా సారూ? " అన్నాడు జేబులోంచి చుట్టపీక తీసి వెలిగించుకుంటూ.

కళ్ళు తిరిగి కిందపడ్డాడు పాపం ఆ బిజినెస్ ఎగ్జిక్యూటివ్.

**-డాక్టర్. కె.శివసుబ్బారావు**

---

## బావ- బామ్మర్ది

వీర వెంకట సత్యశివన్నారాయణ స్వామిగారు బహులౌక్యులు, మేధావి అని ప్రతీతి. ప్రతి విషయంలోనూ వారు అందరికీ అడిగినా, అడక్కున్నా సలహాలిచ్చి పారేస్తారు. వారి ముందుచూపుకీ, అఖండ ప్రజ్ఞకీ లోకం నివాళులర్పిస్తూ ఉంటుంది.

వారోనాడు ఏదో పనిమీద పట్నం వెళ్ళి పనిలో పనిగా పాతికేళ్ళనుంచీ వెళ్లని బామ్మర్ది ఇంటికి చుట్టంచూపుగా వెళ్ళారు. బామ్మర్ది ఇంట్లో ఫ్రిజ్జూ, కలర్ టీవీ, డైనింగ్ టేబిలూ వంటి హంగామా చూసి వీడు డబ్బంతా తగలేస్తున్నాడని ఆయన కుశాగ్ర బుద్ధికి తోచింది. అసలే ఆ బామ్మర్ది మీద చిన్న చూపు. ఏమీలేనివాడనీ, తెలివితక్కువవాడనీ ఆయన దృఢ అభిప్రాయం. అంచేత బామ్మర్దిని కాస్త హెచ్చరించి బాగుపడేద్దామని నిశ్చయించుకున్నవాడై, కాఫీ టిఫిన్లూ అయాక తాపీగా ప్రారంభించారు.

"ఏరా, ఎక్కడన్నా రెండు సెంట్లభూమి కొని పారెయ్యకపోయావా? పిల్లలు గలవాడివి. పదో పరకో కావాలంటే సర్దుతాలే" అన్నాడు పెద్దరికంగా.

కొనలేరనీ, కొనటానికి డబ్బు మిగల్లేదనీ బామ్మర్దికి పొదుపు,భవిష్యత్‌వంటి విషయాలమీద లెక్చర్లు ఇద్దామని రెడీ అయాడు.

"కొన్నాగా!" అన్నాడు బామ్మర్ది.

ఆశించని ఈ సమాధానానికి స్వామిగారు ఉలిక్కిపడ్డారు. లెక్చరెలా ఇవ్వాలో తెలీక తబ్బిబ్బై, "ఇకనేం! పునాదులు తీయకపోయావూ!" అన్నాడు రెండో అస్త్రంగా. 'ఇక్కడ చిక్కిపోతావురా మిడతంభొట్లూ' అనుకుంటూ!

"పునాదులేం ఖర్మ! ఓ కాంప్లెక్సే కట్టించాగా!" అన్నాడు బామ్మర్ది తాపీగా.







స్వామిగారు షాకైపోయి బామ్మర్ది మొహం లోకి పరిశీలనగా చూశాడు. అతడు అబద్ధ మాడుతున్న లక్షణాలేమీలేవు.

"అదేమిట్రా! మరయితే సొంతకొంప కట్టుకుని ఈ అద్దె ఇల్లేం ఖర్మ?" అన్నాడు అయోమయంగా.

"అది అద్దెకిచ్చానుగా మరి ఎలా కుదురుతుందీ?" అన్నాడు బామ్మర్ది సౌమ్యంగా.

"ఎంతకిచ్చావేం?" అన్నాడు స్వామిగారు.

"ఎనభైవేలకి!" అన్నాడు బామ్మర్ది. స్వామిగారు అదిరిపడ్డాడు.

"ఏమిటీ?" అన్నాడు.

"ఇరవై పోర్షన్లు షాపులు అయిదువేలు నాలుగువేలు చొప్పున అద్దెకిచ్చాను" అన్నాడు బామ్మర్ది ఒళ్ళు విరుచుకుంటూ.

"ఇరవై పోర్షన్లేమిట్రా? షాపులేమిట్రా?" అన్నాడు స్వామిగారు మరింత షాకైపోయి.

"పదిహేనేళ్ళక్రితం ఎకరం లెక్కన కొన్న జాగాలో ఓ కాంప్లెక్సులాగా పోర్షన్లు కట్టి అద్దెకిచ్చానన్నమాట. ఓ మినీకాలనీ అనుకో" అన్నాడు బామ్మర్ది వివరిస్తూ.

"మరి మాట మాత్రమన్నా ఎన్నడూ నాతో సంప్రదించావు కాదేమిటోయ్" నిష్టూరమాడాడు స్వామిగారు.

"నేను జాగా కొనేటప్పుడు నువు నీ మెట్టపొలాన్ని బేరం పెడుతున్నావు. నేను ఇళ్ళు కడుతున్నప్పుడు ఆఖరి మాగాణి చెక్క కూడా బేరం పెడుతుంటివి. ఇంక నిన్నేం సలహా అడిగేదీ?" అన్నాడు బామ్మర్ది నిజాయితీగా.

తన లౌక్యం, వ్యవహారజ్ఞానంఅంతా బామ్మర్ది తుప్పున కొట్టేస్తుంటే స్వామిగారికి రోషం పొడుచుకువచ్చింది. "అదేమిట్రా నా పరిస్థితులు బాగోలేక అమ్ముకున్నాననుకో. కానీ పెద్దముండావాణ్ని. నీకు వ్యవహారంలో సలహాలిచ్చేంత పాటి పనికిరాకపోతానా?" అన్నాడు కోపంగా.

"తాతల నాటి ని ఆస్తిని నిలుపుకోలేని నీ వ్యవహారజ్ఞానం నాకేం పనికివస్తుందీ? నీ పెద్దరికం నాకుమాత్రం ఏం మేలు చేస్తుందీ?" అన్నాడు బామ్మర్ది మొహమాటం లేకుండా.

వీడు మరీ చేతికందకుండా పోతున్నాడే అనుకుని "సరే! నా పెద్దరికం వ్యవహారానికి పనికిరాకుండా పోతే పోయిందిగానీ మరి పిల్లల్నెలా చదివిస్తున్నావ్? వాళ్లనేం చేద్దామనీ" అన్నాడు స్వామిగారు ఈ విషయంలోనైనా లెక్చరిచ్చే ఛాన్సేమన్నా దొరుకు

తుందేమోనని.

"ఆc ఎందుకొచ్చిన గొడవ? అదంతా స్కూలువాళ్ళే చూసుకుంటార్లే" అన్నాడు బామ్మర్ది నిశ్చింతగా.

"అదేమిట్రా? పెద్దాళ్లం మనం చూసుకోవాలి గానీ ఎవళ్ళో స్కూలు వెధవలు మన పిల్లల్ని చూసుకోవడమేవిట్రా? నీకింత కూడా ఇంగితం లేకుండా పోయిందేం? " అన్నాడు స్వామిగారు ఇంత సేపటికి బామ్మర్ది పిలక చేతికొచ్చిందని ఆనందిస్తూ.

"ఎందుకు చూసుకోరూ! ఏం దొబ్బుడాయ్, సంవత్సరానికి చెరో ఏభై వేలు వాళ్ళ ఎదాన కొడుతుంటినిగా" అన్నాడు బామ్మర్ది.

"సంవత్సరానికి ఏభైవేలేమిట్రా? ఇంతకీ ఏమిటంత శోభనాకారపు చదువు" భగ్గుమన్నాడు స్వామిగారు.

బామ్మర్ది తెలివితక్కువతనంమీద అతనికి మండుకొస్తోంది. బామ్మర్ది తెలివితక్కువ వాడన్న తన అంచనా తప్పుకానందుకు సంతోషంగా వుందతనికి. ఈ పాయింటు మీద ఇహ ఝాడించి పారేద్దామనుకున్నాడు.

"మరి కాన్వెంటు చదువంటే మాటలా ఏం? పిల్లలిద్దర్నీ ఊటీలో పడేసి చదివిస్తున్నాలే. ఏ అయ్యేఎస్సో అయిపోయేదాకా మరి వాళ్ళింటికి రారు. మనం ఇలా డబ్బులు పంపుతూండడమే" అన్నాడు బామ్మర్ది.

స్వామిగారి నెత్తిన బిందెడు నీళ్ళు గుమ్మరించినట్టయింది. "అది సరేనోయ్. ఇంతకీ ఎన్నేళ్ళయి ఈ చదువులు సాగుతున్నాయి? " అన్నాడు స్వామిగారు ఓటమినంగీకరించకుండా.

"ఆc. ఓ నాలుగేళ్ళయి అక్కడే ఉంటున్నార్లే" అన్నాడు బామ్మర్ది ఆవులిస్తూ.

స్వామిగారు గుండెలు బాదుకున్నాడు. "ఏమిట్రా నాలుగేళ్ళనుంచీ పిల్లలిద్దరి ముండా చదువులమీద నాలుగులక్షలు తగలేశావా? అంత తీపరంగా ఉందా ఏమిటి? డబ్బెక్కువైతే ఏ షేర్లలోనో పెట్టకపోయావా? ఈ పాటికి రెట్టింపై చచ్చేవిగా"

"నికరంగా లాభాలొచ్చే షేర్లలో ఓ పది లక్షల దాకా మదుపుచేసే ఉంచాలే" అన్నాడు బామ్మర్ది పళ్ళు కుట్టుకుంటూ.

స్వామిగారికి ఏం చేయటానికీ పాలుపోలేదు. బామ్మర్ది తనవేటుకి అందకుండా పోతున్నాడు. తన పెద్దరికం, వ్యవహార జ్ఞానం అంతా వీడిముందు బలాదూరయిపోతోందే అన్న ఉక్రోషంలో పడ్డాడు.

"ఆc ఈ షేర్ల తంతెవడికి తెలీదు? ఎనిమిదేళ్ళనాడే చూశాంగా. నిక్షేపంగా ఏ రైస్ మిల్లో కట్టుకుని కూచోక ఈ వెధవ్వేషాలేమిటి? " అన్నాడు పెద్దరికం పోనీకుండా.

"ఇదిగో బావా! నువు పెద్దోడివి. నువ్వు మా పెళ్లయ్యాక పాతకేళ్లకి మళ్ళీ ఇన్నాళ్ళకి వచ్చి నాకేం తెలివిలేదనీ, నీకే తెలివి ఉందని అనుకుంటేఎలా! ప్రపంచం ఇంకా అప్పటిలాగే ఉందనుకోవడం పొరపాటు. నీ జ్ఞానం అంతా పొలాలచుట్టూ, కొబ్బరితోటల చుట్టూనే తిరుగుతుంది. అంతకు మించి ప్రపంచం నీకు తెలీదు. అందుకే నువు పైకి రాలేకపోయావు. నీ పిల్లలు చదువురాక బీడీలు కాలుస్తూ గొడ్లకాడి కుర్రోళ్ళతో సావాసం చేస్తున్నారని నాకు తెల్సు" అన్నాడు బామ్మర్ది తొణక్కుండా.

స్వామిగారి మొహం పాలిపోయింది. బిత్తర మొహం వేసి, చేతి సంచీ పుచ్చుకుని వెళ్ళడానికి లేచాడు. "ఇదిగో అన్నయ్యా! పిల్లదాని పెళ్లికి డబ్బేమయినా కావలిస్తే మొహమాటపడబోకు. పదో [illegible] కావలిస్తే ఈయన సర్దుతార్లే" అంది బామ్మర్ది వెనకనుంచి, అతని చెల్లెమ్మ!

**–కె.ఆదిత్య భరద్వాజ**

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942. Nellore: 331250.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి పులుపంటే ప్రేమ ఎక్కువ !!






ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు... మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.










## Pickles
## ఏ పచ్చడంటే
## ఆ పచ్చడి సంసిద్ధ

[illegible] సోమాజిగూడ, హైదరాబాద్ 500 482.